# నవభారతం

## 1947 - 48



సీతంరాజు సుబ్రహ్మణ్య శర్మ,
బి. కాం. (ఆనర్స్)

14585

# పరిచయం

"నవ భారతం" అను పుస్తకము చదివినాను. ఆదునిక ప్రజాస్వామ్య ప్రభుత్వములలో రాజ్యాంగధర్మ నిర్వహణము ప్రజామోదముతో నడువక తప్పదు. ఈ ఆమోదము పక్షప్రాబల్యమునకు చెందినదా లేక రాజకీయ కక్షులయొక్క కార్యక్రమములను పఠించి, అవగతము చేసుకొని ఇచ్చినదా అనే విషయమును ఎప్పటి కప్పుడు ప్రజాప్రభుత్వములు గుర్తించుకొనవలయును. కార్యక్రమముల మంచి చెడ్డలను గ్రహించుకొనవలసిన బాధ్యతకూడ ప్రజానీకముపై నున్నది. పత్రికా పఠనమువలన ఈ పని చాలవరకు నెరవేరగలదు. కాని పత్రికలలో చదివినది ఎప్పటి కప్పుడు మరచిపోవుట తటస్థించుచుండును. గనుక ప్రతిసంవత్సరములో జరిగిన రాజకీయ, ఆర్థిక, సాంఘిక విషయములను గ్రంథముగ ప్రచురించుట చాల ముఖ్యమైన విషయము. ఈ యత్నమును శ్రీ సీతంరాజు సుబ్రహ్మణ్య శర్మగారు చక్కగా ఈ గ్రంథములో చేసియున్నారు. వారి భాష, విషయ విజ్ఞానము చాల బాగున్నవి. వారి ఈ నూతన యత్నము ప్రతిసంవత్సరము జరుగుగాక యని కోరుచున్నాను. అందులో యీ గ్రంథమును మాతృభాషలో వ్రాసియుండుట చాల ప్రశంసార్హము. శ్రీ సుబ్రహ్మణ్యశర్మగారు ఇటువంటి గ్రంథములు చాల తయారుచేసి, ఆంధ్రలోకమునకు సేవచేయుదురని ఆశించుచున్నాను.

మద్రాసు
27-8-48.

కళా వెంకటరావు,
మద్రాసు ప్రభుత్వ రివెన్యూ మంత్రి.

# విషయసూచిక

పుట.

# స్వాతంత్ర్యం

భారతదేశచరిత్రలో 1947 వ సం. ఆగస్టు 15 వ తేదీవంటి చరిత్రాత్మక మైన రోజులు చాల తక్కువ వున్నవి. దాదాపు 12 శతాబ్దాల తర్వాత భారతమాత పుత్రులు తమదేశములో తమ పరిపాలన ఆ రోజున ఏర్పరచుకున్నారు. మాతృభూమిలో కొంతభాగం పరాయి దేశంగా వీడిపోయినా, తక్కిన ప్రాంతంలో పరాయిరాజ్యాల పీడ పూర్తిగా, శాశ్వతంగా వదలిపోయింది. దాసిసత్వంలోనుంచి బైటపడి సర్వస్వతంత్రులమైన మనమేగాక మన సంతతివారుకూడ కొన్ని శతాబ్దాలవరకు ఆనాడు జరిగిన రక్తరహిత విప్లవాత్మక మార్పును ఆనందంతో, కృతజ్ఞతతో స్మరించుకుంటారు.

లార్డ్ మౌంట్‌బాటన్ సూచించిన జూన్ 3 వ తేదీ పథకాన్ని కాంగ్రెస్, లీగ్ నాయకులు ఆమోదించటంతో భారత స్వాతంత్ర్యం తోపాటు విభజనకూడ స్థిరపడింది. దేశ విభజనకు కాంగ్రెస్ నాయకులు గత్యంతరంలేక నే అంగీకరించారు. స్వాతంత్ర్య సముపార్జనకు చెల్లించ వలసిన మూల్యం అది అని వారు సరిపెట్టుకున్నారు. తాము చేసినపని సరియైనదేనని వారెన్నడూ చెప్పలేదు; అప్పటి పరిస్థితులలో గత్యం తరంలేక ఆపని చేయవలసి వచ్చిందని వారు అంగీకరిస్తున్నారు. ఇక ఇప్పుడు దేశవిభజన యుక్తాయుక్తాలను తరచి ప్రయోజనంలేదు.

1947 వ సం॥ జూన్ 3 వ తేదీ పథకంప్రకారం ఇండియా, పాకిస్థాన్ అధినివేశాలకు అధికారం దత్తతచేయటానికి "భారత స్వాతంత్ర్యచట్టా"న్ని బ్రిటిష్ పార్లమెంటు ఆమోదించింది. భారత దేశంపై బ్రిటిష్ పార్లమెంటుకు, చక్రవర్తికి వున్న సర్వాధికారాలు రద్దుచేసి, రెండు అధినివేశాలు స్థాపించటానికే ఈ బిల్లు ఉద్దేశింపబడినది. బ్రిటిష్ చక్రవర్తికి భారతసంస్థానాలకు వున్న సర్వసంబంధాలు, అధి కారదత్తతతో, తమంతటవే రద్దయిపోతవని తప్ప ఈ చట్టంలో సంస్థా-

కాలను గురించి విశేషమేమీ లేదు. అధికారబద్ధతత పర్యవసానంగా గవర్నర్ జనరల్ హోదాలోను, అధికారాలలోను కలిగే మార్పులు ఈ చట్టంలో చేర్చొన్నారు. ఇండియా, పాకిస్థాన్ అధినివేశాల శాసనసభలలో ప్యాసుచేయబడిన చట్టాలు, బ్రిటిష్ పార్లమెంటుకు ఇష్టం లేకపోయినాసరే అమలులోనికి వచ్చితీరతవనే నిబంధన ప్రకారం ఆ అధినివేశాల శాసనసభల సర్వస్వతంత్రత గుర్తింపబడినది. రెండు అధినివేశాల తరఫునా, వాటిమధ్య ఇప్పుడున్న వ్యవహారసంబంధాలు ఇకముందుకూడా యధాతథంగానే వుండాలనే ఒడంబడిక చేసుకో వచ్చునని, ఇకమీదట ఈ రెండు అధినివేశాల సంబంధాలు భారత ప్రభుత్వచట్టం, దాని రూల్సు, నిబంధనలప్రకారంగాని, తనకు యివ్వబడిన అధికారాన్ని పురస్కరించుకుని గవర్నర్ జనరల్ జారీచేసిన ఉత్తరువులప్రకారంకాని, నూతన శాసనాలద్వారాగాని, వాని రాజ్యాంగ పరిషత్తులు నిర్దేశించినట్లుగాని వుండవచ్చుననీ, అధినివేశాలు ఇంకా ఉద్భవించకమునుపే వాటినిగురించి ఒడంబడికలు చేసుకొనే అధికారం ఆయా అధినివేశ నాయకులకు వున్నదనీ ఈ చట్టంలో గుర్తింపబడినది. 1935 వ సం. భారతప్రభుత్వచట్టం కొన్నిమార్పులతో ఇకముందుకూడా వర్తిస్తుందని ఈ చట్టంలోనే తెలియజేశారు. ముందుగానే అన్నిపార్టీల నాయకులుకూడ బలుపుకుని వుండటంవలన 'భారతస్వాతంత్ర్యచట్టం' ఏమంత విమర్శకు గురికాకుండానే బ్రిటిష్ పార్లమెంటులో ప్యాసయింది.

జూన్ 3 వ తేదీ పథకంప్రకారం పంజాబ్, బెంగాల్ రాష్ట్రాల శాసనసభలు సమావేశమై విభజనవిషయం నిర్ణయించాలి. పంజాబ్ విభజన నిర్ణయింపబడితే, సరిహద్దురాష్ట్ర భవిష్యత్తు నిర్ణయించటానికి 'రిఫరెండం', బెలూచిస్థాన్ భవిష్యత్తు నిర్ణయించటానికి 'జిర్గా' సమావేశము జరుపవలసివుంది. బెంగాల్ విభజనే నిర్ణయమైతే అస్సాంలో ముస్లిం మెజారిటీ జిల్లా అయిన సిల్హెట్‌లో రిఫరెండం జరుపవలసి వుంటుంది. అందువలన ముందు పంజాబ్, బెంగాల్ రాష్ట్రాలు విభక్తం అవటమో, ఏకంగావుంటే ఇండియా, పాకిస్థాన్‌లలో దేనిలో చేరటమో

నిర్ణయించటానికి ఆ రాష్ట్రాల శాసనసభలు సమావేశపరచబడినవి. అనుకున్నట్లుగానే, ఈ రెండు రాష్ట్రాలను విభజించి, ఇండియా, పాకిస్థాన్‌లలో జేర్చవలసిందనే రాష్ట్ర శాసనసభలు నిర్ణయించాయి. అటుతర్వాత వెంటవెంటనే సరిహద్దురాష్ట్రంలో 'రిఫరెండం', బెలూచిస్థాన్ 'జిర్గా' సమావేశం, సిల్హెట్ జిల్లాలలో 'రిఫరెండం' జరిగాయి. బెలూచిస్థాన్‌లో ముస్లిమేతరుల సంఖ్య చాల తక్కువ. ఆ జిర్గాలో ముస్లిమేతరులు కొద్దిమంది మాత్రమే వున్నారు. ముస్లిములలో పాకిస్థాన్ వ్యతిరేకులు కొందరున్నా, పాకిస్థాన్‌లో జేరిపోవాలనే నిర్ణయం ఏకగ్రీవంగానే జరిగింది.

సరిహద్దురాష్ట్రంలో జూలై మూడవ వారంలో రిఫరెండం జరిగింది. సరిహద్దురాష్ట్రం స్వతంత్ర 'పఠాన్‌స్థాన్'గా ఏర్పడాలిగాని ఇండియా, పాకిస్థాన్‌లలో దేంట్లోను జేరకూడదనీ, కాబట్టి ఇండియా, పాకిస్థాన్‌లలో కొంట్లో జేరుతారనే ప్రశ్నపై జరిపే 'రిఫరెండం'లో పాల్గొనరాదనీ సరిహద్దు గాంధీ, ఆయన అనుచరులు నిర్ణయించారు. 'రిఫరెండం'లో పాల్గొనవద్దనే వీరు ప్రజలలో ప్రచారంచేశారు. ఆ రాష్ట్రంలో డా. ఖాన్‌సాహెబ్ ప్రధానిత్వమున కాంగ్రెస్ ప్రభుత్వమున్నా, 'రిఫరెండం' ఏర్పాట్లన్నీ పాకిస్థాన్ పక్షపాతియైన గవర్నర్ చే నిర్వహింపబడి, మెజారిటీపార్టీ పాల్గొనకపోయినా 'రిఫరెండం' జరపటానికే నిశ్చయింపబడింది. పఠాన్ ప్రజలలో సరిహద్దు గాంధీకి అసాధారణ పలుకుబడి వున్నా, హిందుస్థానా, పాకిస్థానా అన్న ప్రశ్న వచ్చినప్పుడు, వారి నోళ్ళు ఆయన ఆశించినంతంగా కట్టివేయలేకపోయాడు. ఆయన ఆ దేశాన్ననుసరించి వోటర్లలో నూటికి 49 మంది 'రిఫరెండం'లో పాల్గొనలేదు. పాకిస్థాన్‌లో జేరటానికి నూటికి 50.49 మంది మాత్రమే అంగీకరించారు. మొత్తం వోటర్లు 5,72,798 వుండగా 2,89,244 గురు మాత్రమే పాకిస్థాన్‌లో జేరటానికి అంగీకరించారు. సగంమంది వోటర్లు బాయ్‌కాట్ చేసినా, బ్రిటిష్‌ప్రభుత్వం పాకిస్థాన్‌వైపు వున్నది కాబట్టి 'రిఫరెండం' సక్రమమైందేననీ, సరిహద్దురాష్ట్రం పాకిస్థాన్‌లో జేరిపోవలసిందేననీ నిర్ణయించారు.

సిల్హెట్ జిల్లా రిఫరెండంలో 55,578 వోట్ల మెజారిటీతో పాకిస్థాన్ నెగ్గింది. తూర్పు బెంగాల్‌లో జేరిపోవటానికి అనుకూలంగా 2,36,619 వోట్లు, అస్సాంలో వుండిపోవటానికి అనుకూలంగా 1,84,041 వోట్లు వచ్చాయి. సిల్హెట్ జిల్లాలో ముస్లింలు అధిక సంఖ్యాకులుగావున్న ప్రదేశాలను విడదీసి తూర్పుబెంగాల్‌లో కలిపి వేశారు.

జూన్ 3 వ తేదీ దేశవిభజన పథకం ఆమోదింపబడినవెంటనే కేంద్రప్రభుత్వ ఆస్థి, అప్పులపంపకం ప్రారంభమైంది. లార్డ్ మౌంట్ బాటన్ అధ్యక్షుడుగా, సర్దార్ పటేల్, డా. రాజేంద్రప్రసాద్, జిన్నా, లియాకతాలీఖాన్, సర్దార్ బలదేవ్‌సింగ్‌లు సభ్యులుగా ఒక 'విభజన సంఘం' ఏర్పడి, ఆయా శాఖలను, ఆస్థి, అప్పులను పంచటానికి అనేక ఉపసంఘాలను నియమించి, వాటి కార్యకలాపలను సమీక్షిస్తూ, సమన్వయపరుస్తూ, విభజన తతంగం త్వరలో ముగిసేటట్లు చేసింది. ఆగస్టు 15 వ తేదీనాటికి పరిష్కరింపబడకుండా వున్న విభజన సమస్యలను, ఆటుతర్వాత పరిష్కరించుకోవటానికి, ఏదైనా అభిప్రాయ భేదంవస్తే మధ్యవర్తిత్వ సంఘసహాయం కోరటానికి ఉభయపక్షాల నాయకులు సమ్మతించారు.

పంజాబ్, బెంగాల్ రాష్ట్రాలను, సిల్హెట్ జిల్లాను విభజించి, ఇండియా, పాకిస్థాన్‌ల సరిహద్దులు నిర్ణయించటానికి సర్ సిరిల్ రాడ్‌క్లిఫ్ అధ్యక్షతన 'సరిహద్దు సంఘా'లు ఏర్పాటు చేశారు. ఈ సంఘాలలోని హిందూముస్లిం ప్రతినిధులు తమలో తాము ఒక అంగీకారానికి రాలేక, అంతిమ తీర్పుబాధ్యత రాడ్‌క్లిఫ్‌కే వదలివేశారు. ఆయన నిర్ణయం ప్రకారం కట్టుబడి వుండటానికి ముస్లింలీగ్, కాంగ్రెస్ నాయకులు ఆమోదించారు. ప్రత్యక్ష పర్యటనగాని, ఆయా ప్రాంతాల వ్యక్తులను సంప్రదించటంగాని జరుపకుండానే, తనకు దాఖలు చేయబడిన కాగితాల ఆధారంతో రాడ్‌క్లిఫ్ తన 'తీర్పు' తయారుచేశాడు. ఈ తీర్పు ఉభయపక్షాలకు అసంతృప్తికరంగానే వుండిపోయింది కాని హిందువుల

కన్న ముస్లింలకే ఎక్కువ లాభకరంగావున్నదని నిస్సంశయంగా చెప్ప వచ్చును. ఒక రైలుమార్గాన్నంతా తూర్పుబెంగాల్‌కు యివ్వాలని చెప్పి, హిందూ మెజారిటీజిల్లా ఖుల్నాను పూర్తిగా పాకిస్థాన్‌లో కలిపి వేసి, పశ్చిమబెంగాల్‌ను రెండు ముక్కలుచేసి, బెంగాల్‌కు తీరని అన్యాయం చేశాడు. చిట్టగాంగ్ కొండప్రాంతాలు, ప్రజలందరు ముస్లిమేతరులే అయినా, పాకిస్థాన్‌కు కట్టబెట్టాడు. తూర్పుబెంగాల్ సరిహద్దులు బీహార్ సరిహద్దులవరకు వ్యాపించునట్లుచేసి, పాకిస్థాన్‌కు సహాయం చేశాడు. పశ్చిమపంజాబ్‌లో సిక్కుల పుణ్యక్షేత్రాలను-ఒక్క అమృతసర్ తప్ప - అన్నింటిని పాకిస్థాన్ ప్రాంతంలో జేర్చివేశాడు. విధిలేక, ముందు వాగ్దానంచేసి వుండబట్టి, ఈ తీర్పును తల వొగ్గవలసి వచ్చింది. భారతదేశం ఇండియా, పాకిస్థాన్‌లుగా విడిపోవటంవల్లనే ఇండియా నైసర్గిక సరిహద్దులు, నైసర్గిక రక్షణ నాశనమైపోయాయి; ఈ అవకతవక తీర్పుతో సరిహద్దులు ప్రమాదభరితములై పోయినవి.

1947 వ సం. ఆగస్టు 15 వ తేదీతో విదేశపరిపాలన పీడవదలి పోతున్నదని సంతోషం కలిగినా, భారతప్రభుత్వానికి వారసత్వంగా వస్తున్న సమస్యలను తలచుకున్నప్పుడు మనసు కలవరపడుతుంది. భారత దేశంలో క్రొత్తగా ఉత్పన్నమౌతున్న సమస్యలను సక్రమంగా పరిష్క రించలేక, నింద మోయవలసివస్తుందనే భయంతోనే బ్రిటిష్‌పాలకులు వైదొలగటానికి అంగీకరించారు. నూతన భారతప్రభుత్వం, ఒక మునిగి పోతున్న నావను, ఒక దివాళా తీస్తున్న వ్యాపారాన్ని, అంటగట్టు కున్నట్లయింది. దేశవిభజన, సంస్థానాల సమస్యలు క్రొత్తగా వచ్చిపడి, ఎంతటి ధీరుడికైనా అధైర్యం కలిగించే పరిస్థితిని కలిపించాయి. ఇన్నాళ్ళ తర్వాత మనకు స్వాతంత్ర్యం లాభిస్తున్నదనే ఒక్కవిషయం తప్ప, సంతోషింపదగింది మరేమీ కనిపించలేదు. అయితే, అదే వీటన్నిటికన్న పదివేలపెట్టుకదా!

స్వాతంత్ర్యం లభిస్తుందన్న మరుక్షణానవే సంస్థానాల సమస్య ఆందోళన జనకమైనది. అధికారదత్తత జరుగగానే సంస్థానాలపై

బ్రిటిష్ ప్రభుత్వానికివున్న సార్వభౌమాదికారం రద్దయిపోతుందనీ, సంస్థానాధీశ్వరులు ఇదివరకు బ్రిటిష్ ప్రభుత్వంతో చేసికొన్న ఒడంబడికలన్నీ రద్దయి పోతవనిమాత్రమే భారత స్వాతంత్ర్యచట్టంలో తెలియజేశారు. ఏసంస్థానమైనా స్వతంత్ర రాజ్యంగా ఏర్పడదలిస్తే, దానిని తాము గుర్తించమనీ, సంస్థానాలన్నీ ఏదో ఒక అధినివేశంలో జేరిపోవలసిందేనని బ్రిటిష్ మంత్రులు మాటలలో చెప్పారేగాని చట్టంలో పొందుపరచలేదు. ఇందువలన భారతదేశం ఇండియా, పాకిస్థాన్‌లుగా రెండుగాగాక, దాదాపు 600 ముక్కలుగా విభాగమైపోయే ప్రమాదం ఏర్పడింది. స్వాతంత్ర్య చట్టంలో కావాలని వుంచిన ఈలోటును, పురస్కరించుకుని సర్వస్వతంత్రత ప్రకటించుకోవటానికి తిరువాన్కూర్ సంస్థానం ముందడుగువేసింది. తిరువాన్కూర్ పట్టుదల నెగ్గినట్లయితే, బహుశః ఏసంస్థానంకూడా భారతదేశంలో జేరివుండేదే కాదు. కొద్ది రోజులు చికాకు కలిగించినా, తిరువాన్కూర్ మనకు మంచినే చేసింది. ప్రజాభిప్రాయాన్ని కాలతన్ని ఒక్కక్షణం నిలువలేమని సంస్థానాధీశ్వరులందరు గ్రహించుకున్నారు. సంస్థానాలపట్ల బ్రిటన్ వహించిన వైఖరి అప్పటికి మనకు అసంతృప్తికరంగా, ద్రోహంగా కనిపించినా, బ్రిటన్ ఇదివరకు సంస్థానాధీశ్వరులకు చేసిన వాగ్దానాలవల్ల అంతకన్న దానికి గత్యంతరం కాకపోయింది. క్రొత్తగా ఏర్పడుతున్న భారత ప్రభుత్వం సంస్థానాల సమస్యను పరిష్కరించి, దేశఐక్యతను కాపాడ గలదా అను భయమే దేశభక్తులందరినీ కలవరపెట్టింది.

దేశంలో ఆహారము, ఇతర జీవితావసర వస్తువులు కొరతగా వుండి, ధనోల్బణము, ధరలు నానాటికి పెరుగుతూ, ప్రజల కష్టములు, దానితోపాటు ప్రభుత్వంపట్ల అసంతృప్తి నానాటికి ప్రబలిపోతు న్నాయి. డబ్బిచ్చి కొనటానికికూడా విదేశాలలో ఆహారధాన్యాలు సరిగా దొరకటం లేదు; వాటిధర నానాటికి పెరిగిపోతున్నది దేశంలో ఉత్పత్తి పెరగటం లేదు; అధికాహారోత్పత్తి ఉద్యమము విఫలమై పోయింది. జనాభాలో సగానికి సగంమంది రేషన్‌పై ఆధారపడి

వున్నారు; రేషన్ ప్రమాణం 16 ఔన్సులనుంచి 8, 10 ఔన్సులవరకు తగ్గించినా ఆహారపు కొరత తీరకుండా వున్నది; ప్రభుత్వసేకరణ విధానం సక్రమంగా అమలు జరుగకపోగా ప్రజలలో అసంతృప్తి కలిగిస్తున్నది. ఇతర జీవితావుసరవస్తువులన్నీకూడా కరువుగానే వున్నవి. కంట్రోల్ విధానం ప్రభుత్వోద్యోగులలోను, వర్తకులలోను అవి నీతికి దారితీసి, బ్లాక్ మార్కెట్ను సృష్టించి, ప్రభుత్వ ప్రతిష్టను భంగకరంగా వుంది. దేశంలో పారిశ్రామిక ఉత్పత్తి అధికం చెయ్యటానికి ముడిపదార్థాలు, క్రొత్త యంత్రసామగ్రి కొరతగా వుండి, రవాణా ఒక సమస్యగా పరిణమించి, యజమానుల - కార్మికుల సంబంధాలు నానాటికి విషమించిపోతూ, అధికోత్పత్తి జరగకపోగా, 1945 వ సం. లో కన్నా ఉత్పత్తి ఆందోళన జనకంగా పడిపోయింది. ఈ వస్తువులన్నీ విదేశాలనుంచి దిగుమతి చేసుకోవటానికి తగిన విదేశనాణెముల నిలువలు లేవు. జీవన వ్యయంతోపాటు జీతాలు పెరగడంలేదని కార్మికులు, ఉద్యోగులు, పారిశ్రామికాభివృద్ధికి పన్నులభారం అధికంగా వున్నదని పెట్టుబడిదారులు అసంతృప్తి జెందుతున్నారు. ఇన్నాళ్ళు ఇటువంటి చిక్కు సమస్యలన్నిటికి కారణం విదేశపరిపాలనేనని ఎత్తిచూపే వాళ్ళం. ఇప్పుడా ఆ సమస్యలు అతి విషమమైపోయినతర్వాత మనమే పరిష్కరించవలసివచ్చి, ఏకొద్దిలోటుపాటు జరిగినా, ప్రభుత్వ ప్రతిష్ట దెబ్బతినే టట్లున్నది.

భారతదేశంనుంచి కొన్ని ప్రాంతాలు విడిపోయి పాకిస్థాన్‌గా ఏర్పడాలని ఘట్టిగా వాదించిన ముస్లింలందరు ఈదేశంలోనే వుండిపోయే టట్లున్నారు. ముస్లింలు మెజారిటీగావున్న రాష్ట్రాలలోకన్న అల్పసంఖ్యాకులుగా వున్న రాష్ట్రాలలోనే పాకిస్థాన్ ఉద్యమానికి ఎక్కువ బలం వున్నది. ముస్లింలీగ్ ఇండియాపట్ల భక్తివిశ్వాసాలుగల సంస్థ అని అంగీకరించడం, ఆత్మద్రోహంచేసుకోవడమే అవుతుంది. దేశ విభజనకు ఇప్పుడు అంగీకరిస్తున్నాము కాబట్టి, ఇన్నాళ్ళు దేశవినాశకాముకులుగావున్న లీగర్లందరు ఒక్కనాడు; తెల్లవారేసరికి, దేశ

భక్తులై, తమ పూర్వ జీవితాలను విస్మరిస్తారా? తాము, తమ తాత ముత్తాతలు నివసించిన ఈ దేశాన్ని మోసంజేసి, ద్రోహంచేసి, పాకిస్థాన్ పంచమాంగదళంగా తయారవుతారా? జనాభా మార్పిడికి కాంగ్రెస్ ఎన్నడూ అంగీకరించలేదు. ఇకముందు అంగీకరించదుకూడాను. భారత దేశ సరిహద్దులలోకి చొచ్చుకునిపోయివున్న పాకిస్థాన్, ఈదేశంలోని మెజారిటీవర్గ వినాశనాన్ని కాంక్షిస్తున్న ముస్లింలీగ్ పాలనలోవుండి, ఆరితేరిన పంచమాంగదళం దేశమంతటా వ్యాపించి వుండగా ఏనాటికైనా, ముస్లిం సామ్రాజ్య స్థాపనకు ప్రయత్నించకుండా వుంటుందా?

ఇండియాలోనే కాంగ్రెస్‌తో ఏకీభవించని హిందూమహాసభ ఆర్. ఎస్. ఎస్. కమ్యూనిస్టు పార్టీలున్నాయి. ఇప్పుడు లభిస్తున్న స్వాతంత్ర్యాన్ని వినియోగించే విధానాన్నిగురించి వీరు అనేకవిధాలుగా కలలుకంటున్నారు. పైగా, వీరు దౌర్జన్యవాదులు. దేశంలో ఏనాడైనా కల్లోలం ప్రారంభించి, అధికారం హస్తగతంచేసుకోవటానికి ప్రయత్నించవచ్చును. ఈ అంతర్యుద్ధం వస్తుందా? తప్పదా? వస్తే ఏమవుతుంది?

అంతర్జాతీయ రాజకీయాలు శరవేగంతో పురోగమిస్తూ, విషమిస్తున్నవి. బ్రిటన్, అమెరికా ప్రజాస్వామ్య శక్తులకు, రష్యా కమ్యూనిస్టుశక్తికి సంఘర్షణ తప్పనట్లున్నది. నూతనంగా స్వతంత్రమైన భారత దేశం, తాము స్వతంత్రం యిచ్చాము కాబట్టి కృతజ్ఞతతోనైనా తమ ప్రక్కనే వుంటుందని ఒకవర్గము, ఏదో ఒకవిధంగా విప్లవంద్వారానైనాసరే, తమకు అనుకూల ప్రభుత్వం ఏర్పాటుచేసుకోవాలని రెండవ వర్గము ఆశిస్తుండడం సహజము. పరదేశ పాలననుండి ఇప్పడే విముక్తమైన భారతదేశం, మరల ఈవిధంగా, ఏదో ఒక వర్గానికి అనుబంధంగా వుండి, నూతన దాస్యం చేయవలసిందేనా? ఏవర్గంలోను చేరకుండా, ఉభయులకు మంచిగావుండి మన ప్రయోజనాలు సాధించుకోగలమా? ఒకచేతితో పుచ్చుకున్న స్వాతంత్ర్యాన్ని, వేరొకచేతిలో జారవిడువ వలసివస్తుందా?

దేశంలో తగినంత సైన్యం, ఆయుధసామగ్రి, పారిశ్రామికాభివృద్ధి కనిపించదు. పరిపాలనా యంత్రంలోను, కాంగ్రెస్ వాదులలోను

అవినీతి, లంచగొండితనం పెరిగిపోతూ, ప్రజలలో అసంతృప్తికి కారణమౌతున్నాయి. బ్రిటిష్ పాలకులచే తర్ఫీదు చేయబడి, జాతీయదృక్పథమే లేని ఉద్యోగవర్గం క్రొత్త పరిస్థితులకు తగినట్లు, ఒక్కమాటుగా, మారగలదా? ఏవంక జూచినా ప్రభుత్వంలో ఏశాఖను చూచినా సమస్యలు, ప్రశ్నలేగాని సంతోషించదగినదేమీ కనిపించటంలేదు. ఇప్పుడేర్పడ్డ జాతీయ ప్రజాప్రభుత్వం ఈ సమస్యలను సంతృప్తికరంగా, వెంటనే పరిష్కరించగలదా?

అశోక ధర్మచక్రాంకితమైన త్రివర్ణపతాకం భారతదేశ పతాకంగా నిర్ణయించడం అందరికి సంతృప్తి, సంతోషము కలిగించింది. భారతదేశానికి పూర్వపు ఔన్నత్యం లభింపజేసి, అప్పటి సత్సాంప్రదాయాలప్రకారమే ఇకముందుకూడా వ్యవహరించగలమని ప్రపంచానికంతకు మన పతాకంద్వారా చాటుతున్నాము. పొట్టనిండా తిండీ, కట్టడానికి సరియైన గుడ్డ లేకపోయినా ప్రతి భారతీయుడూ, ఎన్ని క్లిష్టసమస్యలొరానున్నవని తెలిసినా, భారత ప్రభుత్వమూ ఆగస్టు 15వ తేదీన స్వాతంత్ర్యోత్సవం వైభవోపేతంగా జరుపుకున్నారు. అంతటి చరిత్రాత్మకమైన సంఘటనను చూడటానికి, దానిఫలితం ప్రథమంగా పొందటానికి నోచుకున్న తమజన్మ సఫలమైనదని, తమపితరుల కోర్కెలు తీర్చి పితౄణము తీర్చుకొనగలిగామని భారతీయులు ఆనందపరవశులైనారు. చరిత్రకందని పూర్వకాలంలో జరిగిన భారత కథను, ఆనాటి భారతదేశపు ఔన్నత్యమును ఊహించుకుని భారతీయులు ఈనాటికికూడా ఉప్పొంగిపోతున్నారు. అంతటి ఔన్నత్యాన్ని తిరిగి పొందటానికి అవకాశం ఇప్పుడు లభించింది. నవభారతదేశంలో నవభారతాన్ని సృష్టించి, మాతృదేశానికి మనఋణం తీర్చుకోవటమే మన విద్యుక్తధర్మం అన్న దృఢనిశ్చయమే ఈనాడు భారతప్రజలందరి హృదయాలలోను ప్రస్ఫుటమైంది. ఆ పథంలో ఎంతవరకు మనం విజయవంతంగా పురోగమిస్తున్నామో పరిశీలించుకోవడమే - గత సంవత్సరం స్వతంత్ర భారతప్రజాప్రభుత్వం సాధించిన కార్యకలాపలను సమీక్షచేయడమే— సంతోషకరమైన ఈ స్వాతంత్ర్య దినోత్సవంనాడు మనంచేయవలసిన పని.

# కాందిశీకులు

స్వతంత్ర భారత ప్రజాప్రభుత్వము మొట్టమొదటగా ఎదుర్కొనవలసి వచ్చినది కాందిశీకుల సమస్య. ప్రపంచములో శాంతికాలములో ఇదివరకెన్నడు జరుగనంతటి సంక్షోభము, కనీ వినీ ఎరుగనంత పెద్దపెట్టున జనాభామార్పిడి అకస్మాత్తుగా ప్రారంభమై భారతప్రభుత్వము కొన్ని నెలలపాటు ఏ ఇతరవిషయము ఆలోచించటానికి వీలులేకుండా చేసివేసెను. ఆగస్టు 15 వ తేదీ తర్వాత తూర్పు, పశ్చిమపంజాబ్‌లలో జరిగిన దురంతాలు భారతీయులందరి మనస్సులలోను దుస్సహమగు ఆవేదనను కలుగజేసినవి. ఆ క్రూరకృత్యములకు గురియైన బాధితులు తాము ఇంకా జీవిస్తున్నామనే విషయాన్నే నమ్మలేనంత విభ్రాంతులైపోయినారు. అమాయకులు, నిర్దోషులునగు ప్రజలపై జరిగిన ఈ దురంతాలకు ఇండియా, పాకిస్థాన్ ప్రభుత్వాలు, కాంగ్రెస్, ముస్లింలీగ్ లుకూడా బాధ్యతవహించి, నిందమోయవలసివుంటుంది.

ముస్లింలీగ్ పాకిస్థాన్ తీర్మానాన్ని లాహోర్ సమావేశంలో అంగీకరించినప్పటినుండీ మనదేశంలో మతదురహంకారము, మతద్వేషము హెచ్చుపెరిగిపోవటం ప్రారంభమైంది. 1946 వ సం. ఆగస్టులో ముస్లింలీగ్ ప్రత్యక్షప్రతిఘటన ప్రారంభించటంతో, కలకత్తా సంఘటనలతో, మతసంక్షోభం దౌర్జన్యవ్యాపంలో ప్రత్యక్షమైంది. అప్పటినుండి దేశంలో ఏదో ఒకమూల ఎప్పుడూ ఈ మహామారికి నైవేద్యం జరుగుతూనేవుంది. మతకలహాల బాధపడలేకనే, దేశవిభజనతోనైనా ఇవి చల్లారిపోగలవనే ఆశతో, కాంగ్రెస్ నాయకులు జూన్ 3 వ తేదీ పథకాన్ని ఆమోదించారు. 1947 వ సంవత్సరం ఏప్రిల్ 15 వ తేదీన గాంధీ జిన్నాలు సంయుక్తంగా చేసిన 'శాంతి విజ్ఞప్తి' కేవలం నిరర్థకమైపోయింది. ఆ నెలంతా కలకత్తా, ఢిల్లీ, లాహోర్, కాన్పూర్ నగరాలలో కలహాలు జరుగుతూనే వుండెను. మే నెల 14, 15 తేదీలలో

లాహోర్‌లో అప్రకటిత యుద్ధాలే జరిగినవి. జూన్, జులై నెలలోకూడా కలహాలు జరుగుతూనే వుండెను. జూన్ 3 వ తేదీ పథకాన్ని ఉభయ పక్షాలు అంగీకరించినతర్వాత మతకలహాలు తగ్గిపోలేదుసరికదా, సరిహద్దులు అనిశ్చితంగా వుండటంవలన ఆ అనిశ్చితప్రాంతాలలో మరీ పెరిగిపోయాయి. (జులై 3 వ తేదీనాటికి, అనగా ఒక నెలరోజులలో ఈ ప్రాంతాలలో 220 మంది మరణించారనీ, 900 మందికి గాయాలు తగిలినవనీ ప్రభుత్వం ప్రకటించింది) అసలు సంఖ్యలు ఇంతకు అయిదారు రెట్లైనా వుంటాయని పరిస్థితు లెరిగినవారందరూ అంగీకరిస్తారు. సరిహద్దుసంఘనిర్ణయాలు తెలియకముందు తెలియలేదు కాబట్టీ, తెలిసిన తర్వాత అవి అసంతృప్తికరంగా వున్నవి కాబట్టీ కలహాలు జరుగుతూనే వచ్చాయి. ఆగస్టు (11-13 తేదీలలో ఒక్క లాహోర్ పట్టణంలోనే 200 మంది మరణించారు; 300 మందికి గాయాలు తగిలాయి.) ఆగస్టు 15 వ తేదీనాడుమాత్రం అంతా ప్రశాంతంగానే వుంది.

సరిహద్దులవిషయమై అంతిమ నిర్ణయం జరిగి, తమ తమ ప్రాంతాలలో ఉభయప్రభుత్వాలు కుదటపడి, శాంతి, భద్రతలు కాపాడటానికి సమర్థయయ్యేటంతవరకు (రెండు పంజాబ్‌లలోను శాంతి, భద్రతలు కాపాడటానికి విభజనసమయంలో 'సరిహద్దుసైన్యం' ఏర్పరచి, (జనరల్ రీస్‌ను) దానికి (కమాండర్‌గా నియమించారు) సరిహద్దులు నిర్ణయమైన తర్వాత, రెండువైపులా ఎట్టి కల్లోలము జరుగకుండా శాంతిని కాపాడటమే వీరు నిర్వహించవలసిన పని. ఈ పని నిర్వహించటానికి వుండవలసినంత నిష్పాక్షికత, చతురత, తెలివితేటలు జనరల్‌రీస్‌కు లేవు. ఇతడు ముస్లింపక్షపాతి, దీనికితోడు ముస్లింలు చక్కని చాతుర్యంతో ఈయనను ఉపయోగించుకున్నారు. పంజాబ్ విభజన సిక్కులకు అయిష్టమనీ, ముస్లింలపై కసితీర్చుకోవటానికి సిక్కులు ఆతృతపడుతున్నారనీ జనరల్‌రీస్‌కు నచ్చజెప్పి, తూర్పుపంజాబ్‌లోనే ఆయనసేన ఎక్కువగా కేంద్రీకరింపజేశారు. పంజాబ్‌లో పెద్దపెద్ద ఉద్యోగులందరు ముస్లింలే కావటంవల్లనూ, సహజంగా ముస్లింపక్షపాతి కావటంవల్లనూ జనరల్

రీస్ వారిమాటలు విన్నాడు. (ఆగస్టు 15 వ తేదీ తర్వాత పశ్చిమపంజాబ్‌లో ముస్లింలు తమ హత్యాకాండ ప్రారంభించారు) ఆశ్వారూఢులైన సిక్కులు గ్రామాలలో హింసాకాండ జరుపుతున్నారని ముస్లింప్రముఖులు (జనరల్ రీస్‌కు ఫిర్యాదుచేస్తారు.) దానిపై ఆగ్రామాలలో ఆయన కర్ఫ్యూ ప్రవేశపెడతాడు. అప్పుడు ఒకముస్లిం బయలుదేరి, ముస్లిమేతరుల ఇళ్ళకు వరసగా నిప్పంటిస్తాడు. గగ్గోలుపడుతూ వారు బయటకు వచ్చి, గుమిగూడగానే కర్ఫ్యూ ఉత్తరువు ఉల్లఘించారంటూ, అప్పటివరకూ అంతా చూస్తూవూరుకున్న పోలీసులు కాల్పులు సాగిస్తారు. గ్రామంనుంచి పారిపోదామంటే, సిక్కు ఆశ్వికులు రాకుండా గ్రామం చుట్టూ కాపలాకాస్తున్న సైనికులు కాల్పులు ప్రారంభిస్తారు. పోలీసుల సహాయంతో ముస్లింలు ఆడవారిని ఎత్తుకుపోవటం, దోచుకోవటం, నరికివెయ్యటం ప్రారంభించి ముస్లిమేతరులను రూపుమాపుతారు. ఎవరైనా పెద్ద అధికారుల దగ్గర మొరపెట్టుకుంటే, "మీరు కర్ఫ్యూలో ఉల్లంఘించారు. మేమేమి చెయ్యం?" అంటారు. కాలిపోతూన్న ఇండ్లలోనుంచి బైటికిరావటం వారిదృష్టిలో గొప్పతప్పే! ఈ ఉపాయంతో, (జనరల్ రీస్ సైన్యసహాయంతో షేక్‌పూరాజిల్లాలోని) ముస్లిమేతరులనందరినీ (4, 5 రోజులలోనే హతమార్చివేశారు.) ఈసంగతి ఢిల్లీ ప్రభుత్వానికి తెలిసి, పండిట్ నెహ్రూ, లియాకతాలీఖాన్‌లు ఆజిల్లా అంతా పర్యటిస్తే, ఎక్కడా సిక్కుఆశ్వికుడుగానీ, చచ్చిన గుర్రంగాని కనిపించనేలేదు. ఇతర జిల్లాలకుకూడా ఈఘోరం వ్యాపించకుండా అంతటితో ఆపివేశారు. కాని ఆజిల్లాలలోకూడా కల్లోలం జరగకపోలేదు. ఆగస్టు 20 వ తేదీనాటికే, లాహోర్‌లోని మూడులక్షలమంది ముస్లిమేతరులు భారతదేశం చేరటానికి రోడ్డుపైకి వచ్చేశారు. తూర్పుపంజాబ్‌లోకూడ సంక్షోభం ప్రారంభమైంది. కాని జనరల్ రీస్ సైన్యాలు ఇక్కడ ఎక్కువగా వుండటంవల్ల, జననష్టం ఎక్కువ జరుగలేదు.

మొత్తంమీద రెండువైపులనుంచీ, (అన్ని జిల్లాలనుంచీ, జనసమూహం వెళ్ళిపోవటం ప్రారంభించారు) పండిట్ నెహ్రూ, సర్దార్

బలదేవ్ సింగ్, లియాకతాలీఖాన్, అబ్దుర్ రాబ్ నిష్టార్‌లు రెండువైపుల అన్ని జిల్లాలలోను పర్యటించారు. రెండురాష్ట్రాలలోను శాంతిభద్రతలను కాపాడడమే తమ ఆశయమనీ, ఇందుకు ఎట్టి కఠినచర్యలైనా వెనుదీయకుండా అమలుజరుపుతామనీ నెహ్రూ, లియాకతాలీలు అనేక సంయుక్త ప్రకటనలుచేశారు. వీరి ప్రకటనలు పంజాబీ, ఉర్దూ, గురుముఖీలలో అచ్చువేసి అసంఖ్యాకంగా పంచిపెట్టారు. ఇండియా పాకిస్థాన్‌ల "సంయుక్త రక్షణ సంఘం" ఆగస్టు 29 వ తేదీన న్యూఢిల్లీలో సమావేశమై, జనరల్ రీస్ ఆధ్వర్యాన నడుస్తున్న పంజాబ్ సరిహద్దు సైన్యాన్ని రద్దుచేసి, ఏదేశానికాదేశం ఒక్క రక్షణసైన్యాన్ని స్థాపించుకోవటానికీ, వీటిరెండిటి ప్రధానకార్యాలయాలు లాహోర్ లోనే స్థాపించి, రెంటినీ సమన్వయపరచి నడిపించటానికీ, తూర్పు పంజాబ్ జిల్లాలలో శాంతి భద్రతలకు భారత కార్యాలయము, పశ్చిమ పంజాబ్‌లో శాంతిభద్రతలకు పాకిస్థాన్ కార్యాలయము బాధ్యత వహించటానికీ, బాధితులను రక్షణతో ఒకదేశంనుండి రెండవదేశానికి పంపించటానికీ నిర్ణయించింది. రెండుదేశాల ప్రధానులు, మంత్రులు, పెద్ద ఉద్యోగులు సెప్టెంబరు 3 వ తేదీన మరల సమావేశమై, శాంతి భద్రతల నేర్పరచటానికీ, అల్పసంఖ్యాకుల రక్షణకూ కొన్ని ముఖ్య నిర్ణయాలు చేశారు. రెండురాష్ట్రాలలోను శాంతిభద్రతలు కాపాడటానికీ, పరస్పర సహకారంతో బాధితులను వీలైనంత త్వరల్లో మార్చుకోవటానికీ, కాందిశీక శిబిరా లేర్పరచి, వాటిలో సౌకర్యా లేర్పరచి, రక్షించటానికీ, కల్లోలసమయంలో బలవంతంగా ఆక్రమించుకున్న, ఎత్తుకుపోయిన ఆస్తిపాస్తులను తిరిగి వప్పజెప్పటానికీ, ఇప్పుడు జరిగిన మతాంతరీకరణలను, బలవంతపు పెండ్లిండ్లలను గుర్తించకుండా వుండటానికీ, కాందిశీకులు తమతో చరాస్థి తీసుకువెళ్ళనివ్వటానికీ ఉభయ అధినివేశ ప్రభుత్వాలు ఈ సమావేశంలో అంగీకరించాయి. ఆ మర్నాడే కాందిశీక రక్షణ సైన్యము నొకదానిని మేజర్ జనరల్ సర్దార్ సింగ్ చిమినీ నాయకత్వమున భారత ప్రభుత్వము ఏర్పాటుచేసినది. ఇంతవరకు

సమూహాలుగా వస్తున్న కాందిశీకులు అరక్షితులుగావుండి, త్రోవలో అనేక బాధలకు గురియై, బయలుదేరినవారిలో సగంమంది మాత్రమే గమ్యస్థానం చేరుతుండేవారు. కాందిశీక సమూహాలపై ఇటువంటి దాడులు రెండువైపులా జరుగుతుండేవి. పశ్చిమ పాకిస్తాన్ నుండి వచ్చే కాందిశీకులను రక్షణతో తీసుకురావటము, తూర్పు పంజాబునుంచి వెళ్ళేవారిని రక్షణతో సరిహద్దులదాకా పంపించటము, వీరికీ, వారికీ అన్నపానాలు సమకూర్చటమూ, రైళ్ళలో వచ్చేవారినీ, కారులలో వచ్చేవారినీ రక్షణతో తీసుకురావటమూ ఈ సైన్యము కర్తవ్యము. ఆగస్టు 15 వ తేదీనుంచి సెప్టెంబరు 4 వ తేదీన ఈ సైన్యము ఏర్పాటు చేసి, కాందిశీకుల బాధ్యత దానికి అప్పజెప్పేవరకు ఎంతమంది వచ్చి వేశారో లెక్కలేదు. అక్టోబరు 7 వ తేదీన మేజర్ జనరల్ చిమినీ మాట్లాడుతూ, తాము అధిపత్యం తీసుకున్నతర్వాత అప్పటివరకు 16,28,000 మందిని తూర్పు పంజాబ్ చేరవేశామనీ, మరొక 4 లక్షలు రోడ్డుమీద వున్నారనీ, 20 లక్షలు పశ్చిమ పాకిస్థాన్‌లో ఇంకా వున్నారనీ తెలియజేశాడు. పశ్చిమ పంజాబ్‌లో ముస్లిమేతరుల సంఖ్య మొత్తం 45 లక్షలు. వీరిలో 1½ లక్షలు మరణించారని శ్రీ ప్రకాశ అంచనా వేశాడుకాని ఇది చాల తక్కువ అని చెప్పాలి.

తూర్పు, పశ్చిమ పంజాబ్‌లతోనే కల్లోలం ఆగిపోలేదు. ఇటు ఢిల్లీ రాష్ట్రానికి, అటు సింధు, సరిహద్దు రాష్ట్రాలకుకూడా ఇది వ్యాపించింది. ఢిల్లీలో మతకలహాలు రేగగొట్టి, నెహ్రూ ప్రభుత్వాన్ని కూలద్రోయాలని ముస్లింలీగ్ పథకంవేసి పనిచేసినందువలన ఢిల్లీలోకూడా కలహాలు జరిగాయి. కాని భారత ప్రభుత్వము, గాంధీజీ వీటిని త్వరలోనే అదుపులోకి తెచ్చారు. సింధు సరిహద్దు రాష్ట్రాలనుంచి ముస్లిమేతరులను వెళ్ళగొట్టటమే లీగ్ విధానం. పంజాబ్, సింధు, సరిహద్దు రాష్ట్రాలలో మెజారిటీ ముస్లింలే అయినా, ఎక్కువ భూమి, వ్యాపారము, ధనము ముస్లిమేతరుల చేతులలోనే వుంది. పశ్చిమ పంజాబ్ కాలువల ప్రాంతమంతా సిక్కుల చేతులలోనే వుంది. కరాచీలో ముస్లిమేతరులే

పాకిస్థాన్ వర్తక వ్యాపారాలన్నీ నిర్వహిస్తున్నారు. కాబట్టి ఇప్పుడు పాకిస్థాన్ ఏర్పడినా, దాని భవిష్యత్తు ముస్లిమేతరుల చేతులలోనే వుంటుంది. ముస్లింలు ఎప్పటివలె ముస్లిమేతరుల ఆధిపత్యంక్రిందనే వుండి పోవలసి వస్తుంది. ఇప్పుడు ముస్లిమేతరులను, కల్లోలం ఎట్లాగూ ప్రారంభమైంది కాబట్టి, వెళ్ళగొట్టితే వారి ఆస్తులు, వ్యాపారాలు, పొలాలు చాలభాగం వూరికేనూ, మిగతాది అతి తక్కువ ధరకు ముస్లింలకు లభిస్తాయి; వారు భాగ్యవంతులౌతారు. పాకిస్థాన్‌లో ముస్లిమేతరుల కిడవుండదు. పైగా, ఒకవేళ ఇండియాకు, పాకిస్థాన్‌కు యుద్ధమే సంభవిస్తే, పాకిస్థాన్‌లోని ముస్లిమేతరులు దేశవిభజనకు వారెప్పుడు ఒప్పుకోలేదు కాబట్టి, తిరుగబడి, పాకిస్థాన్‌ను నాశనం చేయవచ్చు. అంతవరకు రాకపోయినా, ముస్లింలీగ్‌కు వ్యతిరిక్తంగా ముస్లింపార్టీ ఏదైనా ఏర్పడి, ఏకాగ్రబలం సంపాదించినా, దానితో చేతులుకలిపి లీగ్ ప్రభుత్వాలను కూలద్రోసి, తాము పాలించటానికిగాని, ఇండియాతో కలసిపోవటానికికూడ వీరు ప్రయత్నించవచ్చు. అందువల్ల పాకిస్థాన్‌లో ముఖ్యభాగమైన పశ్చిమ పాకిస్థాన్‌లో, అనగా సరిహద్దు, సింధు, పశ్చిమ పంజాబ్ రాష్ట్రాలలో అల్పసంఖ్యాలను పూర్తిగా తరిమివేస్తేనేగాని పాకిస్థాన్‌కు శాంతి, భద్రత ఏర్పడదని లీగ్ నాయకుల నమ్మకం. (ముస్లిం ఉద్యోగులకన్న,) (ముస్లిమేతర ఉద్యోగులు మేధావంతులు; చురుకుగా పనిచేస్తారు.) వీరిని తరిమివేయాలని ముస్లిం ఉద్యోగులు ఎప్పుడూ ప్రయత్నిస్తూనే వున్నారు. కాబట్టి పశ్చిమ పాకిస్థాన్‌నుంచి ముస్లిమేతరులను తరిమివేయటమే పాకిస్థాన్ ప్రభుత్వ ఉద్దేశ్యమైనప్పుడు, సింధులోను, సరిహద్దులోను దుస్సంఘటనలు జరగకుండా ఎట్లావుంటయి ? (సరిహద్దురాష్ట్రంలో ముస్లిమేతర ఉద్యోగులను సెపెంబర్‌లోనే చిత్రవధచేశారు.) (అచ్చటి హిందువులు చాలమంది మరణించిపోవటమో,) మతం మార్చుకోవటమో జరిగిపోయింది.) సింధు నుంచి రోజుకు 3 వేలమంది చొప్పున ముస్లిమేతరులు వచ్చివేశారు, వీరికి అనేక ఆటంకాలు కలిగించి, వీరిని తీసుకురావటానికి వెళ్ళిన ఓడలను ఖాళీగా త్రిప్పివేసి పాకిస్థాన్ చాల ఇబ్బందిపెట్టింది.

డిశెంబరు 20 వ తేదీనాటికి పశ్చిమపంజాబ్‌నుండి 43,62,000 మంది, తూర్పుపంజాబ్‌నుండి 41 లక్షల మంది ఖాళీచేయబడ్డారు. వీరిలో 23 లక్షలమంది రైళ్ళలో ప్రయాణంచేశారు. పశ్చిమపాకిస్థాన్ అంతటి నుంచి వచ్చివేసిన కాందిశీకుల సంఖ్య 55 లక్షలని తెలుస్తున్నది.

కాందిశీకులను తీసుకువచ్చినతర్వాత వారికి సర్వ సౌకర్యాలు కలిపించి కొంతకాలము పోషించి, శాశ్వత పునరావాసమునకు ఏర్పాటు చేయవలెను. తూర్పుపంజాబ్‌నుంచి వచ్చేవారు మొదట్లో, నేరుగా ఢిల్లీ రాష్ట్రానికి పట్టణానికి పోయేవారు. అచ్చట జనం బాగా కూడిన తర్వాత, తూర్పుపంజాబ్ జిల్లాలన్నిటిలో కాందిశీక శిబిరా లేర్పరచారు. సింధునుంచి వచ్చేవారికి బొంబాయి, కథియవాడ్, రాజపుటానా సంస్థానాలలో శిబిరా లేర్పరచారు. దేశమంతటా 130 కాందిశీక శిబిరా లేర్పరచారు. వీటిలోకెల్లా కురుక్షేత్ర శిబిరం చాల పెద్దది. ఇందులో 11 వేల గుడారాలువేసి, రెండు, మూడు లక్షలవరకు కాందిశీకులకు విడిది ఏర్పాటుచేశారు. అప్పుడు శీతాకాలం కావటంవలన ఈ పనంతా అతిత్వరగా జరిగిపోకపోతే, చలిబాధకు తాళలేక అనేకులు చనిపోయే వాళ్ళే. తూర్పుపంజాబ్‌నుంచి వెళ్ళిపోయేవారు చరాస్థులన్నీ తీసుకు వెళ్ళటాన్ని భారతప్రభుత్వం, ఉభయ అధినివేశాల ఒడంబడిక ప్రకారం, అంగీకరించినా, పశ్చిమపాకిస్థాన్‌నుంచి వచ్చేవారిని సోదాచేసి, వస్తువులు, గుడ్డలు అన్నీ లాక్కొని, కట్టుగుడ్డలలో మాత్రమే పంపించేవారు. దీనికి భారతప్రభుత్వం ఆక్షేపణ తెలిపినా, పాకిస్థాన్‌ప్రభుత్వం పోనిమ్మని ఉత్తరువులిచ్చినా, పాకిస్థాన్ ఉద్యోగులు, సైనికులు అధికారం తమ చేతుల్లోకి తీసుకుని సోదాచేసి తీరేవాళ్లు. కాందిశీకులు రాగానే వారికి గుడ్డలు, కంబళ్ళు సరఫరాచేసి, చలిబాధనుంచి కాపాడవలసి వచ్చింది. కంబళ్లు, గుడ్డలు దానంచేసి కాందిశీకులకు తోడ్పడవలసిందని సర్దార్ పటేల్, మహాత్మాగాంధిగారలు ప్రజలకు విజ్ఞప్తిచేశారు. దీనికి ఫలితంగా 8 లక్షల బొంతలు, 13 లక్షల కంబళ్లు, 10 లక్షల చొక్కాలు, ఒకలక్ష గజాలు గుడ్డ డిశెంబరు 14 వ తేదీకల్లా లభించాయి.

కాందిశీక శిబిరాలలో సమస్త సౌకర్యాలు ఉచితంగా ఏర్పాటు చేశారు. ఇందుకు రోజుకు కొన్నిలక్షలరూపాయలు భారతప్రభుత్వం ఖర్చుపెడుతున్నది. తూర్పు పంజాబ్‌లోనే 83 కాందిశీక శిబిరాలు ఇప్పుడూ వున్నాయి.

కాందిశీకుల సౌకర్యాలకు, పునరావాసానికి ఏర్పాట్లు చెయ్యటానికి ఒక ప్రత్యేక మంత్రిత్వాన్ని ఏర్పరచి, కె. సి. నియోగిగారిని ఆ శాఖ మంత్రిగా సెప్టెంబరు 7 వ తేదీననే నియమించారు. ఈ శాఖవారు ఇప్పటినుంచి పునరావాస ప్రయత్నాలు జరుపుతునే వున్నారు. ఈ మధ్యనే ఈ పదవికి మోహన్‌లాల్ సక్సేనాగారు మంత్రిగా నియమితులైనారు.

కాందిశీకులను పల్లెవాసులు, పట్నవాసులు అని రెండు విభాగములు చేయవచ్చును. పశ్చిమపంజాబ్‌నుంచి వచ్చిన రైతు కాందిశీకులకు తూర్పుపంజాబ్‌లో ముస్లిం రైతులు వదలి వెళ్లిన భూములను యిచ్చి, కొంత ధనము ఋణమిచ్చి, పునరావాసము కలిపించవచ్చును. తూర్పుపంజాబ్‌లో ముస్లింలు వదలి వెళ్లినదానికంటె పశ్చిమపంజాబ్‌లో వీరు వదలి వచ్చిన భూమి 2 లక్షల ఎకరములు ఎక్కువ. ఇది పాకిస్థాన్‌కు మతకలహాలవలన కలిగిన ముఖ్యలాభము. ముస్లింలు వదలి వెళ్ళిన భూమి 45 లక్షల ఎకరాలు; ఇందులో 33 లక్షల ఎకరాలు మాత్రమే సాగుబడి చేయబడుతున్న భూమి. ఒక్క పశ్చిమపంజాబ్ నుంచే దాదాపు 30 లక్షలమంది రైతు-కాందిశీకులు వచ్చారు; వీరిలో 20 లక్షల మందికి పైగా తూర్పుపంజాబ్‌లోనే స్థిరనివాసం ఏర్పాటు చేసి, భూమి పంచిపెట్టారు. ఈ పంపకంలో అనేక అవకతవకలు, స్వాభావికంగానే, జరుగుతాయి; వాటిని ఎప్పటికప్పుడు సవరించుకుని తరువాత కార్యక్రమం ప్రారంభించవలసి వస్తుండడంవలన, పని చాలా మందంగా జరుగుతోంది. ఇందుకు ఉద్యోగులు, నాయకులు కూడా చాలవరకు బాధ్యులే. ఇన్ని కష్టాలలోవున్నా వారు ప్రజలపట్ల న్యాయంగా ప్రవర్తించలేకపోతున్నారు.

(పశ్చిమ యు. పి. లో 5 లక్షలు, ఢిల్లీరాష్ట్రంలోని 4 లక్షలు పంజాబ్ కాందిశీకులకు స్థిరనివాసా లేర్పరచారు. సింధునుంచి వచ్చిన 7 లక్షలమంది బొంబాయి, సి. పి. రాష్ట్రాలలోను, రాజపుటానా సంస్థానాలలోను వున్నారు.) వీరుగాక కాందిశీక (శిబిరాలలో దేశమంతటా దాదాపు 20 లక్షలమంది కాందిశీకులు ఇంకా వున్నారు.) తూర్పు పంజాబ్ రాజధానినగరాన్ని వేరే నిర్మించి, 15 లక్షలమంది పట్నవాసం కాందిశీకులను అక్కడ జేర్చటానికి పథకం తయారు చేస్తున్నారట. ఈ పథకమే ఇంకా బైటపడలేదు. మంత్రివర్గపు గొడవలలో పడిపోయిన తూర్పుపంజాబ్ ప్రభుత్వానికి పరిపాలన, కాందిశీకుల గొడవఏమీ పట్టటంలేదు. తూర్పుపంజాబ్‌లో స్థిరనివాసమేర్పరచుకుని చేతివృత్తులు, వ్యాపారముచేసే కాందిశీకులకు ఋణాలివ్వటానికి (50 లక్షల రూపాయలు,) వ్యవసాయదారులకు పశువులు, సామగ్రికొనుక్కోటానికి ఋణమివ్వటానికి (127 లక్షల రూపాయలు రాష్ట్రప్రభుత్వం కేటాయించింది.) ఒక్కొక్క పనివానికి రూ. (250 చొప్పున ఈసొమ్ము 20 వేల కుటుంబాలకుమాత్రమే సరిపోవును.) తక్కినసొమ్మంతా కేంద్రప్రభుత్వమే భరించవలసి వుంటుంది. కాందిశీకుల పద్దుక్రింద ఖర్చుకు (22 కోట్లరూపాయలు నవంబరు (బడ్జెట్‌లో భారతప్రభుత్వం కేటాయించింది.) ఇందులో దాదాపు (15 కోట్లరూపాయలే ఖర్చయింది) ఎక్కువభాగం బహుశ: కాందిశీక శిబిరాలకే అయిపోయి వుండవచ్చును. 1948-49 వ సం. బడ్జెట్‌లో 10 కోట్ల రూ. లు కాందిశీకులకు కేటాయించారు.

పట్నవాసపు కాందిశీకుల పునరావాసము త్వరత్వరగా జరుగుటకు రెండు ప్రత్యేక సంస్థలను ఫిబ్రవరి నెలలో భారతప్రభుత్వం ఏర్పాటుచేసింది. ఏయేరాష్ట్రాలలో, ఏయేప్రాంతాలలో ఏయేనూతన పరిశ్రమలను స్థాపించవచ్చునో, ఏయేకుటీర పరిశ్రమలను ఎక్కడెక్కడ, ఎంతమంది స్థాపించవచ్చునో పరిశీలించి, కాందిశీకులకు సలహానివ్వటానికి పునరావాస, అభివృద్ధి సంస్థ (RDB) ఏర్పరచారు. ఇందులో ముగ్గురు

సభ్యులు, ముగ్గురు సలహాదారులు వుంటారు. ఏకాందిశీకుడైనా ఏ పరిశ్రమనైనా స్థాపించదలిస్తే, ముందుగా వీరి అనుమతి పొందాలి. ఈ సంస్థ తన బాధ్యతమీద నే కొన్ని భారీ ప్రరిశ్రమలను స్థాపించవలసిందని వారిని ప్రోత్సాహం చెయ్యవచ్చును.

కాందిశీకులు పరిశ్రమలు, వ్యాపారము చేసుకోవటానికి ధన సహాయము చేయటానికి కాందిశీక ధనసహాయ సంస్థ (RFA) ఏర్పాటు చేశారు. ఈ సంస్థకు వ్యవసాయదారులతో ఎట్టి సంబంధము వుండదు. చిన్న చిన్న వ్యాపారులకు, చేతివృత్తులవారికి ధనసహాయం, కాందిశీక శాఖ నేరుగానే చేస్తుంది. కాని ఇక్కడ ఋణం ఏవ్యక్తికీ 5 వేల రూపాయలకుమించి ఇవ్వరు. పెద్ద పరిశ్రమలు స్థాపించటానికి 10 వేల మొదలు ఒక లక్షరూపాయలవరకు కావలసి వచ్చును. ఇట్టి పరిశ్రమల ప్లానుతో ఏకాందిశీకుడైనా ఒక్కడేగాని, మరి కొందరితో కలసిగాని ముందుకువస్తే, ఈ RFA వారికి ధనసహాయం చేస్తుంది. కాంది శీకులకు బ్యాంకులేవీ. వారికి హామీ, సెక్యూరిటే ఏమీలేదు కాబట్టి, ఋణమియ్యవు. అందువలన ఈ సంస్థ అవుసరమే. ఈ రెండుసంస్థలకు ఎటువంటి సంబంధాలుండవలెనో సూచింపబడలేదు. RFA లో ఋణం తీసుకోవటానికి ఆ కాందిశీకుని దరఖాస్తును RDB ఆమో దించి వుండాలిసిందేనా? కాందిశీకుడు యిచ్చిన ప్లానును RDB ఎంతవరకు మార్చవచ్చును? కాందిశీకుడు రాష్ట్రంలో ఒక ప్రాంతం నుంచి ఇంకొక ప్రాంతానికి వెడటానికి ఎందుకు అభ్యంతరాలుండాలి? ఈ సంస్థలకు, రాష్ట్రప్రభుత్వాలకు ఎట్టి సంబంధాలుంటవి? అనే ప్రశ్నలకు సరియైన సమాధానాలు రాలేదు. గత ఫిబ్రవరి నెలనుంచి ఇవి చేస్తున్నపనికూడా సంతృప్తికరంగా లేదు. తానేవో పెద్ద పథకా లను వేస్తున్నానని చెప్పి RDB కాందిశీకులు ఎవ్వరైనా ఏదైనా పరిశ్రమ స్థాపించుకుంటామంటే అనుమతి ఇవ్వలేదు. తాము తల పెట్టిన వేమో ఇంతవరకు ఆలోచన రంగందాటి బైటపడలేదు. ఈ మధ్య జపాన్‌నుంచి వచ్చిన రాయబారవర్గంతో కుటీర పరిశ్రమలను గురించి

వీరు సంప్రదింపులైనా జరుపలేదు. RFA కు మొత్తం 10 కోట్ల రూపాయలు ఇవ్వబడినా, ఇంతవరకు ఎంతమందికి అప్పయిచ్చిందో తెలియదు. మొత్తంమీద పనియేమీ చురుకుగా జరగటంలేదు. సంస్థల నేర్పాటుచేయడంకన్న, అవి చక్కగా పనిచేయటమే ఎక్కువ అవసర మున్నసంగతి మనం ఇంకా గ్రహించుకోలేదు.

కాందిశీకశిబిరాలలో వున్నవారిని ఎంతకాలము పోషించగలము? ఏదో ఒకచోట వారికి శాశ్వతస్థిరనివాసం చూపించాలి. అయితే, వారు కోరుకొనే ప్రాంతం దొరకలేదని కాందిశీకులు ఆగ్రహపడి లాభం లేదు. ఈమధ్యనే అన్నిరాష్ట్రాలప్రధానులు సమావేశమై ఇంకా మిగిలి వున్న 21 లక్షల కాందిశీకులకు తమతమ రాష్ట్రాలలో స్థిరనివాసం కల్పించటానికి ఏర్పాట్లు చేసుకున్నారు. వీరి అంచనాలప్రకారం బొంబాయిరాష్ట్రం 4 లక్షలు; యు. పి., సి. పి. లు ఒక్కొక్కటి 3 లక్షలు; మత్స్యరాజ్యం 1 లక్ష; బికనీర్ 50 వేలు; అజ్మీర్ 50 వేలు; ఉదయపూర్ 1 లక్ష; జయపూర్ 1 లక్ష; మాళ్వ 2 లక్షలు; సౌరాష్ట్ర 1 లక్ష; జోధపూర్ 50 వేలు; వింధ్యప్రాంతము 50 వేలు; తూర్పు పంజాబ్ సంస్థానాలు 3 లక్షలు కాందిశీకులకు స్థిరనివాసం కలిపిస్తాయి.

సింధునుంచి ఇంకా దాదాపు 3 లక్షలమంది వచ్చివేయాలి. వీరి కోరకు పంపిన ఓడలు; రైళ్ళు ముస్లింలతో నింపి పంపిస్తున్నారు. హిందువుల రాకకు పాకిస్థాన్ అనేకఅడ్డంకులు కలిగిస్తున్నది. భారతప్రభుత్వం పూనుకుని ఏదో ఒక ఒడంబడిక చేసుకుని వీరిని వెంటనే తీసుకురావాలి. తిరిగివచ్చే ముస్లింలను రానిచ్చేవిషయంలోవలెనే ఇక్కడ భారతప్రభుత్వ వైఖరి అనిశ్చితంగా వుంది. పాకిస్థాన్‌లో తాము వదలివేసి వచ్చిన ఆస్తులు, పాకిస్థాన్ప్రభుత్వాలు వశపరచుకున్నవి ఇప్పించవలసిందంటూ 53 వేలమంది దరఖాస్తులు పెట్టుకున్నారు. వీటినిగురించి భారత ప్రభుత్వం పాకిస్థాన్‌తో ప్రస్తావించాలి. కాందిశీకులకు ఇండ్లుకట్టటం ఇన్నాళ్ళ కిప్పుడు ప్రారంభమైందంటే, పని ఎంత చురుకుగా జరుగుతున్నదో గ్రహించుకోగలం.

పంజాబ్‌లో మతకలహాలు ప్రారంభం కావటానికీ, కాందిశీక సమస్య ఇంత పెద్దదిగా పరిణమించటానికీ భారతప్రభుత్వ అస్పష్ట, అనిశ్చితవైఖరే కారణం. జనాభా మార్పిడినిగురించి జనాబ్ జిన్నా చాల రోజులనుండి స్పష్టవైఖరినే ప్రదర్శించుచున్నాడు. పశ్చిమపాకిస్థాన్‌లోనైనా అల్పసంఖ్యాకుల సమస్య లేకుండా చేసుకుంటేగాని పాకిస్థాన్‌లో తమ ఆటలు సాగవని తెలుసుకుని లీగర్లు అందుకు కార్యాచరణకు పూనుకున్నారు. జిన్నా, ముస్లింలీగ్ అల్పసంఖ్యాకులనుగూర్చి చేసే ప్రకటనలన్నీ శుద్ధబూటకమని తెలిసికూడా తమ 'జాతీయత'కు అంటిపెట్టుకుని, జనాభా మార్పిడిని కాంగ్రెస్‌నాయకులు ప్రస్తావించనేలేదు. పశ్చిమపాకిస్థాన్‌లోని ముస్లిమేతరులను తీసుకువచ్చివేయకుండా అందుకు ఏర్పాట్లయినా జరపకుండా, దేశవిభజనకు అంగీకరించటము కసాయివానిచేతికి మేకపిల్లను ఇవ్వటమే అయింది. ఆతర్వాతనైనా తమ తప్పును సవరించుకోకుండా వారందరును ఎక్కడివారక్కడనే వుండాలని కార్యవర్గం తీర్మానం చేసింది. మన స్వాతంత్ర్యంకొరకు వారి రక్తం ధారపోశాము. కాంగ్రెస్‌నాయకులు తమది తప్పేననీ, మోసపోతిమనీ ఇప్పుడు చెప్పవచ్చు; కాని కొంచెం ముందుగానే జాగ్రత్తపడివుంటే ఎంతో నష్టం జరుగకుండా వుండేది.

(తూర్పుపంజాబ్‌నుంచి వెళ్ళినవారందరూ పూచికపుల్లతోసహా తీసుకుపోయారు) (పశ్చిమపంజాబ్‌నుంచి వచ్చేవారు కట్టుగుడ్డలతో వచ్చారు) ఎదుటివారిని చూసైనా మనం నేర్చుకోలేదు. అది మంచితనం అని మనం అనుకోవచ్చు; కాని తెలివితక్కువ, చేతకానితనం అని ఇతరులు మనలను లోకువగా చూస్తారు. తూర్పుపంజాబ్‌వచ్చినవారు వదలివేసిన స్థిరాస్థి, ఇక్కడినుండి పోయినవారు వదలివేసిన స్థిరాస్థికన్న 2 లక్షల ఎకరాలు తక్కువ. ఇంతభూమిని, యు. పి. లోని ముస్లింలను కొందరిని ఖాళీచేసి పంపిస్తే మనకుదొరకి పునరావాసపు ఏర్పాట్లు త్వరగా జరిగేవి. కాని అలాభం హత్యచేసి, హింసించి తరిమివేసినందుకు పాకిస్థాన్‌కే మనం కట్టబెట్టాము. చరాస్థికూడా అంతా ఉద్యోగులే దోచుకున్నారు

కాబట్టి లెక్కకు రాలేదు. నేలమాళిగ కోశీలలో దాచుకున్నది తెచ్చుకోనివ్వకుండా పాకిస్థాన్ ఎన్నో ఇబ్బందులు పెట్టినది. అసలు జరిగిన ఒడంబడికలన్నీ పాకిస్థాన్ భగ్నపరచుటము, భారతప్రభుత్వం తాను అనుసరిస్తుండటయు జరిగింది. జఫ్రుల్లాఖాన్ చెప్పిన జాతిహత్య, ఒడంబడికలు భగ్నముచేయుట అసలు భారతప్రభుత్వం పాకిస్థాన్ పై చేయవలసిన, ఆరోపణలు. తప్పువారిదే అయినా, అందుకు ఫిర్యాదు మన పైన వేజేసి, పాకిస్థాన్ లాభము పొందుతున్నది. మంచితనానికి హద్దున్నదని భారతప్రభుత్వం ఇప్పుడైనా గ్రహించలేదు; గ్రహించినా అందుకు పూనుకోవటానికి ఇష్టపడటంలేదు.

కాందిశీకుల పునరావాసపు ఏర్పాట్లు చాల ఆలస్యంగా జరుగుతున్నవి. ఖాళీచేసిన వారి ఇండ్లు వచ్చినవారికి యివ్వటానికే భారతప్రభుత్వం తటపటాయించింది; ఆక్రమించుకుంటుంటే అటకాయించింది. పాకిస్థాన్‌లో పునరావాసపు ఏర్పాట్లు అతిత్వరగా జరిగాయి. మనిషి తప్పుకోగానే ఆభూమి ఇంకొకరికి, ఆఇల్లు ఇంకొకరికి ఇచ్చేశారు. చూసి కూడా అది చెయ్యలేక మనం అనవసర ఖర్చుపడి, కాందిశీకులకు కష్టం, మనకు ప్రయాస కలిగించుకున్నాము. ఇప్పటికింకా 21 లక్షల మంది ఆర్తులు వున్నారు. పునరావాసపు ఏర్పాట్లు నత్తగుల్ల పోకడలు పోతున్నవి. చేసిన ఏర్పాట్లయినా, ప్రతివిషయము తర్జన, భర్జన, ఆలోచనలు తప్ప, చేయవలసినంత త్వరగా ఏపనీ చేయటంలేదు. కాందిశీకుల పునరావాసం ఈనాడు కాకపోతే, ఈ సంవత్సరంలోనైనా పూర్తి అవుతుంది; కాని ఉపద్రవ పరిస్థితి ఏర్పడ్డప్పుడు అవసరమైనంత త్వరగా, చురుకుగా, భారీగా భారతప్రభుత్వం ఏర్పాట్లు చెయ్యలేదని మాత్రం ఈ సమస్య రుజువు పరిచింది.



# సంస్థానాలు

స్వతంత్ర భారతప్రభుత్వం తొలిసంవత్సర పరిపాలనలో సాధించిన వానిలో సంస్థానాల ఏకీకరణ మహత్తరమైనదనుట నిస్సందేహము. ఆగస్టు 15 వ తేదీకి ముందు సంస్థానాలవలన భారతదేశం ఎట్టి చిక్కుల నెదుర్కొనవలసి వస్తుందో అని ప్రభుత్వం గిజగిజలాడి పోయింది; భారతదేశము ఇండియా, పాకిస్థాన్‌లుగా గాక దాదాపు 600 ముక్కలుగా విభాగమైపోగల అవకాశము ఏర్పడి, దేశభక్తులకు హృదయావేదన కలిగించినది. నేడు పరిస్థితులు తారుమారైనవి. భారతదేశము చరిత్రలో ఎన్నడూ కని, విని ఎరుగనంత సన్నిహిత ఐక్యమును పొందినది; పాకిస్థాన్ వీడిపోయినా తక్కినభాగమైనా సుసంఘటితమై వున్నది. అనాదికాలమునుండి భారత చక్రవర్తుల ఆదర్శ లక్ష్యముగా నుండి, మృగతృష్ణవలెవారి నూరించిన దేశ ఐక్యత, అశోకుడు, అక్బరు మొదలగు మహా చక్రవర్తులే సాధింపలేకపోయిన దేశ ఐక్యము, ఒక్కసంవత్సరకాలములో, అహింసాయుత, శాంతియుత పద్ధతుల ద్వారా సాధింపబడింది. గత సంవత్సరకాలములో భారతప్రభుత్వ సంస్థానశాఖ పనిచేసినంత చురుకుగా, ఫలప్రదముగా ఇతర శాఖలన్నీ పనిచేసివున్నచో దేశమెంతో అభివృద్ధిజెందివుండేది. భారతదేశ రాజకీయాభ్యుదయానికీ, ఆర్థికాభ్యున్నతికీ సంస్థానాలు ఇదివరకు పెద్ద ఆటంకముగా వుండేవి. ఇప్పుడు ఆ సంస్థానాలే రాజకీయముగా ఇతర భారతప్రాంతాల స్థాయికివచ్చి, ఆర్థికాభ్యున్నతి కార్యక్రమానికి ఎప్పుడు పూనుకుందామా అని ఆతృతపడుతున్నవి.

బ్రిటిష్ పరిపాలన కాలములో సంస్థానాలెప్పుడూ వారికి చేదోడు వాదోడుగావుండి, ఈ దేశంలో బ్రిటిష్ సామ్రాజ్యం సుస్థిరపడటానికీ, సుదీర్ఘకాలం జరగటానికీ సహాయపడ్డాయి. బ్రిటిష్‌పాలన ప్రారంభమైన మొదటిరోజులలో, బ్రిటిష్‌వారిని బలపరచకపోతే తమ

సంస్థానం వూడుతుందేమోననే భయంతోను, బ్రిటిష్‌పాలన సుస్థిరపడిన తర్వాత ప్రజలలో రేకెత్తుచున్న ప్రజాస్వామ్య భావాలను అణచివేసి తమ నిరంకుశ పరిపాలన నిరాఘటంగా సాగిపోవటానికి తోడ్పడతారనే ఆశతోను, సంస్థానాధీశ్వరులు బ్రిటిష్‌పాలకుల అడుగులకు మడుగు లొత్తుతుండేవారు. బ్రిటిష్‌వారీ దేశాన్ని పాలించినంతకాలమే తమ ఆటలు సాగుతవని వారికి తెలుసును. అందువలన భారతదేశ రాజకీయాభి వృద్ధికి ఆటంకములుగానుండి, తమ మనుగడను శాశ్వతమొనర్చుకోవ టానికి వీరు ప్రయత్నిస్తుండేవారు. దీనికి కృతజ్ఞతగా బ్రిటిష్‌పాలకులు తాము ఈ దేశాన్ని పాలిస్తున్నా, వైదొలగినా సంస్థానాధీశ్వరుల హక్కులకు ఎట్టి భంగము వాటిల్లనివ్వమని వాగ్దానాలు చేశారు. సార్వభౌమత్వాధికారం అనే పేరుతో ఈ సంస్థానాల ఆంతరంగిక విషయాలపై కూడా అధికారం చెలాయిస్తూ, సంస్థానాధీశ్వరులను కీలు బొమ్మలను జేసి వారు ఆటాడుతుండే వారు. తమ వినోదాలు, కులా సాలు నిరాఘాటంగా సాగిపోతున్నవి కాబట్టి ప్రజలను గురించి, పరిపాలనను గురించి శ్రద్ధవహించాలనే విషయమే సంస్థాన పాలకులకు తట్టలేదు. ఇట్టి పరిస్థితులలో, విధి బలాత్కారంవల్ల, బ్రిటిష్‌పాలకులు ఈ దేశంనుండి వైదొలగక తప్పలేదు. తమ పాలనలో వున్న ప్రాంతాన్ని ప్రజాప్రభుత్వానికి వప్పజెప్పినా, తమను నమ్ముకునివున్న సంస్థానా ధీశ్వరులను కాపాడటానికే బ్రిటిష్‌వారు నిశ్చయించారు; తాము వైదొలగంగానే ఇన్నాళ్ళనుండి సంస్థానాలపై తాము చెలాయిస్తున్న 'సార్వభౌమత్వాధికారం' తనంతటదే రద్దయిపోతుందనీ, లోగడ సంస్థానాలు బ్రిటిష్ ప్రతినిధులతో చేసుకున్న ఒడంబడికలన్నీ రద్దయి పోతవనీ, సూత్రప్రాయంగా, ప్రతి సంస్థానము ఒక స్వతంత్రరాజ్యంగా ఏర్పడే హక్కు వాటికి లభిస్తుందనీ వారు ప్రకటించారు. అంతటితో భారతదేశం ఇండియా, పాకిస్థాన్‌లుగా రెండుగా గాక, దాదాపు 600 ముక్కలుగా విభాగమైపోగల ప్రమాదం ఏర్పడింది. భారత దేశానికి స్వాతంత్రం యిస్తున్నామని పేరుపెట్టి దేశాన్ని అయిదారు

వందల ముక్కలుచేసి, కల్లోలానికి దారితీశారను నింద తమపై పడుతుందనే భయముకూడా వారికి కలగకపోలేదు. పోతూ పోతూ ఇట్టి నిందను నెత్తిపై వేసుకుపోవటం వారికి ఇష్టంలేదు. అందువలన సంస్థానాలన్నీ సూత్రప్రాయంగా స్వతంత్ర రాజ్యాలైనా, వాటిస్వాతంత్ర్యాన్ని తాము గుర్తించమనీ, అవన్నీ ఏదో ఒక అధినివేశంలో జేరిపోవలసిందేనని వారు చెప్పారు. సంస్థానాలను గురించి అమాత్యత్రయ పథకం వివరించింది ఈపరతులే; వాటినే జూన్ 3 వ తేదీ పథకం పునరుద్ఘాటించింది.

బ్రిటిష్‌వాళ్ళు వైదొలగిపోతారని ధృవపడగానే సంస్థానాధీశ్వరులు కన్ను తెరిచారు. ఇకముందు తాము స్వతంత్రరాజులుగా ఎట్లానూ నిలువలేమని వారెరుగుదురు. అంతేగాక, ఇప్పటిహోదాలో బ్రకవలెనంటే భారతప్రభుత్వాన్నీ, తమ ప్రజలను మంచిచేసుకోవటం అత్యవసరమనికూడా వారు గుర్తించారు. రక్షణ, రాకపోకలు, విదేశవ్యవహారాలు మొదలగు మూడువిషయాలపైన సమస్తాధికారాన్ని భారతప్రభుత్వానికి వప్పజెప్పుతూ ఒక్కొక్కరే భారతదేశంలో జేరిపోయారు. భారత ప్రభుత్వంలో ప్రత్యేకసంస్థానశాఖను ఏర్పరచి, అంతవరకు 'పొలిటికల్ డిపార్ట్‌మెంట్' నిర్వహిస్తున్నపని ఈ శాఖకు వప్పగించాలని జూన్ 14 వ తేదీన రాజప్రతినిధి సమక్షంలో కాంగ్రెస్, లీగ్ నాయకులు నిశ్చయించుకున్నారు. (భారతదేశానికి సర్దార్‌పటేల్ (పాకిస్థాన్‌కు సర్దార్ అబ్దుర్‌రాబ్‌నిష్టార్) సంస్థానశాఖమంత్రులుగా నియమించబడ్డారు.) సంస్థానశాఖ ఏర్పాటుచేయబడ్డట్లు జూన్ 27 వ తేదీన ప్రకటించారు. ఈ శాఖకు కార్యదర్శిగా అప్పటినుంచీ (వాపాల్ పంగుని మీనన్ పని చేస్తున్నాడు) జూలై 5 వ తేదీన సంస్థానశాఖపై అధికారాన్ని స్వీకరిస్తూ సర్దార్‌పటేల్ సంస్థానాధీశ్వరుల హక్కులను కాపాడుతామనీ, ఇంకా ఎక్కువ అధికారాలు దత్తతచేయమని కోరమనీ వాగ్దానంచేశాడు.

సార్వభౌమప్రతినిధిగా సంస్థానాధీశ్వరులను ఆఖరుపర్యాయం జూలై 25 వ తేదీన మౌంట్‌బాటన్ సమావేశపరిచాడు. ఈ సమా

వేశంలో మౌంట్‌బాటన్ ఉపన్యసిస్తూ సంస్థానాలనుగురించి బ్రిటిష్ ప్రభుత్వనిర్ణయాలను వివరించి ఏసంస్థానమూ స్వతంత్రరాజ్యంగా వుండిపోదామన్నా వుండిపోలేదని నచ్చజెప్పి, భౌగోళికంగా సంశ్లిష్ట అధినివేశాలలో సంస్థానాలన్నీ జేరిపోవలసిందనీ, యథాతథపు ఒడంబడికలు చేసికోవలసిందనీ ఆదేశించాడు. సంస్థానాలతరఫున భారత రాజ్యాంగపరిషత్తుతో సంప్రదింపులు జరపటానికి ఒక రాయబారవర్గాన్ని కూడా ఈ సభలో ఏర్పాటుచేశారు. తిరువాన్కూరుసంస్థానం స్వతంత్ర రాజ్యం కావాలనిముందు ఊగులాడినా తర్వాత భారతదేశంలో జేరిపోయింది. భోపాల్ నవాబునుగురించి చాలమంది అనుమానపడ్డారుగాని అతడుకూడ భారతదేశంలోనే జేరాడు. ఒక్కజునాగఢ్‌మాత్రం ఆగస్టు 18 వ తేదీన పాకిస్థాన్‌లో జేరింది. కాశ్మీర్, హైదరాబాద్‌లు ఏ అధినివేశంలోను జేరలేదు. సంస్థానాలన్నీ భారతదేశంలో జేరేటప్పుడు వప్పజెప్పిన మూడుఅధికారాలేగాక ఇప్పుడున్న వ్యవహారాలు సమస్తమూ ఇప్పటివలెనే కొనసాగుతుండటానికి వీలుగా ఒక 'యథాతథపు' ఒడంబడికకూడా చేసుకున్నవి. అందువలన భారతస్వాతంత్ర్యం వల్ల భారతదేశసంస్థానాల సంబంధాలలో విపరీతమైన మార్పు వెంటనే ఏమీ కనిపించలేదు. సంస్థానాలనుగురించి మొదట్లో పడిన భయమంతా అనవుసరమని తేలిపోయింది.

బ్రిటిష్‌పాలకులు భారతదేశాన్ని కృత్రిమంగా బ్రిటిష్‌భారతదేశము', 'స్వదేశసంస్థానభారతదేశము' అని రెండువిభాగాలు చేశారు. 'విభజించి, పాలించు' అను, వారనుసరించిన నీతిలో ఇది ఒకభాగమే. సంస్థానప్రజలకు, బ్రిటిష్‌భారతప్రజలకు సన్నిహితసంబంధా లుండటమే గాక భేదాలు ఏమీ లేవు; ఈ కృత్రిమవిభజనను వారు ఎన్నడూ అంగీకరించనూలేదు, పాటించనూలేదు. బ్రిటిష్ భారత ప్రజల స్వాతంత్ర్య పోరాటం, దానివలన వారు పొందిన ఫలితాలు సంస్థానభారతప్రజలపై తమ ప్రభావాన్ని చూపిస్తూనే వుండేవి. రాజకీయంగా బ్రిటిష్ భారత ప్రభుత్వాధికారం ప్రజలహస్తగతమగుచున్నకొద్దీ సంస్థానభారతప్రజలు

కూడా రాజకీయచైతన్యంపొంది, బాధ్యతాయుత పరిపాలనకొరకు పోరాటం సాగించారు. భారతదేశం స్వతంత్రం పొందగానే తామూ పూర్తిగా బాధ్యతాయుత ప్రజాప్రభుత్వం సాధించితీరాలనే కోర్కె వీరిలో తీవ్రతరమైంది. ఈగాఢవాంఛనూ, తమ భవిష్యత్తు తమ ప్రజల మంచిపైననే ఆధారపడివున్నదనీ గుర్తెరింగిన సంస్థానాధీశ్వరులు త్వరగానే బాధ్యతాయుత ప్రభుత్వస్థాపనకు అంగీకరించారు. మైసూర్‌లో సంస్థానకాంగ్రెస్ కొన్నాళ్ళు సత్యాగ్రహం జరిపి, బాధ్యతాయుత ప్రజాప్రభుత్వం సంపాదించింది; తిరువాన్కూర్, భోపాల్ లలో ఇటువంటిపోరాటం అక్కరలేకుండానే వారికోర్కె లీడేరినవి; బరోడా మహారాజా ఈ సూత్రాలను అంగీకరించినా, ఆచరణలో వెనుకడుగువేసి అపఖ్యాతిపాలై చివరకు దోవకు వచ్చాడు. గ్వాలియర్, ఇందూర్, నవానగర్, కొచ్చిన్ మొదలైన పెద్దసంస్థానాలన్నిటిలోను అధికారం ప్రజలకు వప్పగించబడింది.

(భారతదేశములోని దాదాపు 500 సంస్థానాలలో ఒక 20 సంస్థానములు మాత్రమే పరిపాలనాసౌలభ్యమునకు తగినంత పెద్దవి) తక్కినవి చాల చిన్నవై యుండి వాటి ఆదాయములో ఎక్కువభాగము ప్రభువులకుటుంబభరణమునకే సరిపోయి, సంస్థానఅభ్యున్నతికి ప్రజాశ్రేయోభివృద్ధికి ఖర్చుచేయుటకు సొమ్ము వుండెడిదికాదు. అందువలననే ఈ సంస్థానాలు అన్నివిధముల భారతప్రభుత్వ భూభాగములకన్న వెనుకబడివున్నవి. ఈ సంస్థానములలో బాధ్యతాయుత ప్రజాప్రభుత్వమేర్పరిస్తే ఖర్చు మరీ ఎక్కువై నిర్వహణ ఏమాత్రము జరుగదు. సంస్థానములు చిన్నవైనను వీని భూభాగము ఒక్కచోటనుండక రెండు మూడుముక్కలుగా చెల్లాచెదరుగా నుండుటవలన పరిస్థితి మరీ గందరగోళముగా పరిణమించును. ఇట్టి సంస్థానాలను భారతరాష్ట్రాలలో కలిపివేయటమో, లేక కొన్నింటిని కలిపి ఒక కూటముగా ఏర్పరచటమో జరగకపోతే దేశాభ్యున్నతికి, పరిపాలనకు ఇవి పెద్దఆటంకముగా వుండిపోయేవి.

సంస్థానాల ఏకీకరణ ఉద్యమాన్ని ప్రారంభించి, జయప్రదంగా సాగించినది ఒరియాలు. ఒరియాలకు రాష్ట్రాభిమానము చాల మెండు. కాని వారి రాష్ట్రము అతి చిన్నది; స్వయంపోషకముకూడా కాదు. ఒరిస్సా రాష్ట్ర భూభాగమెంతో, ఒరిస్సా సంస్థానాల భూభాగము కూడ అంతే వుండును. ఈ రెండుభాగములు కలసినచో ఒరిస్సా రాష్ట్రము పెద్దదై, సుపరిపాలన, ఆర్థికదక్షతలను పొందగల్గును. సంస్థానాలను రాష్ట్రములో కలిపివేయవలెనను ఆందోళన చాలరోజులనుండి వున్నది. దేశ స్వాతంత్ర్యంతో ఆ ఉద్యమం తీవ్రతరమైంది. ఇట్టి ప్రజా ఉద్యమాన్ని అణచివేయటానికి వీలుగా వుండేటందుకు, ఒరిస్సా, సి. పి. సంస్థానాలు కలసి తూర్పు సంస్థానకూటమి నేర్పరచి, అన్ని సంస్థానాలకు ఒకే పోలీసుదళము, ఒకే న్యాయస్థానము, కేంద్రప్రభుత్వములో దీని ప్రయోజనములను రక్షించుటకు ఏక కేంద్ర సంఘము నేర్పరచుకొన్నవి. కాని ఈ పోలీసుదళము ప్రజా ఉద్యమమును అణచలేకపోయినది. (నీలగిరి సంస్థానములో ప్రజాఉద్యమ ధాటికి తాళలేక రాజు పారిపోవలసివచ్చెను.) తమ మనుగడనుగూర్చి సంస్థానాధీశ్వరులందరు భయపడజొచ్చిరి. తమ కుటుంబ భరణము, ప్రత్యేకహక్కులు, వారసత్వము, ఆస్థి రక్షింపబడినచో తమ సంస్థానాలపై సర్వాధికారాలను కేంద్ర ప్రభుత్వానికి వప్పజెప్పి, పరిపాలనా బాధ్యతనుండి తప్పించుకోవచ్చునని వారు చూశారు. ఈవిధంగా రెండు వర్గాలకు సమాధానం కుదిరింది. డిశెంబరు నెల రెండవ వారంలో (సర్దార్ పటేల్ కటక్, నాగపూర్ లు వెళ్ళి, సంస్థానాధీశ్వరులతో సంప్రదింపులు జరిపి,) సంస్థానాలపై సర్వాధికారులను వశపరుచుకోవటానికి ఒడంబడిక చేసుకున్నాడు. (ఒరిస్సా, సి. పి. లలో 39 మంది సంస్థానాధీశ్వరులు ఇట్టి ఒడంబడికపై డిశెంబరు 14 వ తేదీన సంతకాలు చేశారు.) సంస్థానాధీశ్వరుల వంశపారంపర్యము, హక్కులు, బిరుదులు, స్వంత ఆస్థి, కుటుంబ భరణము శాశ్వతముగా రక్షించుటకు భారత ప్రభుత్వము అంగీకరించింది. సంస్థానాధీశ్వరుల కుటుంబ భరణము వారి సంస్థాన

ఆదాయాన్ని బట్టి నిర్ణయింపబడింది. ఈ ప్రకారం, సంస్థానాల పరిపాలనాధికారం కేంద్ర ప్రభుత్వం వశపరచుకుని, పరిపాలనాభారాన్ని సంశ్లిష్టరాష్ట్ర ప్రభుత్వానికి వప్పజెప్పింది. సరికేల, ఖరస్‌వాన్ సంస్థానాలు మొదట్లో ఒరిస్సాలో కలిపివేసినా, అవి బీహార్‌లో వుండటం వల్ల తర్వాత బీహార్ రాష్ట్రానికి వప్పగించారు. 1948 వ సంవత్సరం ఒకటవ తేదీన 23 సంస్థానాలు ఒరిస్సాలో జేరిపోయినవి; వీని వైశాల్యం మొత్తం 23,637 చదరపు మైళ్ళు; జనాభా 40,46,000; ఆదాయం రూ. 98,74,000. ఆనాడే సి. పి. రాష్ట్రంలో 14 సంస్థానాలు జేరిపోయినవి; వాని వైశాల్యం 31,598 చదరపుమైళ్ళు; జనాభా 28,20,000; ఆదాయం. రూ. 88,06,000. ఫిబ్రవరి 1 వ తేదీన 'మకరై' అను మరొక చిన్న సంస్థానంకూడా సి. పి. రాష్ట్రంలో జేరిపోయింది.

ఒరిస్సా, సి. పి. సంస్థానాలు ఆయా రాష్ట్రాలలో కలసిపోవటంతో, ఇతర సంస్థానా లన్నిటిలోను గొప్ప సంచలనం కలిగింది. చిన్న చిన్న సంస్థానాలన్నీ ఈవిధంగా సంశ్లిష్ట రాష్ట్రాలతో కలసిపోవటమో, లేక ఇతర చిన్న సంస్థానాలతో కలసి పెద్ద కూటములుగా ఏర్పడిపోవటమో జరగాలని సంస్థాన ప్రజలు పట్టుబట్టేరి; వారి దృక్పథమును భారత ప్రభుత్వము సానుభూతితో పరిశీలించింది. కాలానికి లొంగిపోక తప్పదని సంస్థానాధీశ్వరులుకూడా గ్రహించారు. అంతవరకు ఒక సంస్థానకూటమిగా ఏర్పడాలనుకుంటున్న దక్కన్ సంస్థానాలు 17 న్నూ బొంబాయి రాష్ట్రంలోనే కలసిపోవటం ప్రజలకూ, సంస్థానాధీశ్వరులకూ మంచిదని వారు గ్రహించారు. ఈ ప్రకారమే ఒడంబడిక పై ఫిబ్రవరి 19 వ తేదీన వారు సంతకాలుచేశారు. కొల్హాపూర్ సంస్థానం మాత్రం రాష్ట్రంలో కలిసిపోకుండా వుండటానికే నిర్ణయించింది. బొంబాయి రాష్ట్రంలో కలసిపోయిన 17 దక్కన్ సంస్థానాల వైశాల్యం 7651 చదరపుమైళ్ళు; జనాభా 17 లక్షలు; ఆదాయం దాదాపు 1 కోటి 42 లక్షల రూపాయలు.

మద్రాసు రాష్ట్రంలోని చిన్న సంస్థానాలగు బనగానపల్లి, పుదుక్కోట సంస్థానాలు ఫిబ్రవరి నెలలో మద్రాసు రాష్ట్రంలో జేరిపోయాయి. ఇదేసమయంలో లోహారు, దుజనా, పాటోడి సంస్థానాలు తూర్పు పంజాబ్ రాష్ట్రంలో కలసిపోయాయి.

(బొంబాయిరాష్ట్రం ఉత్తరాన సింధురాష్ట్రం సరిహద్దులలో 157 గుజరాత్ సంస్థానా లున్నవి) ఇవి అన్నివిధాలా అతిచిన్న సంస్థానాలు. వీటన్నిటి విస్తీర్ణము 19,300 చదరపుమైళ్ళు; జనాభా 27 లక్షలు; ఆదాయం సుమారు ఒకకోటి 65 లక్షల రూపాయలు. వీటినన్నిటిని కలిపి ఒకే కూటమిగా ఏర్పరచటానికి వీలులేకుండా, మధ్య మధ్య బొంబాయిరాష్ట్ర భూభాగం వుంది. అందువల్ల వీటిని బొంబాయిరాష్ట్రంలోనే కలిపివేయవలసి వచ్చింది. ఇందుకు సంబంధించిన ఒడంబడిక బొంబాయిలో మార్చి 17 వ తేదీన సంతకాలు జరిగాయి. వీనిపై అధికారాన్ని జూన్ 10 వ తేదీన రాష్ట్ర ప్రభుత్వం వశపరచుకుంది. వెస్టర్న్ కాంత్ ఠాణాలోవుండి, ఇదివరకు బరోడా సంస్థాన ప్రభుత్వం క్రిందవున్న సంస్థానాలుకూడా బొంబాయిరాష్ట్ర ప్రభుత్వానికి ఇచ్చివేశారు.

తూర్పు పంజాబ్ కొండలలోవున్న సంస్థానాలు చాల వెనుకబడి వున్నవి; కాని కీలకంగాను, అభివృద్ధికి ఎంతేని అవకాశంకలవిగాను ఉన్నవి. వీటిలోవున్న అవకాశాలను పూర్తిగా ఉపయోగించి, అభ్యున్నతికి తేలేని రాష్ట్ర ప్రభుత్వాలలో కలిపివేయటంకన్న, కేంద్ర ప్రభుత్వమే నేరుగా వీటిని వశపరుచుకుంటే మంచిదని ఆ సంస్థానాధీశ్వరులు కోరారు. ఇందుకు కేంద్ర ప్రభుత్వం అంగీకరించి, ఈ 21 కొండ సంస్థానాలను 'హిమాచల ప్రదేశ్' అను ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పరచి, పరిపాలనా బాధ్యత తానే స్వీకరించింది. వీటి విస్తీర్ణం మొత్తం 10,600 చ. మైళ్ళు; జనాభా 9½ లక్షలు; ఆదాయం రూ. 85 లక్షలు. వీనికి సంబంధించిన ఒడంబడిక మార్చి 8 వ తేదీన జరిగి, ఏప్రిల్ 15 వ తేదీన అమలులోనికి వచ్చింది.

(కచ్ సంస్థానం బొంబాయిరాష్ట్రానికి ఉత్తరాన సరిగా పాకిస్థాన్ సరిహద్దున వున్నది) దీని వైశాల్యం 8,461 చ. మైళ్ళు; జనాభా దాదాపు 5 లక్షలు; ఆదాయం సుమారు రూ. 80 లక్షలు. దేశసరిహద్దున వుండుటవలన ఈ సంస్థానం అతిప్రాముఖ్యత వహించినది. దీని పరిపాలనాధికారాన్ని కూడా, ఏ రాష్ట్రానికి, సంస్థానకూటమికి వప్పజెప్పకుండా, కేంద్రప్రభుత్వమే వహిస్తే బాగుండునని తలచి, ఛీఫ్ కమీషనర్ ద్వారా పరిపాలించుటకు కేంద్రప్రభుత్వం నిర్ణయించింది. దీనికి సంబంధించిన బడంబడిక మే 4 వ తేదీన జరిగి, జూన్ 1 వ తేదీన అమలులోనికి వచ్చింది.

అక్కడక్కడా చెల్లాచెదురుగావుండి, చుట్టూ రాష్ట్రభూభాగాలచే ఆవృతమైవున్న సంస్థానాలన్నిటినీ ఈ విధంగా సంశ్లిష్ట రాష్ట్రాలతో కలిపివేయుటమో, నేరుగా కేంద్రప్రభుత్వ పరిపాలనక్రింద నే తీసుకోవటమో జరిగింది. ఇట్లుగాక, చిన్నచిన్న సంస్థానాలు ఒకేచోట ఒకదానిప్రక్క నొకటివున్నచోట వానినన్నిటిని కలిపి సంస్థానకూటమిగా ఏర్పరచి చక్కగా పరిపాలన జరపటానికీ, ప్రజాప్రభుత్వం ఏర్పాటుచేయటానికీవీలుకలుగజేస్తే బాగుండునని కేంద్రప్రభుత్వం ఆలోచించింది. సంస్థానాధీశ్వరుల, సంస్థానప్రజల దృక్పధాలలో కలిగిన విప్లవాత్మక మార్పులవలన ఈ కార్యక్రమంకూడా జయప్రదంగా సాగింది.

సంస్థానకూటములకు ముందు దారి తీసింది సౌరాష్ట్రకూటమి. (కధియవార్ ద్వీపకల్పంలోవున్న 217 గుజరాతీ సంస్థానాలు కలిసి ఈ కూటమిగా ఏర్పడ్డాయి.) ఈ 217 సంస్థానాలు మొత్తం 860 ముక్కలుగా వున్నాయి. వీటి వైశాల్యం 31,885 చ. మైళ్లు; జనాభా 35,22,000; ఆదాయం సుమారు 8 కోట్ల రూపాయలు.

సంస్థానకూటములను ఏర్పరచినపుడు, ఆ క్రొత్తగా ఏర్పడ్డ రాష్ట్రంలో సంపూర్ణ బాధ్యతాయుతప్రభుత్వం విధిగా స్థాపించి తీరాలని భారతప్రభుత్వం స్పష్టపరచింది. కూటమిలో జేరిన సంస్థానాధీశ్వరులలో ఒకరిని 'రాజప్రముఖ్'గాను, మరొకరిని 'ఉపరాజప్రముఖ్' గాను

వారిలోవారు ఎన్నుకునేపద్ధతి ప్రవేశపెట్టారు. 'రాజప్రముఖ్' దాదాపు మన గవర్నర్ చలాయించే అధికారాలే చెలాయిస్తాడు. కూటమి రాజ్యాంగస్వరూపం అందుకొరకేర్పరచిన ప్రజాపరిషత్తు తయారు చేస్తుంది. కూటమిలో జేరిన ప్రతిసంస్థానాధీశ్వరుడికీ వంశపారంపర్యము, హక్కులు, బిరుదులు, స్వంతఆస్థి మొదలగునవి, రాష్ట్రాలలో జేరిపోయిన సంస్థానాలప్రభువులకు వలెనే, రక్షించటానికి భారతప్రభుత్వం అంగీకరించింది. వీరి కుటుంబభరణము సంస్థాన ఆదాయాన్నిబట్టి తగ్గుతూ, చిన్నసంస్థానాల ప్రభువులకు సాలీనా మూడువేల రూపాయలవరకు కూడా వుండవచ్చును.

(కథియవార్‌లో పెద్దసంస్థానాలైన (భావనగర్, నవానగర్) సంస్థానాధీశ్వరులుకూడా ఈ కూటమిలో జేరి, వీటి సంపూర్ణ ఐక్యతకు తోడ్పడతామని ముందుకువచ్చారు. వీరిలో నవానగర్ జాంసాహెబ్ సౌరాష్ట్రకూటమి 'రాజప్రముఖ్'గాను, భావనగర్ మహారాజు 'ఉపరాజప్రముఖ్'గాను ఎన్నుకోబడ్డారు. కథియవార్ అంతా సౌరాష్ట్రంగా ఏర్పడింది. ఇందుకు సంబంధించిన బడంబడికపై జనవరి నెల ఆఖరు వారంలో సంతకాలుజరిగి, ఈ కూటమి ఫిబ్రవరి 15 వ తేదీన అమలులోనికివచ్చింది. సంస్థాన శాఖామాత్యుడు సర్దార్‌పటేల్ దీనికి ప్రారంభోత్సవం జరిపాడు.

(ఢిల్లీపట్టణానికి) సమీపానవున్న (ఆళ్వార్, భరతపూర్, ధోల్‌పూర్, కరూలీ సంస్థానాలు) నాలుగు కలిసి మత్స్యరాష్ట్రంగా ఏర్పడటానికి అంగీకరించాయి. వీటి విస్తీర్ణం 7,536 చ. మైళ్లు; జనాభా 18,37,994; ఆదాయం రూ. 1 కోటి 83 లక్షలు. వీనికి సంబంధించిన బడంబడికపై ఫిబ్రవరి 28 వ తేదీన సంతకాలు జరిగాయి) మత్స్యరాజ్య కూటమి మార్చి 18 వ తేదీన ఆమలులోనికి వచ్చింది. మంత్రి గాడ్గిల్ గారు దీనికి ప్రారంభోత్సవ జరిపారు. దీనికి ధోల్‌పూర్ మహారాజు 'రాజప్రముఖ్'గాను, ఆళ్వార్ మహారాజు 'ఉపరాజప్రముఖ్'గాను ఎన్నుకోబడిరి.

(బుందేల్ ఖండ్, బాగెల్ ఖండ్) సంస్థానాలు 35 కలసి 'వింధ్య ప్రదేశ్' అని ఒక కూటమిగా ఏర్పడటానికి నిశ్చయించుకున్నవి. ఇవి సి. పి., యు. పి. రాష్ట్రాలమధ్య వింధ్యపర్వత ప్రాంతలోవున్నవి. భారత దేశం నడిబొడ్డున వుండటం వలన రవాణా సౌకర్యాలు అవిచ్ఛిన్నంగా సాగుతుండటానికి ఇవి చాలా కీలకప్రాంతంలో వున్నాయి. ఈ సంస్థానాలలో రేవాసంస్థానం చాల పెద్దది. ఈ కూటమిలో రేవాసంస్థానం జేరదనే ముందు భావించారు గాని తమకు తగిన ప్రాముఖ్యతయిస్తే ఇందులో జేరటానికి రేవా మహారాజు, ప్రజలుకూడా అంగీకరిస్తామన్నారు. రేవాసంస్థానాన్నికూడా ఈ కూటమిలో కలిపి ప్రజాపరిషత్తులో దానికి తగిన ప్రాతినిధ్యమిచ్చి, అవుసరమైతే చివరకు వీడిపోయే హక్కుకూడా ఇచ్చి, ఈ కూటమి ఏర్పరచారు. ఈ కూటమి విస్తీర్ణం 24,610 చ. మైళ్లు; జనాభా 35,69,455; ఆదాయం దాదాపు రూ. $2\frac{1}{2}$ కోట్లు. దీనికి సంబంధించిన బడంబడిక మార్చి 13 వ తేదీన జరిగి, ఏప్రిల్ 4 వ తేదీన అమలులోనికి వచ్చింది. మంత్రి గాడ్గిల్ గారు దీనికి ప్రారంభోత్సవం జరిపారు. దీనికి రేవా మహారాజా 'రాజప్రముఖ్' గాను పన్నా మహారాజు 'ఉపరాజప్రముఖ్' గాను ఎన్నుకోబడిరి.

(రాజపుత్రస్థానంలోని (బుందీ, దుంగర్ పూర్, కోట) మొదలైన 9 చిన్న సంస్థానాలను కలిపి రాజాస్థాన్ కూటమి ఎర్పరచాలని మొదట్లో ప్రయత్నించారు. ఈ సంస్థానాలన్నిటికీ (ఉదయపూర్ తో) సన్నిహిత సంబంధమున్నది. వాస్తవానికి ఉదయపూర్ సంస్థానం లేనిదే ఈ కూటమి పనిచేయనేలేదు. ఉదయపూర్ పెద్ద సంస్థానమగుటవలన దానినిందులో జేరమని కోరటానికి వీలులేదు. కాని కూటమిలో జేరటానికి ఉదపూర్ మహారాజా ముందుకువచ్చాడు. అప్పుడు రాజాస్థాన్ 10 సంస్థానాలు కలసి రాజాస్థాన్ కూటమిగా ఏర్పడ్డవి. ఈ కూటమికి ఉదయపూర్ మహారాజా 'రాజప్రముఖ్' గాను, కోట, బుందీ, దుంగర్ పూర్ పాలకులు 'ఉపరాజప్రముఖ్' లుగాను ఎన్నుకోబడిరి. దీనికి సంబంధిచిన బడంబడిక ఏప్రిల్ 18 వ తేదీన అమలులోనికి వచ్చింది. పండిట్ జవహార్

లాల్ నెహ్రూ దీనికి ప్రారంభోత్సవం జరిపారు. రాజాస్థాన్ కూటమి స్థాపనలో మరొక ప్రత్యేకతవుంది. సంస్థానాలు భారతదేశంలో జేరే టప్పుడు రక్షణ, రాకపోకలు, విదేశవ్యవహారాలు అను మూడు విషయాల పైననే అధికారాన్ని దత్తతచేశాయి. సంశ్లిష్ట రాష్ట్రాలలో కలిసిపోయిన సంస్థానాలపై సర్వాధికారాలు రాష్ట్రప్రభుతాలకు లభించి, అవి రాష్ట్రాల స్థాయికివచ్చాయి. అట్లానే కూటములను కూడా రాష్ట్రాలస్థాయికి తెస్తే, భారతప్రభుత్వ శాసనాలు ఈ సంస్థానకూటములకు రాష్ట్రములకు సమా నంగా వర్తించి, పరిపాలనసుకరమౌతుంది. కాబట్టి సంస్థానకూటములు పై మూడు విషయాలపైననేగాక, రాష్ట్రప్రభుత్వాలు ఎన్ని అధికారాలు కేంద్రానికి దఖలుపరిస్తే అన్ని అధికారాలు దాఖలు పరచాలని కేంద్ర ప్రభుత్వంకోరింది. ఇందుకుముందుగా రాజాస్థాన్ కూటమి అంగీకరించి, ఆ నిబంధనను ఒడంబడికలో జేర్చుకున్నది. ఇటువంటి నిబంధన ఆటు తర్వాత స్థాపించిన సంస్థానకూటములన్నిటి ఒడంబడికలలోను జేర్చారు. అప్పటికే స్థాపించబడిన సంస్థానకూటములు ప్రత్యేక ఒడంబడికలద్వారా ఆ అదనపు అధికారాలను భారతప్రభుత్వానికి దాఖలు పరిచాయి.

గ్వాలియర్, ఇందూర్, మాళ్వా మరి 20 ఇతర సంస్థానాలు కలిసి 'మధ్య భారత' సంస్థానకూటమని ఏర్పరచుకున్నాయి. గ్వాలి యర్, ఇందూర్‌లు ఈ కూటమిలో జేరటానికి మొదట స్థానికంగా కొంత వ్యతిరేకత కనిపించినా చివరకు అందరూ అంగీకరించారు. ఇందుకు సంబంధించిన ఒడంబడిక ఏప్రిల్ 22 వ తేదీన జరిగి, జూలై 1 వ తేదీన అమలులోకి వచ్చింది. పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ దీనికి ప్రారంభోత్సవం జరిపాడు. ఈకూటమి విస్తీర్ణం 46,273 చ. మైళ్ళు; జనాభా 71 లక్షలు; ఆదాయం 8 కోట్లరూపాయలు.

తూర్పు పంజాబ్ సంస్థానాలగు పాటియాలా, కపుర్థలా, ఫరీద్ కోట, జింద్ మొదలైన 8 సంస్థానాలు కలిసి పాటియాలా, తూర్పు పంజాబ్ సంస్థానకూటమి నేర్పరచటానికి అంగీకరిస్తూ మే 5 వ తేదీన ఒడంబడిక చేసుకున్నవి. ఈ సంస్థానాలన్నీ పాకిస్తాన్ సరిహద్దులలో వుండటంవల్ల, బలపడటం అవసరమని భారతప్రభుత్వం కూడా

గుర్తించింది. దీని వైశాల్యము 3,693 చ. మైళ్ళు, జనాభా 13,67,628; ఆదాయం రెండుకోట్లరూపాయలు. ఈ యూనియన్‌కు జూలై 15 వ తేదీన సర్దార్ పటేల్ ప్రారంభోత్సవం జరిపాడు.

భారత సంస్థానాలు చాలవరకు సంశ్లిష్టరాష్ట్రాలలో కలసి పోవటమూ, కూటములుగా ఏర్పడటము ఈవిధంగా, సంస్థానశాఖ ఏర్పడిన సంవత్సరంలోగానే, జరిగిపోయింది. (బెనారస్, కూచ్-బీహార్, జైసల్మీర్, కాసీ సంస్థానాలు, మణిపూర్, రాంపూర్, సాందూర్, తెహరి-గార్వాల్, త్రిపురా అను 9 చిన్నసంస్థాలు ఇంకా ఏరాష్ట్రం లోను కలిసిపోకుండా ప్రత్యేకంగానే వున్నాయి) (పెద్ద సంస్థానాలు ఇంకొక 12 ప్రత్యేకంగానే వున్నాయి) అవి బరోడా, హైదరాబాద్, కాశ్మీర్, మైసూర్, భోపాల్, కొల్హాపూర్, తిరువాన్కూర్, బికనీర్, కొచ్చిన్, జైపూర్, జోధపూర్, మయూర్‌భంజ్ సంస్థానాలు. వీటికి ప్రత్యేకంగా వుండగల తాహతువున్నదని భారతప్రభుత్వం గుర్తించింది)

సంస్థానకూటముల అధికారాలు, ఒక్క పన్నుల విధింపు విషయంలో తప్ప రాష్ట్రప్రభుత్వాల అధికారాల స్థాయికి తేబడినవి) ఆ మినహాయింపుకూడా తొలగించి వేయాలి. పెద్ద సంస్థానాలై, ప్రత్యేకంగా వుండగల తాహతుగల 12 సంస్థానాల అధికారాలు కూడా ఈవిధంగానే పరిమితం చేయాలి. లేకపోతే, భారతప్రభుత్వ శాసనాలు అన్నిప్రాంతాలకూ సమానంగా వర్తింపవు. అది సుపరిపాలనకు పెద్ద ఆటంకము.)

సంస్థాన ఏకీకరణ జరిగినది; వాటి ఆర్థికాభ్యున్నతి ఇక జరుగ వలసియున్నది. ఇందుకు ముందుగా సుపరిపాలన ఏర్పరచాలి. కేంద్ర ప్రభుత్వ నిపుణులు సంస్థానకూటముల ప్రభుత్వాలకు సుపరిపాలనా పద్ధతులను గురించి సూచనలు చేయటానికి త్వరలోనే వెళ్ళనున్నారు. ఈకూటములన్నీ పరిపాలనా వ్యవహారాలలో స్థిరపడినతర్వాత ఆర్థికాభ్యున్నతికి భారతప్రభుత్వ సహకారంతో కృషిచేయాలి. అప్పుడుగాని ఏకీకరణ పూర్తి సత్ఫలితాలను ప్రజలు అనుభవించరు. సంస్థాన ఏకీకరణ జరిగినంత త్వరగానే, వాటి అభ్యున్నతికూడా జరుగుతుందని ఆశిద్దాము.

---

# దేశరక్షణ

(భారతదేశం విభగితమై, పాకిస్థాన్ మనతో కలసిరాదని తేలిపోయిన తర్వాత దేశరక్షణ సమస్య చాల ప్రాముఖ్యత వహిస్తున్నది.) 60 ఏండ్ల పోరాటం తర్వాత సంపాదించిన స్వాతంత్ర్యాన్ని రక్షించుకోవటానికి అహర్నిశలు మనం అప్రమత్తులమై వుండాలి) మనదేశ సైసర్గిక ఎల్లలమధ్యనే, మనపట్ల విద్వేషభావంతో వ్యవహరించటమే లక్ష్యంగా పెట్టుకున్న ఒక విదేశరాజ్యం ఏర్పడటంవల్ల దేశరక్షణ చాల కష్టతరమైన కార్యమై, మన సైన్యాలను త్వరలో, చురుకుగా అభివృద్ధిచేసుకోవలసిన అవశ్యకత ఏర్పడినది.

దేశవిభజన సమయమున సైన్యాలను సైనికుల మతములనుబట్టి ఆయాదేశాలకు పంచారు. మత ప్రాతిపదికపై సైన్యాన్ని విభజించటం దేశానికి మహోపద్రవకరమైనప్పటికీ, బ్రిటిష్ పాలకులు ఈ పద్ధతినే, ముస్లింలీగ్ సహాయంతో, రుద్దారు. ఇందువల్ల సైన్యంలోనే మతావేశం పెరిగిపోయి, పంజాబ్ కల్లోలాల సమయంలోను, సరిహద్దు, సింధు రాష్ట్రాలలోను ప్రజలను రక్షించటానికి వినియోగించిన సైనికులే అల్ప సంఖ్యాకులను మరీ హింసించారు. (అవిభక్త భారత సైన్యాన్ని జులై 11 వ తేదీన ఇండియా, పాకిస్థాన్‌లకు పంచారు.) ఆ పంపకంలో (ఇండియాకు ఇన్‌ఫెంట్రీ రెజిమెంట్లు 15; ఆర్మర్డ్ కార్ప్స్ దళాలు 12; ఆర్టిలరీ రెజిమెంట్లు $18\frac{1}{2}$; ఇంజనీరింగ్ దళాలు 61 లభించాయి. పాకిస్థాన్‌కు ఇన్‌ఫ్రింట్రీ రెజిమెంట్లు 8; ఆర్మర్డ్ కార్ప్స్ దళాలు 6; ఆర్టిలరీ రెజిమెంట్లు $8\frac{1}{2}$; ఇంజనీరింగ్ యూనిట్లు 34 లభించాయి. అదేరోజున జరిగిన నౌకాదళం పంపకంలో, ఇండియాకు స్లూపులు 4; ఫ్రిగేట్లు 2; మైన్ స్వీపర్లు 12; సర్వేషిప్ 1; ట్రాలర్లు 8; హార్బర్ రక్షణ నౌకలు 4 వచ్చాయి. పాకిస్థాన్‌కు స్లూపులు 2; ఫ్రిగేట్లు 2; మైన్ స్వీపర్లు 6; ట్రాలర్లు 2; హార్బర్ రక్షణ నౌకలు 4 లభించాయి. ఆగస్టు 12 వ తేదీన విమానదళం పంపకంజరిగింది. ఇండియాకు

ఫైటర్ స్క్వాడ్రన్‌లు 7; రవాణా స్క్వాడ్రన్ ఒకటి; పాకిస్థాన్‌కు ఫైటర్ స్క్వాడ్రన్ ఒకటీ, రవాణా స్క్వాడ్రన్ ఒకటి వచ్చాయి. పాకిస్థాన్‌లో పెషావర్‌లోవున్న డకోటా విమానాలను కొద్దిమార్పులు చేయించి పాకిస్తాన్ ఇంకొక ఫైటర్ స్క్వాడ్రన్ తయారుచేసుకో వచ్చునని భావించారు. అవిభక్త భారతదేశంలోవున్న వెయ్యిమంది నావికులలో 500 మంది పాకిస్థాన్‌కు, 500 మంది ఇండియాకు వచ్చారు. పాకిస్థాన్‌కన్న ఎన్నోరెట్లు పెద్దదై, సంరక్షించుకోవలసిన సరిహద్దు పొడవు ఎక్కువవున్న భారతదేశానికి పాకిస్థాన్‌కన్న రెట్టింపుమాత్రం సైన్యమే వచ్చింది. భారతదేశ సముద్రతీరంలో పాకిస్థాన్ సముద్రతీరం నాలుగవవంతుకూడా లేదు; అయినా నౌకాదళంలోను, నావికులలోను సగభాగం పంచుకుంది. కాబట్టి రెండుదేశాలు స్వతంత్రమైనవాడు, రెండిటి బలాబలాలను పోల్చిచూస్తే, ఇండియాకన్న, పాకిస్థానే సైనికంగా ఎక్కువ బలవంతంగా వున్నదని ఒప్పుకోవాలి. దీనికితోడు ముస్లింలీగ్ తయారుచేసివుంచిన నేషనల్ గార్డ్స్ అందరూ సైనికులవంటి వారే; స్వల్ప శిక్షణతో వారిని మామూలు సైనికులుగా తయారుచేయ వచ్చును. దేశ జనాభా, విస్తీర్ణము, కీలకప్రాముఖ్యతల దృష్ట్యా పరిశీలిస్తే, ఈనాడు ప్రపంచంలోకెల్లా సైనికంగా బలహీనమైనది భారత దేశమేనని నిస్సందేహంగా చెప్పవచ్చును.

ఆగస్టు 15 వ తేదీనాటికి యుద్ధసామగ్రి వగైరా అంతా పంపక మైపోయినా, ఒక అధినివేశంనుంచి ఇంకొక అధినివేశానికి ఈ పంప కాలప్రకారం రవాణా జరగలేదు. ఈ రవాణా సక్రమంగా జరపటానికీ, రెండుదేశాల రక్షణ పథకాలను సమన్వయపరచటానికి 'సుప్రీం కమాండర్'ను నియమించాలని విభజనసమయంలో రెండుపక్షాలూ అంగీకరించి, సర్. క్లాడ్ ఆకిన్‌లెక్‌ను ఆ పదవికి నియమించారు. ఇండియా, పాకిస్థాన్‌లలో మిగిలివున్న బ్రిటిష్ సైనికుల ప్రయోజనముల రక్షణ బాధ్యతకూడా ఆయనకే వప్పజెప్పారు. ఆకిన్‌లెక్ పాకిస్థాన్ పక్షపాతి అన్నవిషయం జగమెరిగినదే. పాకిస్థాన్ సైన్యంలో ఒక పెద్ద

ఉద్యోగిభార్య ఈయనఇంట్లో గృహిణిత్వం వహించివుండేదికూడాను.) పాకిస్థాన్‌కు పోవలసిన సామగ్రిమాత్రం చకాచకా పంపించి, అక్కడ నుండి రావలసిన సామగ్రి ఆలస్యంగాను, పాడుచేసి రప్పించడం మొదలైనవాటివల్ల ఈయనంటే భారతప్రభుత్వానికి నమ్మకం పోయింది. కాశ్మీర్‌లో అప్రటితయుద్ధం ప్రారంభం కావటంతో ఈపదవి కేవలం నిరర్థకమైంది. 1948 వ సం. మార్చి నెలవరకు వుంచవలెననుకొన్న ఈ 'సుప్రీం కమాండర్' పదవి నవంబరు 30 వ తేదీతోనే రద్దుచేయాలని భారతదేశం పట్టుపట్టి, రద్దుచేయించింది.

ఈ దేశంలోని ఆయుధకర్మాగారాల నన్నింటిని ప్రభుత్వమే నిర్వహిస్తుండేది. యుద్ధకాలంలో బ్రిటిష్‌ప్రభుత్వం ఇక్కడ స్థాపించిన ఆయుధకర్మాగారాలనుకూడా భారతప్రభుత్వపరం చేశారు. ఇవి ఇండియా పాకిస్థాన్‌లలో ఏదేశంలో వున్నవి ఆదేశంవంతుకు వచ్చాయి. కాని వీటివల్ల ఉపయోగం చాల తక్కువ. ఆధునికకాలంలో దేశరక్షణకు తుపాకులు, రైఫుల్స్, ప్రేలుడు సామగ్రి మొదలైనవేగాక యుద్ధనౌకలు, సైనిక టెలిఫోన్లు, టాంకులు, అనేకరకాల విమానాలు, రాడర్లు, వైర్‌లెస్‌సామగ్రి మొదలైన అనేకరకాల సామగ్రి కావలసి వున్నది. ఒకదేశసైన్యశక్తి ఆదేశసైన్యసంఖ్య, దాని ఉద్యోగుల అనుభవము, తర్ఫీదు, శిక్షణ, తెలివితేటలపైననేగాక దాని ఆయుధ సంపత్తిపైననే ఎక్కువగా ఆధారపడివుంటుంది. కాని ఆయుధసామగ్రి ఉత్పత్తిలో మనదేశం చాల వెనుకబడివున్నది. మనం స్వాతంత్ర్యం పొందినతర్వాత సంవత్సరకాలంలోకూడా ఈ విషయమై ఏ నిర్మాణాత్మక కృషీ జరుగలేదు.

మనదేశంలో ఇప్పుడు చిన్నచిన్నతుపాకులు, చిన్నరైఫుల్స్, ఒకమాదిరి ప్రేలుడు సామగ్రి తయారుచేయటానికి యంత్రాగారాలున్నాయి. వీటి ఉత్పత్తి, వ్యయము ఎంతో మనకు తెలియదు. ఒక టాంకుగాని, విమానంగాని, వైర్‌లెస్ సెట్‌గాని, మిలిటరీ, సివిల్ మోటార్లుగాని మనదేశంలో ఉత్పత్తిచేయటానికి యంత్రాగారాలు లేవు.

మనకువున్న పెట్రోల్ చాల తక్కువ. ఏరకపు ప్రేలుడు సామగ్రి తయారుచేయటానికైనా కెమికల్స్ అమెరికానుంచో, బ్రిటన్ నుంచో దిగుమతి చేసుకోవాలి. మనదేశంలోవున్న ఫ్యాక్టరీలలో ఉత్పత్తి అయినా చాలా విచిత్రంగా జరుగుతుంది. ఒక సాధారణ తుపాకీ తయారుచేయాలంటే గానిగొట్టపుకడ్డీ ఇసాపూర్ 'మెటల్ అండ్ స్టీల్ ఫ్యాక్టరీ'లోను, గొట్టపుసారంగం కాసీపూర్ 'గన్ అండ్ షెల్ ఫ్యాక్టరీ'లోను (ఇవి రెండు కలకత్తాదగ్గర వున్నాయి); దాని అమర్పు అక్కడికి 700 మైళ్ళ దూరంలోవున్న జబల్పూర్ 'గన్ అండ్ క్యారేజి ఫ్యాక్టరీ'లోను, దాని తనిఖీ అక్కడికి 600 మైళ్ళలోనున్న బలాసూర్ లోను జరగాలి. మనదేశంలో ఉత్పత్తి అయే సామగ్రి అంతా ఇన్ని చుట్లు తిరగాలిసిందే. ఆయుధసామగ్రి మొదటినుంచీ చివరిదాకా తయారుచేసేవిధానం భారతీయులకు తెలియకుండా వుంచటానికే బ్రిటిష్‌వారిట్లా అక్కడొక ముక్కా, ఇక్కడొక చెక్కా తయారు చేయిస్తూవచ్చారు. దీనివల్ల పనికూడా చాలా ఆలస్యంగా జరుగుతుంది; రవాణాఖర్చులు హెచ్చవుతవి. ఇంతేగాక, ఇక్కడ తయారయే యుద్ధ సామగ్రి ప్లాను, డిజైను బ్రిటన్‌లో తయారై రావలసిందే. ఒక క్రొత్త రకపు ఆయుధాన్ని కనిపెట్టగల సమర్థుడెవ్వడు భారతీయులలో వుండకూడదని బ్రిటిష్‌వాళ్లు భావించటంలో అసమంజమేమున్నది? అయితే గతసంవత్సరంనుంచి ఈపరిస్థితి ఏమన్నా బాగుపడిందా లేదా అన్నదే మనం ఆలోచించవలసినవిషయం. కాని అది అతిరహస్యం. బట్టబయలుచేస్తే సాధించింది శూన్యమని తేలుతుంది.

చిన్న చిన్న ఆయుధాల పరిస్థితే ఇంత అధ్వాహ్నంగా వుంటే టాంకులు, సాయుధశకటాలు, విమానాలు, యుద్ధనౌకలు, డెస్ట్రాయర్లు, క్రూయిజర్లు, రాడర్లు మనదేశంలో ఎప్పుడు ఉత్పత్తి అవుతవో చెప్పలేము. ఈ ఆయుధాల ఉత్పత్తికి అవుసరమైన యంత్ర సామగ్రి, నిపుణులు మనదేశంలో లేరు. దీని పర్యవసానంగా మనంపైకి ఎన్నికబుర్లు చెప్పినా, సమయం వచ్చేటప్పటికి ఏదో ఒక అగ్రరాజ్యం

క్రిందకు జేరక తప్పదు. ఏ అగ్రరాజ్యంతోనైనా మనం వివాదం పెట్టుకుంటే, క్షణం ప్రతిఘటించగలశక్తి మనకు లేదు. ఇంతటి ఆయుధబలసంపత్తి మనకు 20-25 ఏండ్లలోనైనా లభిస్తుందా అన్నదే ఇప్పుడు విచారణీయము. విదేశాలతో, అగ్రరాజ్యాలు కాని చిన్న చిన్న దేశాలతో, (ఏదో ఒక రకపు సంధిచేసుకుని మన నిపుణులకు తర్ఫీదు ఇప్పించుకోవటము, యంత్రసామగ్రి తెప్పించుకోవటము, దానిని తర్వాత మనం వృద్ధిచేసుకోవటము జరగాలి.) ఇది ఎంత త్వరగా జరిగితే అంత మంచిది. ఇందుకు అగ్రరాజ్యాలపై ఆధారపడివుంటే ఏలాభము లేదని మనం గ్రహించుకోవాలి.

మన నౌకాదళానికి ఒక క్రూయిజర్ ఈ మధ్యనే కొన్నారు. మూడు డెస్ట్రాయర్లు త్వరలో రానున్నవి, రెండు విమాన వాహక నౌకలు కొనవలెనని ఆలోచిస్తున్నారు. వీటిని నడిపేటందుకు నావికులను బ్రిటన్ పంపి అక్కడ శిక్షణ యిప్పించుకొనవలెను. ఇప్పుడు ఆరువందలమంది నావికులు అక్కడ శిక్షణ పొందుతున్నారు. వీరు తిరిగివచ్చి, ఈ నావల సహాయంతో ఇంకా ఎక్కువమంది నావికులకు శిక్షణ యిచ్చి మన నౌకాదళాన్ని వృద్ధిపరచటానికి తోడ్పడతారు. బ్రిటన్ నౌకాదళంలో ఈ సంవత్సరాంతంలో 8 విమానవాహక నౌకలు, 17 క్రూయిజర్లు, 14 యుద్ధనౌకాలు, 94 సబ్-మెరీన్లు, 52 డెస్ట్రాయర్లు, ఒకటిన్నరలక్షలమంది నావికులు వుంటారట. మన నౌకాదళం మనదేశ హోదాకు తగినంత పెద్దది కావాలంటే ఎంత అభివృద్ధి జెందాలో దీనివల్ల స్పష్టపడుతున్నది. మన విమానదళంలో కొన్ని జెట్ విమానాలు, కొన్ని బాంబర్లుకొని 5 సంవత్సరాలలోగా మొత్తం 15 స్క్వాడ్రన్లు తయారు చేయాలని ఆలోచిస్తున్నారు. 'హిందుస్థాన్ ఎయిర్ క్రాఫ్ట్స్' ఫ్యాక్టరీలో విమానం తయారయేరోజు ఇంకా రాలేదు. శాంతి కాలంలోనే 35 వేల విమానాలు వుండాలని అమెరికన్ అధికారులు అంచనాలు వేసుకుంటున్నారు. మన 15 స్క్వాడ్రన్లు వాటిముందు ఎంతో, మనం ఇంకెంత వెనుకబడి వున్నామో ఆలోచించుకోవచ్చును.

మన సైన్యబలం అభివృద్ధికావటానికి ముఖ్యంగా కావలసింది యుద్ధపరిశ్రమల అభివృద్ధి. ఇందుకు కావలసిన యంత్రసామగ్రి ఏవిధంగా సైనాసరే, ఏదేశంలో సైనాసరే వెంటనే కొని వేయటమే మార్గము. వీలైతే మన పలుకుబడి నుపయోగించి, ఏ అగ్రరాజ్యం ఫ్యాక్టరీలలోనో మన వారికి కొందరికి తర్ఫీదు, అనుభవము లభించేటట్లు చేయాలి. ఈ రెండుపనులూ కూడా ఈ సంవత్సరం అతిక్రూరంగా నిర్లక్ష్యం చేశారు.

పాకిస్థాన్ మనతో కలసిరాదని కాశ్మీర్ సంఘటనతో తేలి పోయిన తర్వాత భారతదేశ సరిహద్దుల రక్షణ అత్యంత ప్రమాద కరంగా పరిణమించింది. వందలకొలది మైళ్ళ పొడవువున్న సరిహద్దులను దాటి అటు పంజాబ్‌లోను, ఇటు బెంగాల్‌లోను శత్రువులు తేలికగా ప్రవేశించకుండా అటకాయించటానికి సైసర్గిక ఆటంకాలేవీ లేవు. అందుకు మన సైనిక బలంపైననే మనం ఆధారపడి వుండాలి. పశ్చిమ పాకిస్థాన్ సరిహద్దులలోవున్న కచ్, జైసల్మేర్‌ల పరిపాలన భారత ప్రభుత్వం వశపరచుకున్నా ఎక్కువ సైన్యము, స్థానిక ప్రజలకు సైనిక శిక్షణలేనిదే సరిహద్దులను కాపాడటం చాల కష్టం. ముఖ్యంగా బెంగాల్, పంజాబ్‌లలో ప్రతి పౌరుడికీ సైనిక శిక్షణయిచ్చి తీర వలసిందే; ఒకస్థాయి హోదావున్న ప్రతి వ్యక్తికీ ఆయుధాలిచ్చి తీర వలసిందే. యుద్ధకాలంలో మనదేశంలో 20,53,000 సైనికులు, 32,917 నావికులు, 29820 వైమానికులు వుండేవారు. ఇప్పుడు 2,60,000 సైనికులు, 500 నావికులు మాత్రమే వుంచి, తక్కిన వారందరినీ సైన్యంలోనుండి విడుదల చేశారు. కాశ్మీర్ సంఘటనలలో మన సైన్యాలు సాధించిన దానిని నిష్పాక్షికంగా పరిశీలిస్తే, మెచ్చుకో వలిసిందేమీ కనపడటం లేదు. మాజీసైనికులనందరినీ వెంటనే తిరిగి పిలిపించి, అదనపు శిక్షణ ఏర్పాటుచేసుకుని, పౌరసైన్యాలను తయారు చేసుకోకపోతే, ప్రమాద పరిస్థితి తటస్థించినప్పుడు విచారించవలసి వస్తుంది.

1947 ఆగస్టు 15 వ తేదీనాటికే భారతసైన్యంలో బ్రిటిష్ ఉద్యోగుల సంఖ్య చాలతక్కువ. అయితే, పెద్దపదవులన్నీ వారి చేతిలోనే వున్నాయి. ఆనాటికి భారతీయుడు ఒక్కడే మేజర్-జనరల్ వుండెను; 6 బ్రిగేడ్‌లు, సబ్-ఏరియాలు భారతీయుల నాయకత్వమున వుండెను. డివిజన్ కమాండరుగా భారతీయుడు లేనేలేడు. కాని ఇప్పుడు మూడుశిక్షణ రెజిమెంట్ కేంద్రాలు తప్ప తక్కిన రెజిమెంట్లు, బెటాలియన్ కమాండ్లు, మూడు ఆర్మీకమాండ్లు, అన్ని డివిజన్, ఏరియా, సబ్-ఏరియా కమాండ్లు భారతీయుల చేతులలోనే వున్నాయి. జనవరి 15 వ తేదీనాటికే 5 గురుభారతీయులు మేజర్-జనరల్‌లు అయినారు. నౌకా, వైమానిక దళోద్యోగులలో 620 కమీషన్-ఆఫీసర్లు, 209 వారంట్ - ఆఫీసర్లలో 60 మంది కమీషన్ - ఆఫీసర్లు, 70 మంది వారంట్ ఆఫీసర్లు తప్ప తక్కిన వారందరు ఇప్పుడు భారతీయులే. నౌకాదళ ప్రధాన కార్యాలయంలో 75 మంది పెద్ద ఉద్యోగులలో 9 మంది మాత్రమే భారతయేతరులు. ఏప్రిల్ 1 వ తేదీనాటికి భారతీయునే సర్వసేనాధిపతిగా నియమించాలని అనుకున్నారు గాని జనరల్ బూచర్‌ను మరి కొంత కాలంవుంచితే బాగుండునని తరువాత నిశ్చయించారు. నౌకా, వైమానికదళాల ప్రధానాధిపతులుగా బ్రిటిష్ వాళ్లు ఇంకా కొంతకాలం వుండవలసివస్తుంది. భారత సైన్యనాయకత్వం ఈవిధంగా భారతీయులకే వప్పజెప్పినా శిక్షణ కేంద్రాలలోను, అతి ప్రధానమైన స్థానాలలోను బ్రిటిష్ ఉద్యోగులను ఉంచుకొనక తప్పలేదు. ప్రస్తుత పరిస్థితులలో అంతకన్న గత్యంతరంలేదు. 1947 ఆగస్టు 15 వ తేదీన భారతసైన్యంలోవున్న బ్రిటిష్ ఉద్యోగులందరూ డిశెంబరు 31 వ తేదీతో వైదొలగవలసిందని అక్టోబరు నెలారంభంలోనే నోటీసు లిచ్చారు. అప్పటితో బ్రిటిష్‌ప్రభుత్వబాధ్యత తీరిపోయి, ఇక ముందెవ్వరైనా బ్రిటిష్ ఉద్యోగులు భారతసైన్యంలో వుంటే భారతప్రభుత్వంతో నేరుగా క్రొత్త కాంట్రాక్టు వ్రాసుకోవలసి వచ్చింది. టెక్నికల్ శాఖలలోను, శిక్షణ కేంద్రాలలోను వున్న

బ్రిటిష్ ఉద్యోగులను వెంటనే పంపివేయటం మనకే కష్టమని భారత ప్రభుత్వం గుర్తించింది. ఇక ముందు వారు వుండదలచుకుంటే ఇదివర కటి జీతము, సౌకర్యాలు యిస్తామని చెపుతూ క్రొత్త షరతులు నవంబరు 20 వ తేదీన ప్రకటించారు. వీటిప్రకారం సైన్యంలో వున్న వారు ఒక సంవత్సరము, నావికులు 3 సంవత్సరాలు, వైమానికులు 2 సంవత్సరాలు వుండేటట్లు ఒడంబడిక చేసుకోవాలి. సైన్యంలో కూడా ప్రభుత్వం కోరితే రెండు, మూడేండ్లు వుండటానికి ఒడంబడిక చేసుకో వచ్చును. మూడేండ్లతరువాత ఏ విదేశస్థుడినీ మన సైన్యంలో వుండ నివ్వరు.

ఆఖరు బ్రిటిష్ సైనికులు ఫిబ్రవరి 29 తేదీన బొంబాయిలో 'ఎంప్రెస్ ఆఫ్ ఆస్ట్రేలియా' అనే ఓడపై ప్రయాణమై వెళ్లిపోయారు. భారతచరిత్రలో అదొక మహా పర్వదినం. కొన్నిశతాబ్దాల తర్వాత విదేశ ఆక్రమణసేనలు పూర్తిగా ఆనాటితో పీడ వదలిపోయాయి.

భారతసైన్యానికి అవుసరమైనంతమంది ఉద్యోగులకు ప్రత్యేక శిక్షణ యివ్వటానికి ఒక 'వార్ ఎకాడమీ'ని స్థాపించాలని భారత ప్రభుత్వం చాలరోజులనుంచి ఆలోచిస్తున్నది. ఇందుకు పథకం తయారు చేయటానికి ఒక సంఘాన్ని 1945 వ సం॥ లోనే నియమించారు. ఆ సంఘ సూచనల ననుసరించి పూనాదగ్గరనున్న ఖర్క్వలసలో 'వార్ ఎకాడమీ'ని స్థాపించటానికి ప్రభుత్వం నిశ్చయించింది. ఇక్కడ కట్టడాలన్నీ తయారయేవరకూ వేచివుండక, ముందుసంవత్సరమే విద్యార్థులను చేర్చు కుని డేరా ఢూన్‌లో శిక్షణ యివ్వటం ప్రారంభిస్తారు. 'వార్ ఎ కాడమీ' శిక్షణకు మెట్రిక్యులేషన్ ప్యాసయిన బాలురను పరిశీలించి, తీసుకుంటారు. వీరి వయస్సు 15, 17 ఏండ్లమధ్య వుండాలి. ఇక్కడ శిక్షణ, భోజనము ఉచితము. భూ, నౌకా, వాయుదళాలకు అన్నింటికీ ఇక్కడనే శిక్షణ యిస్తారు. మొదట మూడేండ్లు అన్ని దళాలవారికీ ఒకే శిక్షణ యిచ్చి, తర్వాత ఏదళంవారికి ఆ దళానికి ఉపయోగించే ప్రత్యేక శిక్షణ యిస్తారు. ఇక్కడ పరీక్ష ప్యాసయినవారికి బి. ఏ. డిగ్రీ

యిచ్చి, భారతసైన్యంలో ఉద్యోగులుగా తీసుకుంటారు. 'వార్ ఎకాడమీ' మనదేశంలో ఎన్నడో స్థాపించవలసింది. స్వతంత్రభారత ప్రభుత్వం తొలిసంవత్సరంలోనే ఆ కొరత తీర్చటం ముదావహం.

విద్యార్థులలో సైనిక వాతావరణం ఏర్పరచి, వారి జీవితాలు క్రమ శిక్షణయుతంగా గడపటానికి తోడ్పడటానికీ, భారతసైన్యానికి కావలసిన ఉద్యోగులుగా జేరటానికి వారిలో ఉత్సాహం కలిగించటానికీ, విద్యార్థులకు సైనిక శిక్షణ అవుసరమని భారతీయులు ఎన్నాళ్ళనుంచో ఆందోళన జేస్తున్నారు. ఇందుకు ఒక పథకం తయారు చేయటానికి 1946 వ సం. లో పండిట్ హృదయనాథ కుంజ్రూ అధ్యక్షతన ఏర్పరచిన సంఘం ఈమధ్య నివేదిక సమర్పింపంగా, భారతప్రభుత్వం దానిని అంగీకరించి, మరుసంవత్సరమునుండి అమలు జరపటానికి నిశ్చయించింది. కళాశాలలు, విశ్వవిద్యాలయాలలో చదువుతున్నవారిని 'సీనియర్ డివిజన్' దళంగాను; హైస్కూళ్ళలో చదువుతున్న విద్యార్థులను 'జూనియర్ డివిజన్' దళంగాను; ఒక ప్రత్యేక 'బాలికాదళము' ఏర్పరచి, సైనిక శిక్షణ యివ్వటానికి ఈసంఘు సిపార్సుల ప్రకారం నిశ్చయించారు. 'సీనియర్ డివిజన్'లో 32,540 మందిని, 'జూనియర్ డివిజన్'లో 2,35, 000 మందినీ, ఐచ్ఛికంగా వచ్చినవారిని జేర్చుకుంటారు. వీరి శిక్షణవగైరా కేంద్రప్రభుత్వ యాజమాన్యాన, ఒక ప్రత్యేక సంఘు ఆధ్వర్యాన జరుగుతుంది. 'సీనియర్ డివిజన్'లో కొందరికి నౌకాదళంలో బొంబాయి, కొచ్చిన్, కలకత్తా, మద్రాసు, విశాఖపట్టణాలలోను; కొందరికి విమానదళంలో వైమానికులు; సాంకేతిక నిపుణులు అను రెండువిభాగాలుగాను శిక్షణ యిస్తారు. నౌకా శిక్షణకు ప్రారంభవ్యయం రూ. 29 లక్షలు, ప్రతిసంవత్సరము రూ. 4 లక్షలు; సైనికదళమునకు (జూనియర్ డివిజన్, బాలికాదళంతో సహా) ప్రారంభవ్యయం రూ. 276 లక్షలు, ప్రతిసంవత్సరము రూ. 240 లక్షలు; వైమానికదళానికి ప్రారంభవ్యయం రూ. 60 లక్షలు, ప్రతి సంవత్సరము రూ. 10 లక్షలు ఖర్చవుతుందని అంచనా వేశారు.

ఇప్పుడు విశ్వవిద్యాలయాలలో వున్న యు. టి. సి. నిరద్దు చేస్తారు. ఇప్పటివరకు విద్యార్థులకు సైనిక శిక్షణకు అవకాశాలు చాల తక్కువగా వున్నాయి. ఇక ముందైనా విద్యార్థులు సైనిక శిక్షణపొంది, తమ జీవితాలను, తమ దేశరక్షణను అభివృద్ధిపరచటానికి దీనివలన మంచి అవకాశం లభిస్తుంది.

దేశానికి యుద్ధకాలంలో అవుసరమైన సైన్యం శాంతికాలంలో అనవుసరం. కాని యుద్ధకాలంలో ఒక్కమాటు సైన్యం ఎట్లా వస్తుంది? శాంతిసమయంలో తమ పనులు చక్కబెట్టుకుంటూ, అవుసరమైనప్పుడు వెంటనే సైన్యంలో జేరగల వారిని కొందరిని తరిఫీదు చేసివుంచటం ఎంతైనా అవుసరం. అవుసరమైతే, ఆంతరంగిక శాంతి కాపాడటానికి పోలీసులకు కూడా వీరు తోడుపడవచ్చును. పౌరులలో, మగవారిలో వయోజనులకందరికీ ఒకటి రెండేండ్లపాటు సైనిక శిక్షణ యిచ్చివుంచితే, వారు క్రమశిక్షణతో చక్కని పౌరులుగా జీవించటమే గాక అవుసరమైనప్పుడు తమ దేశరక్షణకు ముందుకు రావటానికి వీలుంటుంది. ఈ పద్ధతి ప్రపంచంలో చాలదేశాలలో అమలులో వుంది. బ్రిటిష్‌పాలనలో పెద్ద చేతికర్ర అయినా పుచ్చుకొనకూడకపోయిన మనం, స్వాతంత్ర్యం రాగానే అందరికీ సైనిక శిక్షణ యివ్వాలని అప్పుడనుకుంటుండే వారము. మన దేశప్రస్తుత పరిస్థితులనుబట్టి కూడా అది ఎంతేని అవుసరము. పౌరరక్షణకు 1,30,000 వేలమంది పౌరులకు సైనిక శిక్షణ యివ్వటానికి భారతప్రభుత్వం నిర్ణయించింది. దేశమంతా 8 విభాగాలు చేసి, ఒక్కొక్క భాగంలోను ఒక్కొక్కదళాన్ని ఏర్పాటు చేస్తారు. వీరు అవుసరమైనప్పుడు సైన్యానికి తోడ్పడటానికి, కోస్తా రక్షణకు, విమానవిధ్వంసక శతఘ్నులను నిర్వహించటానికీ పనికి వస్తారు. ఈవిధంగా పౌరసైన్యాలకు ఏర్పాటుచేయటం మంచిదే కాని ఇంత తక్కువమందికి శిక్షణయిస్తే చాలదు. ఒక పంచవర్ష ప్రణాళిక ప్రకారం, కనీసం ఒకకోటిమంది యువకులకైనా శిక్షణ యివ్వటం అత్యవుసరం.

సైన్యాభివృద్ధికి అన్ని ప్రాంతాలవారూ ముందుకువచ్చి, సైన్యంలో జేరాలి; లేకపోతే వారే నష్టపడతారు. ఉదాహరణకు, భారతసైన్యంలో ప్రధానోద్యోగులలో ఈనాడు ఆంధ్రుడొక్కడూ లేడు. ఇందుకు కారణం మనం సైన్యంలో జేరకపోవటమే. ఇప్పుడుకూడా సైన్యంలో ఇతర అన్ని ప్రాంతాలవారూ చేరుతున్నారు గాని ఆంధ్రులు చాల తక్కువమంది చేరుతున్నారు. చిట్టచివరకు ఎప్పుడో నిద్రలేచి, ఆంధ్రుడొక్కడు జనరల్ లేడని విలపిస్తే ప్రయోజనం ఏమిటి? ఒక్కొక్క ప్రాంతానికి ఒక్కొక్కడివిజన్ ఏర్పరచి, అన్ని ప్రాంతాలవారు విరివిగా సైన్యంలో చేరేటట్లు చూడాలి.

భారతప్రభుత్వ రక్షణ శాఖ తొలిసంవత్సరం సాధించిన కార్యాలు, మనదేశ అవుసరాలనుబట్టి చూస్తే అసంతృప్తికరంగా వున్నా, ఇతర శాఖల కృషినిబట్టి చూస్తే సంతృప్తికరంగానే వుందని చెప్పాలి.



# కార్మిక విధానము

ఇంతవరకు ఎక్కువగా ధనవంతుల చేతనే పోషింపబడినా కాంగ్రెస్ సంస్థ సానుభూతి కార్మికవర్గముల పట్లనే ప్రదర్శితమౌతూవుండేది. కాంగ్రెస్ మహానాయకులగు మహాత్మాగాంధి, పండిత జవహర్‌లాల్ నెహ్రూలు కార్మిక కర్షక జనాభ్యుదయమే తమ ఆశయమని అనేక పర్యాయాలు విస్పష్టం చేశారు. స్వతంత్రభారతదేశములో కాంగ్రెస్ ప్రభుత్వము ఏర్పడుటతో దేశములో ఒకవిధమైన సోషలిస్టు వ్యవస్థ స్థాపితమగుననే అందరూ ఆశించారు. కాంగ్రెస్ సంస్థ లక్ష్యములు పునర్నిర్వచింపబడినప్పుడు, కాంగ్రెస్ ఆర్థికలక్ష్య నిర్వచనలో కార్మిక జనశ్రేయోభివృద్ధికి అనేక నిబంధనలు పొందుపరిచారు. దేశంలో వాస్తవంగా జరుగుతున్న పరిస్థితులు తెలియకుండా, కాంగ్రెస్ లక్ష్యములు, కాంగ్రెస్ నాయకుల ఉపన్యాసాలు పరిశీలించిన వారెవ్వరైనా కాంగ్రెస్ ఒక గొప్ప సోషలిస్టు సంస్థ అనీ, భారతదేశంలో సోషలిస్టు వ్యవస్థ చురుకుగా నిర్మింపబడుతున్నదనీ భావించకపోరు. ఈ దేశంలో వుండి, పైనందిన వ్యవహారాలను ప్రత్యక్షంగా అనుభవిస్తున్నవారు మాటలకు ఆచరణకు వున్న ఈ దూరాన్ని చూచి విస్తుపోక తప్పటంలేదు.

మనదేశంలో 30 కోట్ల జనాభాలో, దాదాపు 8 కోట్ల మంది కార్మికులే; వీరిలో 70, 80 లక్షల మంది బస్తీలలో నివసించే ఫ్యాక్టరీ కార్మికులు; తక్కినవారు గ్రామాలలో నివసించే వ్యవసాయ కూలీలు. వ్యవసాయ కూలీల పరిస్థితులు, జీవనస్థాయిని గురించి మనకు వివరాలు ఏమీ తెలియవు; పట్టణాలలోవుండే ఫ్యాక్టరీ కార్మికుల పరిస్థితులు, జీవనస్థాయిని గురించి కూడా మనకు పూర్తి వివరాలు తెలియవు. ఫ్యాక్టరీలకు కార్మికులను సప్లయిచేయటానికి కొందరు 'మధ్యవర్తి' లేక 'దలాలీ'లుంటారు. వీరు కార్మికులను చాలా అన్యాయంజేస్తుంటారని ప్రతీతి. ఈ పద్ధతి రూపుమాపాలని కాంగ్రెస్ నాయకులు అనాదిగా

ఆందోళన చేస్తూనేవున్నారు. ఇప్పుడైనా, వెంటనే ఈ పద్ధతిని రద్దు పరచి, 'ఉద్యోగ సలహా సంఘము'ల ద్వారానే ఫ్యాక్టరీ యజమానులు తమకు కావలసిన కార్మికులనందరిని సమకూర్చుకొనవలసిందని ప్రభుత్వం సలహాయివ్వవలెను. కార్మికుల నియామకం 'ఉద్యోగ సలహా సంఘము' ద్వారా జరిగితే, వారికి సంబంధించిన సమస్త వివరములు ప్రోగుచేసి, కార్మికాభ్యున్నతి కార్యక్రమము చురుకుగా అమలుజరుపుటకు వీలగును. కార్మికులను గురించి ఇటువంటి వివరాలు తెలియకపోవటంవల్లనే ఆరోగ్య భీమా, నిరుద్యోగ భీమా మొదలైన 'సామాజిక న్యాయ' కార్యక్రమాన్ని ఆచరణలోనికి తేలేకపోతున్నారు.

భారత కార్మికసమస్యలలో ముఖ్యమైన మరొకటి కార్మికుల నిలకడ రాహిత్యము. పల్లెలలో పనిలేనప్పుడు డబ్బు సంపాదించటానికి పట్నాలకుపోయి, ఏ ఫ్యాక్టరీలోనో ఉద్యోగం సంపాదించి, రెండు మూడు నెలలు ఉద్యోగంచేసి, మళ్ళీ వూడుపుల కాలం వచ్చేటప్పటికి ఇంటికి జేరుతుండటం మన కార్మికులలో చాలమందికి అలవాటు. ఈ విధంగా వీరిలో నిలకడ లేకపోవటంవల్ల వారికి ఉద్యోగం యిచ్చిన ఫ్యాక్టరీ యజమాని మళ్ళీ వెంటనే ఇంకొక కార్మికుడిని వెతుక్కోవలసి రావటమే గాక, కార్మికాభ్యున్నతి కార్యక్రమం అమలుజరపటం అతి కష్టమైపోతోంది. పట్టణాలలో కార్మికులకు చక్కని వసతులు, తగినంత, ఆకర్షణీయమైన జీతము లభిస్తే, చాలమంది బీద గ్రామస్థులు కార్మికులుగా వచ్చి చేరి, నిలకడగానే వుండిపోతారు. ఇందుకు అవుసరమైన సౌకర్యాలు దేశమంతటా ఇంత త్వరలో ఏర్పాటుచేయటం చాల కష్టమైన పనేగాని ఈ సంవత్సరం కార్యక్రమం ఏమైనా ప్రారంభమైందా అంటే లేదనే చెప్పాలి. కార్మికులకోసమే 10 లక్షల ఇండ్లు కట్టాలని ప్రభుత్వం ఆలోచిస్తున్నదట. ఇది ఇంకా ఆదశ దాటి బైటపడలేదు.

కార్మికాభ్యున్నతికి దారితీసే రెండుమూడు శాసనాలు ఈసంవత్సరం కేంద్ర శాసనసభ అంగీకరించింది. అవి వచ్చేసంవత్సరం నుంచైనా అమలులోనికి వస్తే, వాటి నిర్వహణ అనుభవాన్ని పురస్కరించుకుని తరువాత పెద్ద కార్యక్రమం ఆరంభించటానికి వీలుపడుతుంది.

ఈ సంవత్సరం కార్మికాభ్యున్నతికి తయారుచేసిన శాసనాలలో ముఖ్యమైనది , కార్మికులకు ప్రభుత్వ భీమా బిల్లు. ఈ బిల్లు ప్రకారం రోగగ్రస్థులైన కార్మికులకు, ప్రమాదములకు గురియైన కార్మికులకు, గర్భిణీస్త్రీ కార్మికులకు కొంతకాలముపాటు ఉచిత వైద్య సౌకర్యము, దినమునకు కొంత భరణము యివ్వటానికి ఒక ప్రత్యేక సంస్థ నేర్పరుస్తారు. ఈ సంస్థ ప్రభుత్వ యాజమాన్యాన నే కార్మికమంత్రి అధ్యక్షతన పనిచేస్తుంది. కార్మికుడు పనిచేసే కాలంలో, కార్మికుడూ యజమాని కూడా ఈ సంస్థకు 'ప్రీమియం' చెల్లిస్తుంటారు. రోజుకు రూపాయికి తక్కువ కూలి సంపాదించే కార్మికుడు ఏమీ చెల్లింపనక్కరలేదు. అతని బదులుకూడా యజమానియే చెల్లిస్తాడు. ఒక కొంతకాలం ప్రీమియంలు చెల్లించినతర్వాత కార్మికుడు జబ్బుపడటం తటస్థిస్తే, అతనికి ఉచిత వైద్యసౌకర్యము, అతనిజీతంలో సగం మొత్తము భరణము—సంవత్సరంలో రెండు నెలలకు మించకుండా—ఈ సంస్థ యిచ్చి,అతడు కోలుకోటానికి తోడ్పడుతుంది, ఏ ఫ్యాక్టరీలోనైనా పనిచేస్తూ, ఏరోజు జీత మారోజే ఖర్చుచేసే కార్మికుడు, ఎప్పుడైనా జబ్బుపడితే అతడి పోషణ భారం కుటుంబీకులపైబడి, అతనికి వైద్యసౌకర్యాలు దొరకక, అకాల మరణాలు, అనవుసర శక్తిహీనత సంభవించి దేశానికి చాల నష్టం కలుగుతున్నది. ఇప్పుడీ బిల్లుప్రకారం ఏ కార్మికుడూ కుటుంబంపై ఆధారపడివుండకుండా, త్వరగా కోలుకొని, తిరిగి యథాశక్తితో పని చేయటానికి అవకాశం ఏర్పడుతుంది. గర్భిణీస్త్రీ కార్మికులకు ప్రసవ సమయంలో మూడునెలలపాటు ఉచిత వైద్యసౌకర్యము, రోజుకు ముప్పావులా భరణము యివ్వటానికి ఈ బిల్లులో ఏర్పాటు చేశారు. ఏదైనా ప్రమాదానికి గురియై, పూర్తిగా, జీవితపర్యంతము పనిచేయు నశక్తుడై పోయిన కార్మికుడికి జీవితాంతంవరకు అతని జీతంలో సగభాగము భరణము, అతడు ప్రమాదంవల్ల మరణిస్తే అతని భార్యకు మరణాంతంగాని, మైనరు పిల్లలకు మైనారిటీ వెళ్ళేవరకు గాని అతడి జీతంలో సగభాగము భరణము యివ్వటానికి కూడా ఈబిల్లులో ఏర్పాటు

చేశారు. అయితే ఈబిల్లు ఫ్యాక్టరీ కార్మికులకు, పెద్ద పెద్ద తోటలలో పనిచేస్తే కార్మికులకు మాత్రమే ప్రస్తుతం వర్తిస్తుంది. వీరిని గురించి కూడా సరైనవివరాలు తెలుసుకుని, పేర్లు నమోదు చేసుకుని పని ప్రారంభించేటప్పటికి ఒక సంవత్సరమైనా పడుతుంది. కార్మికులందరు 'ఉద్యోగసలహా సంఘాల'ద్వారానే ఉద్యోగాలు సంపాదిస్తే, ఆ సంఘాలలో వారిని గురించిన వివరాలన్నీ వుంటవి కాబట్టి పని త్వరలో ప్రారంభమయ్యేది. ఇక ముందుజేరే కార్మికులందరూ ఈ సంఘాల ద్వారానే జేరేటట్లు జేయగలిగితే, వారి విషయంలోనైనా ఈ కార్య క్రమం వెంటనే ప్రారంభించటానికి వీలుంటుంది.

ఫ్యాక్టరీల చట్టానికి, గనులచట్టానికి ఈసంవత్సరం కొన్ని సవరణలు తెచ్చారు. ఫ్యాక్టరీలలో 'కాంటీన్'లు ఏర్పరిచటానికి, కార్మికులకు జీతంమీద శెలవు యివ్వటానికి, బొగ్గు గని కార్మికులకు అదనపు సౌకర్యాలు ఏర్పాటుచేయటానికి ఈసవరణలు తెచ్చారు. బొగ్గు గాని కార్మికుల సౌకర్యాభివృద్ధికి ప్రత్యేకనిధి ఏర్పాటు చేయవలెనని నిశ్చయించారు. ఓడరేవులలో పనిచేసే కార్మికులకు పని నిలకడగా వుండదు. ఒక్కొక్కరోజు పనిలోనికి వెళ్ళినవారు కూడా పనిలేనందున తిరిగి రావలసి వస్తుంటుంది. అందువల్ల అక్కడ పనిలేక, ఇంకొక చిల్లరకూలికి వెళ్ళటానికి వేళమించిపోయి వీరు రెండందాల నష్టపడి, అగోజారు పస్తుండవలసి వస్తుంది. ఓడల రాకపోకలు అనుకున్న కాలమానంప్రకారం జరగకపోవటమే ఇందుకు కారణం. ఓడరేవు కార్మికులకు పని నిలకడగా వుండేటట్లు, కాంట్రాక్టుదారులను, హార్బర్ అధికారులను అజమాయిషీలోకి తెస్తూ ఒక ప్రత్యేక చట్టం కూడా ఈఏడు తయారు చేశారు. ఇవన్నీ చట్టాలుగా తయారైనా, ఫ్యాక్టరీ ఇన్‌స్పెక్టర్లు, కార్మికుల ట్రేడ్‌యూనియన్‌లు కలిసి ఇవి సరిగా అమలు జరిగేటట్లు చేసుకోకపోతే ఫలితం ఏమీ వుండదు.

వ్యవసాయ కార్మికులతో సహా కార్మికులందరికీ వారి వారి జీవన వ్యయాన్నిబట్టి తగినంత 'కనీసజీతం' నిర్ణయించటానికి మధ్య

వ్యర్థుల నేర్పరచి, వారి నిర్ణయాలను ఉభయపక్షాలు ఆమోదించి, అమలు జరిపేటట్లు చేయటానికి ఒక శాసనం ఈఏడు ప్యాసుచేశారు. వ్యవసాయ కూలీలకుకూడా దీనిని ఇప్పుడే అమలు జరపడం చాలకష్టం. ఇందుకు అవుసరమైన అనుభవము, నిజాయతీగల ఉద్యోగులు మన దేశంలో ఇప్పుడు లేరు. ముందు ఫ్యాక్టరీ కార్మికులకు అమలు జరుపుతూ ఆ అనుభవాన్ని పురస్కరించుకుని, ఇతరులకు ఆపద్ధతులలో శిక్షణ యిచ్చి, రెండుమూడేండ్లలలో వ్యవసాయ కూలీలకు కూడా ఈశాసనం అమలు జరుపవచ్చును. కార్మికులు, యజమానులు మధ్యవర్తి పరిష్కర్తలకు ఎంత ఎక్కువ సహకారం చేస్తే, అతడు ఎంత అనుభవము, నిజాయతీగల వాడైతే, ఈ శాసనం అంత జయప్రదంగా, అంత లాభదాయకంగా అమలు జరుగుతుంది.

గత డిశెంబరు నెలలో జరిగిన త్రైపాక్షిక సమావేశంలో (కార్మికులు, యజమానులు, ప్రభుత్వము) కార్మికులకు, ఫ్యాక్టరీ నిర్వహణ, మేనేజిమెంటులో ఎక్కువ ప్రాముఖ్యత యివ్వటానికి ప్రత్యేక సూచనలు చేశారు. ప్రతి ఫ్యాక్టరీలోను ఒక 'వర్క్సు కమిటీని' ఏర్పరచాలి. దీనిలో కార్మికుల ప్రతినిధుల, యజమానుల ప్రతినిధులు కూర్చుని ముఖాముఖిని ఫ్యాక్టరీ నిర్వహణను గూర్చి ఆలోచించి, నిర్ణయాలు చేస్తారు. ప్రతి ఒక పరిశ్రమకు ఒక త్రైపాక్షిక సంఘం, కార్మికుల, యజమానుల, ప్రభుత్వ ప్రతినిధులతో ఏర్పడి, ఆపరిశ్రమకు సంబంధించిన అన్నివిషయాలు చర్చించి, నిర్ణయాలు చేస్తారు. ఇట్లాగే ప్రతిరాష్ట్రానికి, ఒక్కొక్క త్రైపాక్షిక సంఘము, దేశానికంతటికి ఒక్కొక్క త్రైపాక్షిక సంఘము ఏర్పాటు చేస్తారు. ఫ్యాక్టరీలలో 'వర్క్సు కమిటీ' లను ఏర్పాటుచేయటం ఇప్పుడే ప్రారంభించారు. తోటపని కార్మికుల త్రైపాక్షిక సంఘము గత ఏప్రిల్ నెలలో సమావేశమై, దేశమంతటా తోటపని కార్మికులకు సంవత్సరానికి 5 కోట్ల రూపాయలు జీతాలు హెచ్చించటానికి నిశ్చయించారు. ఈవిధంగా కార్మికులకు కూడా ఫ్యాక్టరీ నిర్వహణలోను, పరిశ్రమల సమస్యల

చర్చలలోను పాలు యివ్వటంవలన, వారి హోదా వృద్ధిపొందటమే గాక, తాము పనిచేస్తున్న ఫ్యాక్టరీ, పరిశ్రమల సమస్యలను, కష్టాలను, బాధ్యతలను, లాభాలను సరిగా అవగాహన చేసుకుని, సంతృప్తితో, సంతోషంతో పనిచేస్తూ దేశంలో వస్తూత్పత్తి అధికంచేయగల్గుతారు. పెట్టుబడిపైన లాభాలు ఒక నిర్ణీత మొత్తం పెంచిపెట్టినతర్వాత, మిగిలిన లాభం కార్మికులు, యజమానులు పంచుకోవాలని కూడా డిశెంబరు సమావేశంలో సూచింపబడింది. ఎక్కువగాను, బాగాను పనిచేసి, అధికోత్పత్తిచేసి, ఎక్కువ లాభాలు గడించటానికి తోడ్పడితే, ఆలాభంలో పాలు కార్మికులకు కూడా యివ్వటం సమంజసమే. ఇందుకు యజమానులు ఒప్పుకోరు. ఏయేపద్ధతులపై, ఏవిధంగా ఈ సూత్రన్ని అమలు జరుపాలో సూచించటానికి ఏర్పరచిన ప్రత్యేక సంఘం ఈమధ్యనే తన నివేదిక సమర్పించింది. దీనిని అమలు జరపటానికి యజమానులు అనేక ఆటంకాలు, ఇబ్బందులున్నవని సాకు చెపుతున్నారు. ఇతర దేశాలలో ఈవిధానం జయప్రదంగా అమలు జరగటంలేదని కూడా వీరు చెపుతున్నారు. ఈసూత్రాన్ని అమలు జరిపి చూసి, జయప్రదం కాకపోతే అప్పుడే మానివేయవచ్చును కాని ఇప్పుడు ఉపసంహరించ కూడదు.

భారతదేశ పారిశ్రామిక రంగంలో గత సంవత్సరంసమ్మెలు అతి తరచు అయినాయి. 1945 వ సం. కన్న సమ్మెలు ఈ సంవత్సరం దాదాపు నాలుగురెట్లు పెరిగాయి. 1947 వ సం.లో నవంబరు నెల వరకు 1,53,00,000 మనిషి—రోజులు పని నష్టమైపోయింది. ఫ్యాకరీలు మూసివేసివేయటం వలన సంభవించే నష్టాన్ని కార్మికులు, యజమానులే గాక, వస్తువులకొరత ఏర్పడి, తద్వారా ప్రజానీకంకూడా అనుభవిస్తుంది. అసలే అన్ని పరిశ్రమలలోను ఉత్పత్తి తక్కువగా వున్న మనదేశంలో జరిగే ప్రతి సమ్మె మన ప్రజల కష్టాలను ఇనుమడింపజేస్తానికే ఉపయోగపడుతుంది. జరిగిన సమ్మెలన్నీ సమంజసమని గాని, అసమంజసమని ఒక్కమాటతో త్రోసివేయటానికి వీలులేదు కాని గత సంవత్సరం జరిగిన

సమ్మెలలో అధికభాగము వర్గవిభేధాలు, బలాబలాల పరీక్షకోసము జరిగాయని చెప్పక తప్పదు. భారత ట్రేడ్‌యూనియన్ ఉద్యమం, దురదృష్టవశాత్తు, చాల ప్రమాద పరిస్థితిలోనికి వచ్చింది. కార్మికులపై నాయకత్వానికి రాజకీయపక్షాలన్నీ తీవ్రంగా కృషిచేస్తున్నాయి. యుద్ధానికిపూర్వం భారత ట్రేడ్‌యూనియన్ ఉద్యమం అఖిలభారత ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ ఆధ్వర్యాన నడుస్తుండేది. యుద్ధకాలంలో కాంగ్రెస్, సోషలిస్టు నాయకులు జైళ్ళలో నున్నప్పుడు అది కమ్యూనిస్టుల చేతులలోనికి పోయింది. ఇదే కాలంలో ప్రభుత్వ ప్రాపకం కోసం యం. యన్. రాయ్ ఇండియన్ లేబర్ ఫెడరేషన్ అని ఒక సంస్థను స్థాపించి, కార్మికులలో కొంతవరకు విభేధాలు తెచ్చాడు. యుద్ధానంతరం అన్ని రాష్ట్రాలలోను కాంగ్రెస్ మంత్రివర్గాలు అధికారంలోనికి రావటంతో, వాటిని ఇబ్బంది పెట్టటానికి తమ చేతులో నున్న ట్రేడ్‌యూనియన్ అస్త్రాన్ని ఉపయోగించి, సమ్మెలను ప్రోత్సహించారు కమ్యూనిస్టులు. వీరి ఆశయం ఏమాత్రం ఈడేరకపోయినా, కార్మిక నాయకత్వం వీరి చేతులలోనుండి లాక్కొనటానికి కాంగ్రెస్ వాదులు వేరొక ట్రేడ్‌యూనియన్ సంస్థను స్థాపించుకుని, కార్మికోద్యమాన్ని మరీముక్కలు చేసివేయటానికి ఈ సంఘటన కారణమైంది. అఖిలభారత జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ అంటూ కాంగ్రెస్ వాదులు ఒకసంస్థ నేర్పరచి, దానికి బలం చేకూర్చుకుంటున్నారు. ఈ మధ్య జరిగిన అంతర్జాతీయ కార్మిక సమావేశానికి, భారత కార్మికుల ప్రతినిధిగా ఈ సంస్థనే ప్రభుత్వం గుర్తించి, పంపించింది. ఇది ఇతరవర్గాలకు కష్టంకలిగించినా, ఈ నాడు ఈ సంస్థకే ఎక్కువబలం వున్నదనటం నిస్సందేహం. సోషలిస్టులు కాంగ్రెస్‌నుండి విడిపోయిన తర్వాత, తమ అధ్వర్యాన పనిచేసే కార్మిక సంస్థను ఏర్పరచాలని ప్రయత్నిస్తున్నారు. బొంబాయి మొదలైన పట్టణాలలో కార్మికులలో వీరికి పలుకుబడి వున్నసంగతి వాస్తవమే. ఇప్పుడు భారత కార్మికోద్యమం నాలుగు విభాగాలుగా పనిచేస్తూ, ఒకదానిని పడగొట్టి ఒకటి బలిష్టం

కావాలని ప్రయత్నిస్తున్న గందరగోళంలో వున్నది. యం. యన్. రాయ్ సంస్థ బ్రిటిష్‌వారితోనే పోయింది. కమ్యూనిస్టులు దౌర్జన్య వాదం ప్రారంభించిన తర్వాత అఖిలభారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ పలుకుబడి తగ్గిపోయి, జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ బలపడినది. ఇకముందు సంఘర్షణ దీనికీ, సోషలిస్టులకూ జరుగనున్నది. ఇది ఎట్లావున్నా, బలాబలాలు నిర్ణయించుకోవటం కొరకు, ఎవరికి బల మున్నచోట వారు సమ్మెలు విరివిగా జరిపారు. ఢిల్లీలో త్రైపాక్షిక సమావేశంలో మూడేండ్లపాటు సమ్మెలు జరుపరాదని నిర్ణయించగానే ఇతర కారణాలేవిచెప్పినా, దానికి అసమ్మతి సూచకంగా బొంబాయిలో సోషలిస్టులు, కలకత్తాలో కమ్యూనిస్టులు సమ్మెలు జరిపారు. అప్పటి నుంచి సమ్మెలు తగ్గిపోవటానికి బదులు చాలా హెచ్చిపోయి, ఉత్పత్తికి చాల ఆటంకం కలిగిస్తున్నాయి.

అంతర్జాతీయ కార్మికసంస్థ ఆశియాప్రాంత రాజ్యాలసభ మొట్ట మొదటిసారిగా ఈ సంవత్సరమే ప్రత్యేకసమావేశం జరిపింది. ఆ సభ గత నవంబరు నెలలో మనదేశంలోనే జరిగింది. దీనికి అన్ని రాజ్యాల నుండి కార్మికుల, యజమానుల, ప్రాంతీయప్రభుత్వ ప్రతినిధులు హాజరై, ప్రాంతీయ సమస్యలనుగూర్చి ఆలోచించారు. వ్యవసాయకూలీల సమస్య లను ప్రముఖంగా చర్చించటానికి కొన్ని పరిశీలక సంఘాలు ఏర్పరచి, ఆశియా రాజ్యాలలో పనిచేయించి, ఈ రాజ్యాలకు సలహా లివ్వవలసిం దని అంతర్జాతీయ కార్మిక సంస్థకు వీరు సిఫార్సుచేశారు. పరిశ్రమల నిర్వాహణ, లాభాలలో కార్మికులకుకూడా భాగం యిచ్చి, అధికో త్పత్తికి వారిని ప్రోత్సహించవలసిందనీ, త్రైపాక్షిక సమావేశాలు, సంఘాలు ఏర్పాటు చేయవలసిందనీ అన్ని రాజ్యాలకు సిఫార్సులుచేశారు. ఈ సంస్థ వచ్చేసంవత్సరం చైనాలో సమావేశమౌతుంది.

భారత ట్రేడ్ యూనియన్ ఉద్యమం సరియైన స్థాయిలోనికి రావటానికి కార్మికులకు విద్య అవుసరము. కార్మికసంఘాలు, ప్రభు త్వముకూడా కార్మికులలో విద్యావ్యాప్తికి కృషిచేయాలి. ఇందుకు

ప్రయత్నాలేమీ ఈ సంవత్సరం జరగనేలేదు. కార్మికుడు నిరక్షరాస్యుడు, అజ్ఞానుడు అయివున్నంతకాలం అతనిని మోసపుచ్చటం యజమానుల కెట్లో కమ్యూనిస్టులకు అట్లాగే తేలికపని. తన స్థితి ఏమిటో, తన లక్ష్యమేమిటో; తన పురోగమనము ఏ పద్ధతిన జరగాలో చక్కగా ఆలోచించుకుని, కార్మికుడు వ్యవహరించ గల్గినప్పుడే మనదేశంలో సోషలిస్టు వ్యవస్థను స్థాపించటం సాధ్యపడుతుంది.

భారతప్రభుత్వ కార్మిక విధానము, ముఖ్యముగా సామాజిక న్యాయ కార్యక్రమ విషయంలో, సక్రమ పంథాలో నడుస్తున్నది. మొదట్లో అది మందంగా సాగటం సహజమే. పునాది గట్టిగా వేస్తే, దానిపైన కట్టడం అటుతర్వాత త్వరత్వరగా నిర్మించినా, ఆ వ్యవస్థ కూలిపోకుండా నిలువగల్గుతుంది. మన కార్మిక విధానానికి సరియైన పునాది పడుతున్నదని నిస్సంశయంగా చెప్పవచ్చును.



# ఆహార విధానము

ప్రజలందరికి, సరసమైన ధరకు ఆహారపదార్థాలు, ఇతర జీవితావసర వస్తువులు సమకూర్చటం తమ విధిగా అన్నిదేశాల ప్రభుత్వాలు ఇప్పుడుభావిస్తున్నవి. నాలుగైదేండ్ల క్రిందటి వరకు మనదేశంలో ఆహారం ఒక్క సమస్య కానేకాదు. జపాన్ యుద్ధంలో ప్రవేశించి, మిత్రరాజ్యాల సైనికులకు మనం ఆహారం సప్లయి చేయవలసి వచ్చినప్పటినుంచి ఆహారం మనదేశంలోకూడా ఒక సమస్యగా పరిణమించింది. యుద్ధం ముగిసి, జపాన్ ఆక్రమితదేశాలనుండి దిగుమతులు ప్రారంభమై, మిత్రరాజ్యాల సైనికులకు సప్లయి మానివేసినాకూడా ఆహారసమస్య పరిష్కారమవక పోవటమేగాక ఆనాటి కానాడు మరీ తీవ్రమైపోతున్నది. స్వతంత్ర భారతప్రజాప్రభుత్వం ఏర్పడే నాటికే కేంద్రంలోను, అన్నిరాష్ట్రాల లోను ఆహారశాఖలను ఏర్పరచి, దేశమంతటా ధాన్యాదుల ధరలపైనను, ఇతర జీవితావసర వస్తువుల ధరలపైనను కంట్రోల్, రేషనింగ్ అమలు జరుపుతున్నారు.

ఆహారం విషయంలో స్వతంత్రభారతప్రభుత్వం అతిక్లిష్ట సమస్యలకు వారసయినది. ఆగస్టు, సెప్టెంబరు నెలల కల్లోలం కొంచెం సర్దుకున్న తర్వాత ఆహారవ్యవహారాలు పరిశీలించగా పరిస్థితి అతి అధ్వాన్నంగా వున్నట్లు స్పష్టపడింది. "మనదేశ ఆహారపరిస్థితి ఆందోళన జనకంగా వున్నది. మనం అతి కష్టకాలాన్నెదురుకుంటున్నాము. కొన్నివారాలలో కొత్తపంట కోతకు రానున్నదనే దొక్కటే ఇప్పుడు కనిపిస్తున్న సుగుణం. నవంబరు నెలారంభానికి అనేక రాష్ట్రాలలో ఒక నెలకు సరిపోయే సరుకుకూడా నిలువవుండదు. నవంబరు నెలారంభం కాక పూర్వమే కొన్నిప్రాంతాలలో రేషనింగ్ భగ్నంకావచ్చును. అంటే రేషన్ కార్డుపైన ఇవ్వవలసిన ధాన్యం అప్పుడప్పుడు కొన్నిరోజులవరకు దొరకకపోవచ్చును. అయినా మనం గట్టెక్కుతామనే నా ఆశ" అని

అప్పుడు ఆహారమంత్రిగా వున్న డా. రాజేంద్రప్రసాద్ అక్టోబరు నెలారంభంలో ప్రకటించారు. దేశంలో సగానికిపైగా జనాభా రేషనింగ్ పై ఆధారపడివున్నారు. 6 కోట్లమంది స్టాట్యుటరీ రేషనింగ్ ప్రాంతాలలోను, 10 కోట్లమంది ఇన్‌ఫార్మల్ రేషనింగ్ ప్రాంతాలలోను వున్నారు. రేషన్‌లో ఆహారపదార్థము సగటున, వ్యక్తికి, రోజుకు, 10 ఔన్సుల చొప్పున ఇస్తున్నారు. మనిషి ఆరోగ్యంగా జీవించటానికి ఈ రేషన్ ఏమాత్రము చాలదు. నవంబరు నెలారంభానికి మద్రాసు, బొంబాయి, మైసూర్, పశ్చిమబెంగాల్ రాష్ట్రాలలో రెండు వారాలకు కూడా సరిపోని నిలువలేవుంటాయి. ఈలోపుగానే విదేశాలనుండి దిగుమతులు ఎక్కువచేయటానికి, దేశంలో సేకరణ ఎక్కువగా జరపటానికి అన్నిరాష్ట్ర ప్రభుత్వాలు కృషిచేస్తున్నవి, అని కూడా ఆయన చెప్పాడు. అదృష్టవశాత్తు, దేశంలో సేకరణ, విదేశాలనుండి దిగుమతులు బాగానే జరిగి, ఎక్కడా రేషనింగ్ భగ్నంకాకుండా, నవంబరు నెల కూడా గడిచి, కొత్తపంట కోతకువచ్చింది. క్షామం వస్తుందనే భయం ఆ సంవత్సరానికి తీరిపోయింది. మనదేశంలో ఆహారధాన్యాలు సంవత్సరానికి 55 లక్షల టన్నులు పండుతవనీ, వానిలో 5½ లక్షల టన్నులు సేకరణ జరుగుననీ, దాదాపు 20 లక్షల టన్నులు దిగుమతి చేసుకోవాలనీ అంచనావేశారు. 1947 వ సం॥ సెప్టెంబరు నెలాఖరుకే దాదాపు 16 లక్షల టన్నులు దిగుమతి జరిగెను.

ఆహారపదార్థాల, ఇతర జీవితావసర వస్తువుల ధరలు, పంపకముపై వున్న కంట్రోల్ లోపభూయిష్టంగా అమలుజరుగుతూ, దేశంలో అవినీతి, అసంతృప్తి, కృత్రిమకరువులకు దారితీస్తున్నదని ఆదినుండి విమర్శ వుండనేవున్నది. కంట్రోల్ విధానము సరిగా అమలు జరుగక పోవుటకు వ్యాపారస్థులు, ఉద్యోగులు బాధ్యులు. వీరి అవినీతి వల్లనే బ్లాక్‌మార్కెటింగ్ జరుగుటకు వీలున్నది. బ్లాక్‌మార్కెట్‌లో వస్తువులు కొనే ప్రతివ్యక్తి దాని వ్యాప్తికి కారణభూతుడైనా, బాధపడుతూ, విధిలేక దానికి లోబడే వానిని నిందించటం అనవుసరం.

బ్లాక్ మార్కెట్ కు కారకులైన వ్యాపారస్థులు, పెట్టుబడిదారులే కంట్రోల్ తొలగించవలెనని పెద్దపెట్టున ఆందోళన జేసేవారు. వస్తువులన్నీ కొరతగావున్నప్పుడు తమ యిష్టంవచ్చిన ధరలకు అమ్మి, లాభం చేకూర్చుకోకుండా కంట్రోల్ అంటూ ఒకటిపెట్టటం వారికెట్లా నచ్చుతుంది? ఆశ్చర్యమేమంటే ఈ పెట్టుబడిదారులు కేంద్రప్రభుత్వాన్నే తమవలలో జిక్కించుకోవటమేగాకుండా, గాంధీమహాత్ముని కూడా వశపరచుకుని, కంట్రోల్ తొలగిస్తే ప్రభుత్వానికి ప్రజలకుకూడా ఏదో పెద్దమేలు జరుగుతుందని నచ్చజెప్పగలిగారు.

కంట్రోల్ చేసిన వస్తువుల కంట్రోల్ ధరలను నిర్ణయించటానికి వస్తువుల ధరల నిర్ణాయకసంఘాన్ని 1947 వ సం. మార్చి నెలలో ప్రభుత్వం ఏర్పరచి ముగ్గురుసభ్యులస్థానే ఇద్దరినిమాత్రమే నియమించింది. అన్నివస్తువులకు వీరు నిర్ణయిస్తున్నధరలు ఏమాత్రం గిట్టుబాటు కావటం లేదని కేంద్రప్రభుత్వంలో పలుకుబడి, ప్రాపకమువున్న పెట్టుబడిదారులు ఆందోళన ప్రారంభించారు. దానితో ఈ సంఘ కార్యకలాపము పట్ల ప్రభుత్వానికి అశ్రద్ధ జనించగా వారు విసుగుచెంది, అక్టోబరు నెలలో తమ సభ్యత్వాలకు రాజీనామా నిచ్చారు. ఒక చక్కని సంస్థ ఈవిధంగా నాశనమైపోయింది.

వస్తువులకొరతకు, బ్లాక్ మార్కెటింగ్ వ్యాప్తికి పెట్టుబడిదారులు చెప్పే సాకు ధరలు గిట్టుబాటుకావటం లేదనటమే. పారిశ్రామికులకుగాని, ముడిపదార్థాల ఉత్పత్తిదారులకుగాని కొంచెం ఎక్కువ జీతాలు, ధరలు యివ్వవలసివస్తే, ధరలు పెరగాలని, కంట్రోల్ ధరలు తమకు గిట్టుబాటుగాక వ్యాపారాన్ని నాశనం చేస్తున్నవని వారు ఆందోళన చేసేవారు. పంచదారధరపై కంట్రోల్ పెట్టినప్పటినుండి చెరుకు ఉత్పత్తిదారులకు అతితక్కువధర యిస్తుండేవారు. బీహార్, యు. పి. లలో కొన్నిజిల్లాలలో చెరుకు ఫ్యాక్టరీకి అమ్మేధరకంటే గడ్డిధర ఎక్కువవటంవలన పశువులకు చెరుకునే మేపుకునేవారు! పంచదార కంట్రోల్ ధర పెంచకపోతే చెరుకుపంట తక్కువైపోయి, ఫ్యాక్టరీలకు

పనిలేక పరిశ్రమకంతకూ మోసంవస్తుందని వ్యాపారస్థులు, పెట్టుబడి దార్లు ఆందోళనజేశారు. పంచదార కంట్రోల్ ధర నూటికి 25 వంతులు పెంచటానికి అంగీకరిస్తే, ఆ మొత్తమంతా కార్మికులకు అదనపుజీతా లుగా యివ్వటానికి వారే నిశ్చయించుకున్నారు. మరి చేరుకుపంట దారులకు అధికధరలు ఎట్లా యిస్తారు? దేశక్షేమంకోసం రైతునష్ట పడుతూనైనా పండించాలిసిందేననేగాని తమ లాభాలు కొంచెం తగ్గించుకునైనా రైతుకు సరసమైన ధరయివ్వాలనేవిషయం వీరి బుర్రకు ఎక్కనే ఎక్కదు.

దేశంలో ఆహారపరిస్థితి, ఇతరజీవితావుసరాల వస్తువుల పరిస్థితి క్లిష్టమై, భారంగా కనిపించటంతో రానున్న సంవత్సరంలో, ముఖ్యంగా ఆహారవిషయంలో, ఎటువంటివిధానం అనుసరించాలో సూచించటానికి కేంద్రప్రభుత్వం 'ఆహారధాన్యాల సలహాసంఘం' ఏర్పాటుచేసింది. ఈ సంఘుఅధ్యక్షుడు భారతపారిశ్రామికవేత్తలనాయకుడైన సర్ పురు షోత్తమదాస్ ఠాకూర్‌దాస్. ప్రభుత్వం పెట్టుబడిదారుల వాంఛలను కాదనలేక పోతున్నదని ఈయన నియామకం జరిగినప్పుడే తేలిపోయింది.

కంట్రోల్‌వల్ల ఉత్పత్తిదారులకు ప్రోత్సాహము వుండటంలేదని, బ్లాక్‌మార్కెటింగ్, అవినీతి, లంచగొండితనం వ్యాపించిపోతున్నదని కంట్రోల్ అమలుజరుపుతున్న సిబ్బందికి చాల ఎక్కువ మొత్తము ఖర్చగుచున్నది కాబట్టి కంట్రోల్ ఎత్తివేసి వారి నింకొకపనికి వినియోగించుకోవచ్చనీ, ఆహారధాన్యాల దిగుమతులు, సబ్సిడీలు కేంద్ర ప్రభుత్వానికి చాల వ్యయకరంగా వున్నవి కాబట్టి కంట్రోల్ తొల గించి, ఆధనాన్ని ఇతరత్రా సద్వినియోగంచేయటం మంచిదని కంట్రోల్ తొలగించాలనే వారు వాదిస్తారు. గాంధీమహాత్ముడు కంట్రోల్స్‌పై దాదాపు యుద్ధంప్రకటించి, కంట్రోల్ తొలగించవలెనని తన ప్రార్థనసభలలో ప్రచారం ప్రారంభించాడు. కంట్రోల్స్ అసం తృప్తిగా అమలుజరిగి, దేశంలో అసంతృప్తి, ప్రభుత్వానికి అప్రతిష్ట తెస్తున్నది. కాబట్టి వాటిని తొలగిస్తేనే మంచిదని కేంద్రప్రభుత్వం

కూడా భావించింది. ఒక్కమారుగా కంట్రోల్ తొలగించటం అతి ప్రమాద భూయిష్టమైనపని. ప్రజలకు కావలసిన ఆహారం, ఇతర ముఖ్య పదార్థాలు సరిగా సరసమైన ధరలకు దొరకకపోతే ప్రభుత్వంపట్ల అసంతృప్తికలిగి విప్లవం రావచ్చును. కంట్రోల్ తొలగించటంవలన ఇప్పటివరకు దొంగచాటుగా వున్న సరుకంతా మార్కెట్‌లోనికివచ్చి ధరలు తగ్గుతవని ఆశిస్తున్నారుగాని ఒకవేళ ఇప్పుడు మార్కెట్‌లో వున్న నిలువలుకూడా దాచివేయబడి, బ్లాక్‌మార్కెట్ ధరకన్న ఎక్కువ ధరకు అమ్మబడవని హామీ ఏమున్నది? దేశంలో సోషలిస్టు ఆర్థిక వ్యవస్థ స్థాపించాలనుకుంటున్నప్పుడు అన్నిపరిశ్రమలను ఒక ప్లాను ప్రకారం అదుపులోపెట్టి నిర్వహించటానికి బదులు ఇప్పుడున్న కంట్రోల్ తొలగించటం ఎందుకు? కంట్రోల్ తొలగించాలని ఆలోచిస్తున్నప్పుడు అనేకరాష్ట్రాలలో రెండువారాలకుకూడా సరిపోని సరుకుమాత్రమే నిలువవుంది. పరిస్థితి ఇంతవిషమంగా వున్నప్పుడు లాభాలను దోచుకోటానికి అలవాటుపడ్డ వ్యాపారస్థులను నమ్మి కంట్రోల్ తొలగించటం ప్రమాదాన్ని ఆహ్వానించటమే అవుతుంది. ఆహారకంట్రోల్స్ అమలుజరుపుతున్న ఉద్యోగులు అవినీతిపరులైతే వారిని తొలగించాలిగాని ఇతరశాఖలకు పంపి అక్కడకుకూడా అవినీతిని వ్యాప్తంచెయ్యటం ఎందుకు? కంట్రోల్ తొలగించరాదనువారు ఈవిధంగా వాదించారు. వీరివాదనే సక్రమమైనదని తరువాత సంఘటనలు రుజువుచేశాయి.

వస్తువుల ధరల నిర్ణాయక సంఘంమాత్రం కంట్రోల్ తొలగించకూడదనీ, పైగా కంట్రోల్స్ అన్నిటిని సమన్వయపరచి, ఏకముఖంగా, సక్రమంగా అమలు జరిపించాలని సిఫార్సు చేసింది. ఆహారము, బట్ట మొదలైన వస్తువుల ఉత్పత్తి కంట్రోల్ తొలగించినా ఇప్పుడు పెరగదనీ, ధరలు పెరిగిపోవటంమాత్రం జరుగుతుందనీ వీరు సూచించారు. బొగ్గు, ఇనుము, ఉక్కుసామాను, సిమెంటు, నూనెలు, వంటచెరుకు మొదలైనవి 1950 వ సం. వరకు కరువుగానే వుంటవనీ, ఇప్పుడున్న

కంట్రోల్స్ గ్రామీణులకుగాక బస్తీలలో వారికే ఉపయోగిస్తున్నవి కాబట్టే పల్లెల ప్రజలకు కూడా వర్తింపజేయాలనీ, కంట్రోల్ తొలగిస్తే మధ్యతరగతి ప్రజల జీవనవ్యయం పెరిగిపోతుందనీ వీరు స్పష్టపరిచారు. కాని ఈ సంఘం సూచనలను ప్రభుత్వం, పెట్టుబడిదార్ల మాటలకు మోసపోయి, మన్నించలేదు.

పురుషోత్తమదాస్ ఠాకూర్‌దాస్ అధ్యక్షతన ఏర్పరచిన 'ఆహార ధాన్యాల సలహా సంఘం' సూచించిన క్రొత్త విధానాన్ననుసరించి, క్రమేణా కంట్రోల్స్ తొలగించటానికి ప్రభుత్వం నిశ్చయించింది. నవంబరు 5,6 తేదీలలో జరిగిన రాష్ట్ర ఆహారమంత్రుల సభలో చాల రాష్ట్రాల మంత్రులు కంట్రోల్ తొలగించవద్దని సలహా యిచ్చారు. కంట్రోల్స్‌ను ప్రత్యక్షంగా అమలు జర్పుతున్న వీరి సలహాను కూడా ప్రభుత్వం మన్నించలేదు. క్రమేణా కంట్రోల్స్ తొలగించి, రేషనింగ్ బాధ్యత తగ్గించుకోవటమే నూతన ఆహారవిధానం. 1948 వ సం. లో ఆహారపదార్థాల దిగుమతులు కూడ ప్రభుత్వ ఖాతాపైననే జరుగును. కేంద్రప్రభుత్వం 5 లక్షలటన్నుల ఆహారధాన్యం నిలువచేస్తుంది. రాష్ట్రాలకు ఆహారపదార్థాల ఉత్పత్తి, ఖర్చులనుబట్టి 'మిగులు', 'తరుగు' రాష్ట్రాలుగా విభజించి, ఏయే 'మిగులు, రాష్ట్రం ఎంత మొత్తం కేంద్ర ప్రభుత్వానికి వప్పజెప్పవలసిరది, ఏయే 'తరుగు' రాష్ట్రానికి ఎంత మొత్తం ధాన్యం యిచ్చేది నిర్ణయించి, ఆ మొత్తాలతో సరిపెట్టుకోటానికి ప్రయత్నించవలసిందని అన్ని రాష్ట్రాలకు ఆదేశమిచ్చారు. ఆహారధాన్యాల ధరలు పెంచటానికి రాష్ట్రప్రభుత్వాలకు హక్కు యిచ్చారు. బియ్యము, గోధుమ, జొన్న, బజ్రాధాన్యాలు ప్రభుత్వమే సేకరించి, వ్యాపారస్థులద్వారా పంపకం జరుపుతుంది. రాష్ట్రాలమధ్య రవాణా నిషేధాలు తొలగించరు. ఈ మూలసూత్రాలను ఆధారంగా తీసుకుని రాష్ట్రాలు తమ తమ విధానాలను వివరంగా తయారుచేసి, డిశెంబరు 10 వ తేదీలోగా ప్రకటించాలి. కంట్రోల్ రద్దు విధానం సక్రమంగా అమలు జరగక, ప్రమాదం తటస్థిస్తే, కంట్రోల్ తిరిగి

తీవ్రతరంగా ప్రవేశపెడతారు. ఇది సంక్షిప్తంగా భారతప్రభుత్వ కంట్రోల్ విధానం. ఈ నూతనవిధానం ప్రకారం ముందు పంచదారపై కంట్రోల్‌ను తొలగించారు. వెంటనే పంచదార ధర మణుగు రూ. 21 నుండి రూ 35 కు పెరిగింది. ఒక్క యు. పి. బీహార్ రాష్ట్రాలే తమవద్దనున్న నిలువలపైననే రూ. 22 కోట్లు లాభం పొందాయి. పంచదార మిల్లులలోవున్న నిలువలన్నీ వశపరచుకుని, రాజీచేసుకుని యు. పి. ప్రభుత్వం ఈలాభంలో కొంత భాగంకూడా పంచుకున్నది. కంట్రోల్ తొలగించక పూర్వంనుంచి ధర కొంచెం పెంచవలెనను కుంటున్నారు గాని ఇంతగా పెరుగుతుందని ఎవ్వరూ భావించలేదు. ఇప్పటి మార్కెట్ ధరకన్న, ఇదివరకటి బ్లాక్‌మార్కెట్ ధర కొంచెం తక్కువేనని కూడా చాలమంది విమర్శించారు. అయినా, ధరను తగ్గించటానికి వ్యాపారస్థులు గాని, ప్రభుత్వంగాని ఎట్టి చర్య జరుపలేదు.

కేంద్రప్రభుత్వ కంట్రోల్ రద్దు విధానం ప్రకటించగానే అన్ని రాష్ట్రాలలోను బట్టల ధరల కంట్రోలు, రేషనింగ్ తొలగించారు. అన్నిరకాల బట్టల ధరలు రెట్టింపుకన్న ఎక్కువగా పెరిగాయి. అన్ని రాష్ట్రాలలోను ఆహారధాన్యాల ధరలు మణుగుకు ఒకటినుండి రెండు రూపాయలవరకు పెంచారు. ఇన్ఫార్మల్ రేషనింగ్, పల్లెటూళ్ళలోను, మిగులు జిల్లాలలోను రేషనింగ్ తొలగించారు. సేకరణమాత్రం ప్రభుత్వమే జరపటానికి అన్నిరాష్ట్రాలలోను నిర్ణయాలు జరిగాయి. ఆహార ధాన్యాల ధరలు ప్రతిచోట పెరిగిపోతూయి. క్రొత్తపంట ధాన్యం అయిపోయి, వేసవికాలం ముదిరినకొద్దీ ధరలు మరీ పెరగటం ప్రారంభించాయి. కంట్రోల్ తొలగించిన తర్వాత వస్తువుల, ఆహారధాన్యాల ధరలు విపరీతంగా పెరిగిపోకుండా కాపాడుతాయని గాంధీజీకి, ప్రభుత్వానికి నచ్చజెప్పిన వ్యాపారస్థులు, పెట్టుబడిదారులు, ప్రభుత్వాన్ని, ప్రజలను మోసం చేశారు. ధరలను వారు విపరీతంగా పెంచివేశారని ప్రభుత్వం గుర్తించింది కాని ఏమీ చేయలేక తిరిగి కంట్రోల్ పెట్టటం ఇష్టంలేక వూరుకున్నది.

గత మార్చి నెలలో అధినివేశ శాసనసభలో బడ్జెట్ చర్చలలో మాట్లాడుతూ ఆహారశాఖమంత్రి జైరాందాస్ దౌలత్ రామ్ దేశ ఆహార పరిస్థితిని సమీక్షించాడు. చాల రాష్ట్రాలలో ఈ సంవత్సరం పంట బాగా పండి, ఆ ఆహారపరిస్థితి సంతృప్తికరంగా వున్నది. మిగులు రాష్ట్రాలైన ఒరిస్సా, సి. పి., లు తమకు నిర్ణయించబడిన కోటాకన్న దాదాపు 2 లక్షల టన్నులు ఎక్కువ ధాన్యం సప్లయిచేస్తామంటున్నవి. కొరత రాష్ట్రాలనుకున్న యు. పి., తూర్పుపంజాబ్, అస్సాంలు 'మిగులు' రాష్ట్రాలైనవి. ఒక్క మద్రాసురాష్ట్రంలోనే పంటలు బాగా చెడిపోయి, మొదట్లో నిర్ణయించిన కోటాను 4, 5 రెట్లు పెంచవలసివచ్చింది. ఈ సంవత్సరారంభంలో దేశమంతట ఆహారధాన్యాలు 5.4 లక్షల టన్నులు నిలువవుండెను. దేశంలో సేకరణద్వారా 4 లక్షల టన్నులు, దిగుమతులద్వారా 20 లక్షల టన్నులు సంపాదించి, తరుగు రాష్ట్రాలకు 22 లక్షల టన్నులు సప్లయిచేసి, చివరకు నిలువ 5.4 లక్షల టన్నులు వుంచవలెనని అంచనావేశారు. మద్రాసుకు పంపవలసివచ్చిన అదనపు సరుకు, ఇతరరాష్ట్రాలలో ఎక్కువ మిగిలినదానికి సరిపోతుంది. కాబట్టి మొత్తంమీద సంతృప్తికరంగానే వున్నదని ఆయన ప్రకటించాడు. ఆహారధాన్యాల ధరలు పెరగటంతప్ప వేరే కొరత ఏమీ ఇంతవరకు ఎక్కడా ఏర్పడలేదు. మద్రాసులోకూడా, మనం అడిగినంత ధాన్యం కేంద్రప్రభుత్వం సప్లయిచేస్తుంటే భయపడనక్కరలేదని మంత్రి ఈ మధ్యనే చెప్పాడు. ధాన్యాల ధరలు మాత్రం చాల విపరీతంగా పెరిగాయి. బియ్యం మణుగు బొంబాయిరాష్ట్రంలో రూ. 30-40; మద్రాసురాష్ట్రంలో రూ. 20-30; పశ్చిమ బెంగాల్‌లో రూ, 14-22; ఒరిస్సాలో రూ. 9-8-0—13-8-0 వరకు అమ్ముతున్నవి. ఇట్లాగే ఇతర ధాన్యాల ధరలుకూడా ఒకరాష్ట్రాని కొకదానితో సంబంధం లేకుండా వున్నవి. ఈ మేనెల మూడవ వారాంతంలో వివిధరాష్ట్రాలలోను 10 లక్షల 30 వేల టన్నుల ధాన్యం నిలువవున్నది. ఇంకా దేశంలో సేకరణ, విదేశాలనుండి దిగుమతులు జరుగుతున్నవి. కాబట్టి ఈ సంవత్సరం భయంలేకుండానే గడిచిపోతుంది.

గుడ్డల ధరలు కంట్రోల్ తొలగించినతర్వాత మితిమీరి పెరిగి పోయాయి. ఎన్నోవిధాల ప్రయత్నించిన తర్వాత, ప్రభుత్వం తిరిగి కంట్రోల్ అమలుజరపటానికి ఈ మధ్యనే నిర్ణయించింది. ఈ పర్యాయం పంపకం రాష్ట్రప్రభుత్వము, సహకారసంఘాలు ఎక్కువగా జరుపుతవి. బట్టల ఉత్పత్తి, రాష్ట్రాలకు పంపకము కేంద్రప్రభుత్వం నిర్వహిస్తుంది.

ఆహారసమస్య శాశ్వత పరిష్కారానికి అధికోత్పత్తి ఒక్కటే మార్గము. గత నాలుగైదు సంవత్సరాలనుంచి అధికాహారోత్పత్తికి మనదేశంలో జరుగుతున్న కృషి ఏమీ ఫలించలేదు. భారతదేశం స్వతంత్ర్యమైన తర్వాత వ్యవసాయం సర్వతోముఖంగా అభివృద్ధిపరచి, తర్వాత అధికాహారోత్పత్తి, కర్షకుల అభ్యున్నతికి పాటుపడాలని ప్రభుత్వం ప్రయత్నిస్తున్నది. ఇందుకు గతసంవత్సరం జరిగిన కృషి మాత్రం ఏమంత ప్రశంసనీయంగాలేదు. అన్నిరాష్ట్రాలలోను, రైతుకు భూమిపై హక్కునిచ్చే చట్టాలు - జమీందారి బిల్లులలాంటివి - తయారు చేస్తున్నారు. నీటిపారుదల సౌకర్యాల అభివృద్ధికి దేశమంతట అనేక పెద్దపెద్ద ప్రాజెక్టులు తలపెట్టబడివున్నవి. ఇవిగాక మైనర్ ప్రాజెక్టులు, గొట్టపుబావులు, బావులకు విద్యుచ్ఛక్తి సప్లయి మొదలైన కార్యక్రమం కొంతవరకు సంతృప్తికరంగా సాగుతున్నది. చౌకధరలకు ఎరువులు అమ్మటం, బుల్‌డోజర్లు, ట్రాక్టర్లు సప్లయిచేయటం కూడా జరుగు తున్నది. 'ఆహారధాన్యాల సలహాసంఘం, రెండు ముఖ్యసంస్థలను స్థాపించవలసిందని తన అంతిమ నివేదికలో ప్రభుత్వానికి సూచించింది. ఒకటి, కేంద్రవ్యవసాయ ప్లానింగ్ కమిషన్. రెండవది, అదనపు భూమిని సాగుబడిలోనికి తెచ్చే విధానాలను ఆలోచించే సంఘం. నీటి ముురుగువల్ల సాగుబడికి పనికిరాకుండావున్న భూమి 50—100 లక్షల ఎకరాలు వుంటుందని అంచనావేశారు. ఈ భూమికి మురుగు బాధ తప్పించి, బాగుచేయటానికి రూ 50 కోట్ల మూలధనంతో ఒక ప్రత్యేక సంస్థను ఏర్పాటుచేయాలని వీరు సూచించారు. అన్నిరాష్ట్రాలలోను పెద్ద ప్రాజెక్టుల నిర్మాణము, మైనర్ ప్రాజెక్టుల నిర్మాణము ఎట్లా చురుకుగా

జరుగుతున్నదో పరిశీలిస్తూ, వ్యవసాయాభివృద్ధికి పాటుపడే కేంద్ర వ్యవసాయ - ప్లానింగ్ కమిషన్ కూడ అవుసరమే. మనదేశంలో ఇప్పటికన్నా 1 కోటి టన్నుల ధాన్యం ఎక్కువ పండించటానికి కృషి చేయాలని వీరు సూచించారు. 10, 15 ఏండ్లలో పెద్ద ప్రాజెక్టులన్నీ పూర్తి అయితే వాటి ఉపయోగంద్వారా 40 లక్షల టన్నులు; రాష్ట్రాలు తలపెట్టిన చిన్నచిన్న స్కీములద్వారా, 5 ఏండ్లలో సాలుకు 30 లక్షల టన్నులు; క్రొత్తభూమిని సాగుబడిలోనికి తెచ్చి 20 లక్షల టన్నులు అదనపు పంట పండించవచ్చును. పెద్ద ప్రాజెక్టు లన్నిటి నిర్మాణము పూర్తి అయితే రెండుకోట్ల ఎకరాలు వాటిద్వారా సాగుబడిలోనికి తెస్తారు. ఇవన్నీ ఇప్పుడింకా ఆలోచనల రంగంలోనే వున్నాయి. మైనర్ ప్రాజెక్టులపై ప్రస్తుతం దృష్టి బాగా కేంద్రీకరించివుంచి, వెంటనే అధికోత్పత్తికి తోడ్పడితే, విదేశాలనుండి దిగుమతులు తగ్గించుకోవటానికి వీలుపడుతుంది. అధికాహారోత్పత్తికి రాష్ట్రాలు తీవ్రంగా కృషిచెయ్యటమేలేదు. ఆహారపు కొరతలు విదేశ దిగుమతుల ద్వారా గడుపుకో వచ్చుననే తత్వం పూర్తిగా మారిపోవాలి. ఆహారం విషయంలో కేంద్రంకన్న రాష్ట్రాలకే ఎక్కువ బాధ్యత, అధికారాలు వున్నవి. రాష్ట్రాలు సక్రమంగా వినియోగించకపోతే కేంద్రమైనా జోక్యంచేసుకుని పరిస్థితి బాగుచేయాలి. వ్యవసాయాభివృద్ధికి గత సంవత్సరం చెప్పుకోతగ్గ కృషి ఏమీ జరగలేదంటే రాష్ట్రాలు, కేంద్రము కూడ దానికి బాధ్యతవహించి, ఇకముందైనా ఇట్టి నిర్లక్ష్యం జరుగకుండా వుండేటట్లు శ్రద్ధవహించాలి.

# బడ్జెట్

దేశ ఆర్థిక సౌష్ఠవమునకు, స్థిరతకు బడ్జెట్ సూచికవంటిది. ఆదాయ వ్యయములను అంచనావేసి, అదనపు ఆదాయము నేవిధంగా సంపాదించవలెనో ఆలోచించి, ఏయే విషయమునకు ఎంతెంత వ్యయమవుతున్నదో, దానిని తగ్గించటానికి వీలున్నదో లేదో పరీక్షించి, దేశఆర్థిక పరిస్థితిని సమగ్రముగా సమీక్షచేయుట బడ్జెట్ ఉద్దేశ్యము. ఒక కుటుంబ అభ్యున్నతినిగూర్చి తెలుసుకోవాలంటే దాని ఆదాయ వ్యయాలు తెలుసుకోవటం ఎంత అవుసరమో ఒకదేశ ఆర్థిక సౌష్ఠవము, దక్షతలను గురించి తెలుసుకోవటానికి దాని బడ్జెట్‌ను తయారుచేయటం అంత అవుసరం.

ఆగస్టు 15 వ తేదీన భారతదేశం ఇండియా, పాకిస్థాన్‌లుగా విభాగమైపోవటంతో, 1947-48 వ సం. నకు, 1947 వ సం. ఫిబ్రవరిలో తయారుచేసిన బడ్జెట్ నిరుపయోగమైపోయింది. మన ఖజానా లెక్కలకు సంవత్సరం ఏప్రిల్ నెల 1 వ తేదీనుండి ప్రారంభమై, మరు సంవత్సరం మార్చి 31 వ తేదీతో అంతమౌతుంది. 1948-49 వ సం. 1948 వ సం. ఏప్రిల్ 1 వ తేదీతో ప్రారంభమౌతుంది. ఆగస్టు 15 వ తేదీనుంచి, 1948 వ సం. మార్చి 31 వ తేదీవరకు గడిచే 7½ నెలలకు కాలానికి ఒక బడ్జెట్ తయారుచేసి, అధినివేశ శాసనసభలో నవంబరు నెలలో, ఖజానా మంత్రి శ్రీ షణ్ముఖం చెట్టి ప్రవేశపెట్టాడు. దేశ విభజనతో దేశం ఆర్థికంగా బలహీనపడి పోతుందనీ, ఆ తర్వాత ప్రారంభమైన కల్లోలాల వలన మన ఆర్థిక వ్యవస్థ క్రుంగిపోయిందనీ, కాందిశీకులకు, కాశ్మీర్ యుద్ధానికి అయ్యేఖర్చు మన ప్రభుత్వం భరించలేదనీ, భారతదేశ ఆర్థికసౌష్ఠవము చెడిపోతున్నదనీ భయపడినవారంటరికీ ఈ బడ్జెట్ కనువిప్పుచేసింది. దేశవిభజనవలన మన ఆర్థిక వ్యవస్థ

ఏమాత్రం క్రుంగిపోలేదు. సరికదా, బాగా బలపడింది. కాందిశీకులకు సౌకర్యాలు ఏర్పరచే నిమిత్తం రూ 22 కోట్లు ప్రత్యేకించారు. సంవత్సరాంతానికి ఆ మొత్తం పూర్తిగా ఖర్చు కానేలేదు.

దేశం విభాగమై పోయినతర్వాత ఇండియాయూనియన్‌కు 7½ నెలలకు తయారుచేసిన ఈ బడ్జెట్ అంకెలను ఇంకే ఇతరఅంకెలతోను పోల్చటానికి వీలులేదు; సంవత్సరానికంతకు, దేశానికంతకు ఈ బడ్జెట్ తయారుచేయబడకపోవటమే ఇందుకు కారణము. అనేకవిధాలుగా ఈ బడ్జెట్ విశిష్టమైనది. స్వతంత్రభారతదేశంలో తయారుచేసిన బడ్జెట్‌లలో ఇదే మొదటిది. దేశం క్లిష్టసమయాలలో చిక్కునివుండి, ఎప్పుడే ఆపత్తు వస్తుందోనని ఆందోళన పడుతున్నరోజులలో మన ఆర్థికవ్యవస్థనుగురించి ఏమీ ఆందోళన చెందనక్కరలేదని ధైర్యం చేకూర్చింది ఈ బడ్జెట్. దీనిప్రకారం 7½ నెలలకు మనదేశ ఆదాయం మొత్తం రూ. 172.80 కోట్లు, వ్యయం రూ. 197.39 కోట్లు. సుంకాలు రూ. 50.50 కోట్లు, సెంట్రల్ ఎక్సైజ్ రూ. 22.08 కోట్లు, కార్పొరేషన్ (కంపెనీల) పన్ను రూ. 42.71 కోట్లు, ఆదాయపుపన్ను రూ. 75.29 కోట్లు ఆదాయంలో పెద్దపద్దులు. ఋణాలకు వడ్డీలు వగైరా రూ. 20.52 కోట్లు, పరిపాలన రూ. 20.24 కోట్లు, కాందిశీకులకు రూ. 22 కోట్లు, ఆహారధాన్యాలకు సబ్సిడీలు రూ. 22.52 కోట్లు, సైనికవ్యయం రూ. 92.74 కోట్లు వ్యయంలో పెద్దపద్దులు. బడ్జెట్‌లో రూ. 24.59 కోట్లు లోటు వచ్చినా పాకిస్థాన్‌నుండి మనకు రావలసిన సొమ్ము లెక్కలోనికి తేలేదు కాబట్టి అదనపుపన్నులు అనవుసరమని భావించారు. ఈ లెక్కలప్రకారం నిండుసంవత్సరానికి మనదేశ ఆదాయం రూ. 285 కోట్లు, వ్యయం రూ. 300 కోట్లు వుంటుందని అంచనావేయవచ్చును. గందరగోళంగా, కొన్నివిషయాలలో ఆందోళనకరంగావున్న వ్యవహారాలను ఒకత్రోవకు తీసుకువచ్చి అదుపులోపెట్టి ఆర్థికవ్యవహారాలన్నింటికి ఒకసమగ్రరూపం యివ్వటంకన్న ఈ బడ్జెట్‌లో చెప్పుకోతగినదేమీ లేదు. అసలు ఆసమయంలో అంతకన్న ఆశించదగిందికూడా ఏమీ లేదు.

1948 వ సం. మార్చి నెలలో, రానున్న పూర్తిసంవత్సరానికి బడ్జెట్ తయారుచేయుటయు, గత 7½ నెలల వ్యవహారాలను సమీక్షచేయుటయు జరిగింది. 1948-49 వ సం.లో జరుగనున్న ఆదాయవ్యయాలను, కార్యక్రమాలను ఈ బడ్జెట్ లో వివరించారు.

గత 7½ నెలల కాలంలో ఆదాయం అనుకున్నదానికన్న ఎక్కువగా పెరిగి, ఖర్చుతగ్గి బడ్జెట్ లో అంచనావేసినంతలోటు రాలేదు. ఆకాలంలో ఆదాయం రూ. 172.80 కోట్లు వుంటుందని అంచనాచేస్తే, వాస్తవంగా రూ. 178.77 కోట్లు వచ్చింది; వ్యయం రూ. 197.39 కోట్లు అవుతుందని అంచనావేయగా వాస్తవంగా రూ. 185.29 కోట్లు మాత్రమే ఖర్చయింది. అందువలన నికరంలోటు అంచనావేసినట్లు రూ. 24.59 కోట్లువున్నా వాస్తవానికి రూ. 6.52 కోట్లు మాత్రమే లోటువచ్చింది. పాకిస్థాన్ మనకు యివ్వవలసిన సొమ్మువిషయం పరిష్కారమైనా ఆసొమ్ము యింకా నాలుగేండ్లవరకు రాదు. కాబట్టి లెక్కలలో దానిని జేర్చలేదు.

1948-49 వ సం.లో మనదేశఆదాయం రూ. 230.52 కోట్లు వుండుననీ, వ్యయం రూ. 257.38 కోట్లు అవుననీ అంచనావేశారు. ఈవిధంగా ఏర్పడుతున్న లోటును భర్తీచేయుటానికి కొన్ని క్రొత్త పన్నులు విధించటానికికూడా నిర్ణయించారు. ఈ సంవత్సరం సుంకాల వలన రూ. 31.75 కోట్లు, సెంట్రల్ ఎక్సైజ్ వలన రూ. 34 కోట్లు, కార్పొరేషన్ పన్నువలన రూ. 39.50 కోట్లు, ఆదాయపుపన్నువలన రూ. 90.50 కోట్లు ఆదాయం వస్తుందని అంచనావేశారు. అప్పులపై వడ్డీ వగైరాకు రూ. 41.16 కోట్లు, పరిపాలనయంత్రమునకు రూ. 31.56 కోట్లు, కాందిశీకులకు సౌకర్యాలకు రూ. 10.04 కోట్లు, ఆహారసబ్సిడీలకు రూ. 19.91 కోట్లు, రక్షణశాఖలకు రూ. 121.08 కోట్లు వ్యయమవుతుందని అంచనావేశారు. రక్షణవ్యయంలో సైన్యానికిగాను రూ. 65.62 కోట్లు, నౌకాదళానికిగాను రూ. 5.65 కోట్లు, విమానదళాలకుగాను రూ. 12.93 కోట్లు, ఆయుధసామగ్రికి 25.76 కోట్లు, తదితరం రూ. 11.22 కోట్లు ఖర్చవుతుందని భావిస్తున్నారు.

దేశ అభ్యుదయానికి అవుసరమైన ముఖ్యశాఖలైన విద్య, ఆరోగ్యం విషయం కేంద్రప్రభుత్వం ఎంత నిర్లక్ష్యం చేస్తున్నదో ఈ క్రింది అంకెల వలన రుజువవుతున్నది. విద్యకుగాను రూ. 86.31 లక్షలు (జనాభాకు లెక్కచూస్తే వ్యక్తికి అణాకూడ వుండదు); ఆరోగ్యానికి రూ. 94 లక్షలు (వ్యక్తికి అణా వుంటుంది); వ్యవసాయాభివృద్ధికి రూ. 1.73 కోట్లు మాత్రమే ఖర్చుచేస్తున్నారు. అటు కేంద్రప్రభుత్వానికి, ఇటు రాష్ట్రప్రభుత్వాలకు చెందిన శాఖలనుగురించి ఏ ప్రభుత్వము శ్రద్ధ వహించక, కేవలం నిర్లక్ష్యం జరుగుతున్నదని ఈ అంకెలు రుజువు చేస్తున్నాయి.

అవిభక్త భారతదేశానికి ఆఖరు బడ్జెట్ లియాకతాలీ ప్రవేశ పెట్టినప్పటినుండి అందులో పన్నుల భారం హెచ్చుగా వున్నదనీ, హిందూ పెట్టుబడిదార్లను నాశనంచేసి, దేశపారిశ్రామికాభివృద్ధికి ఆటంకం కలిగించటానికే అతడిట్లు చేశాడనీ, వెంటనే పన్నులు తగ్గించక పోతే పరిశ్రమాభివృద్ధి జరగదనీ పెట్టుబడిదారులు ఆందోళన జరుపుతూనే వున్నారు. నవంబరునెలలో తాత్కాలిక బడ్జెట్ ప్రవేశపెట్టేటప్పుడు, ఈ విషయమై సావకాశంగా ఆలోచించి, మార్చి బడ్జెట్‌లో మార్పులు చేస్తానని చెట్టి వాగ్దానంచేశాడు. సావకాశంగా ఆలోచించిన పిదప పన్ను భారం జాస్తిగావున్నదని ఆయనకూడ గుర్తించి కొన్ని పన్నులు తగ్గించాడు. వర్తక లాభాలపన్ను విధించటానికి వుండవలసిన లాభం కనీసం మొత్తం రూ 1 లక్ష నుండి రూ 2 లక్షలకు పెంచి, పన్ను రేటు నూటికి 16 2/3 వంతుల నుండి, 10 వంతులకు తగ్గించాడు. ఇందువల్ల తగ్గే ఆదాయం రూ 2 కోట్లు మాత్రమే. సూపర్‌టాక్స్ విధించే కనీస మొత్తం ఆదాయము, ఆ పన్ను రేటు సవరించి, ఒక కోటి రూపాయల ఆదాయం వదలు కోటానికి నిర్ణయించారు. కంపెనీలు వాటాదార్లకు పంచకుండా వ్యాపారంలోనే వినియోగించే లాభాలపై పన్ను రూపాయికి ఒక అణా చొప్పున తగ్గించి, మొత్తం రెండు కోట్ల రూ. ల ఆదాయాన్నీ, 25 వేల రూ. ల కన్న తక్కువ లాభం సంపాదించే కంపె

నీలకు సగంరేటు చొప్పున పన్ను వసూలుచేసి రూ 12 లక్షల ఆదాయాన్ని, పెద్ద పెట్టుబడిదార్లు చేసే దానధర్మాల మొత్తాలను కొంతవరకు లాభాలనుండి తగ్గించి, పన్ను వేయకుండా వుండటానికి అంగీకరించి రూ 75 లక్షలు ఆదాయాన్ని పోగొట్టుకోటానికి మంత్రి అంగీకరించాడు. ఈ సూచనలు పెట్టుబడిదార్లకు సంతృప్తి కలిగించాయి. అయితే ఇన్నాళ్ళనుంచి పెట్టుబడిదార్ల ఆందోళన జరుపుతున్న పన్ను భారం మొత్తం 5, 6 కోట్ల రూపాయలేనా ? వ్యక్తులకు కంపెనీలకు కలిపి ఆదాయపుపన్ను మొత్తం రూ 130 కోట్లు విధిస్తున్నారు. ఇందులో 5, 6 కోట్లు మొత్తం అమితభారంగా వుందని రెండేండ్లు ఆందోళన ఎందుకు చేశారు ? దీనిలోవున్న చిదంబర రహస్యం మంత్రిగారికి, పెద్ద పెట్టుబడిదార్లకు తెలియాలి. మొత్తంమీద ఆ పన్ను తగ్గింపువలన లాభం పొందింది పెద్ద పెట్టుబడిదార్లు మాత్రమే. వీరి ఆదాయం ఇదివరకే కోట్లు లెక్కలో వుంది. ఇంకా ఇప్పుడు కొన్నికోట్లు కలిసింది. సన్నకారు పెట్టుబడిదారులకు ఈ తగ్గింపువలన ఏమీ లాభంలేదు. కేంద్ర ప్రభుత్వం పెద్ద పెట్టుబడిదారుల చేతులలో వుందనటానికి ఇంతకన్న నిదర్శనం అక్కరలేదు.

పెద్ద పెట్టుబడిదారుల పన్నులు తగ్గించటంవలన ఏర్పడిన లోటును, బడ్జెట్‌లో ఏర్పడిన లోటును భర్తీచేయటానికి జీవితావసర వస్తువులపై పన్నులు విధించి, ప్రజానీకంవద్ద నుంచి వసూలు చేయటానికి మంత్రి నిర్ణయించాడు. దేశంనుంచి ఎగుమతి జరిగే నూనెగింజలు, వనస్పతి, మాంగనీసులపై ఎగుమతి పన్ను వేసి, దిగుమతి అయే మోటారుకార్లపై దిగుమతి పన్ను వృద్ధిచేయటానికి నిర్ణయించారు. అగ్గిపెట్టె, తేయాకు, కాఫీలపై ఎక్సైజ్ పన్ను పౌనుకు రెండణాలనుండి, నాలుగణాలకు, వనస్పతి, రబ్బరు టైర్లు, పొగాకు, సిగరెట్లు మొదలగు వానిపై ఎక్కువపన్ను వేశారు. ఇవన్నీ భరించవలసింది ప్రజాబాహుళ్యమే. కేంద్రప్రభుత్వ పెట్టుబడిదారీ వైఖరికి ఇది మరొక నిదర్శనము. పెద్ద పెట్టుబడిదారులను సంతుష్టిపరచకపోతే పారిశ్రామికాభివృద్ధి జరగదని భయపడి. వారు

చెప్పినట్లు ఆడినా, ఎప్పటి కప్పుడు ఏదో ఒక సాకు చెప్పి వారు పారిశ్రామికాభివృద్ధికి ఆటంకాలు కలిగిస్తూనే వున్నారు. వారి మాటలకు మోసపోయి, పన్ను తగ్గించి ప్రజానీకంపై పన్నులు హెచ్చించటం స్వతంత్ర భారతదేశంలో జరుగవలసిన పనికాదు.

ఈ సంవత్సరం కేంద్రప్రభుత్వం రూ 150 కోట్లు అప్పుచేసి, దేశాభివృద్ధి కార్యక్రమం నిర్వహించాలని నిర్ణయించారు. ఇందుకు కేంద్రప్రభుత్వం రూ 36 కోట్లను ప్రత్యేకించివుంచి, రాష్ట్రప్రభుత్వాలకు రూ. 30 కోట్లు సహాయము, రూ 34 కోట్లు అప్పుయివ్వాలని నిశ్చయించారు. ఇది గాక కేంద్రప్రభుత్వం రూ 26½ కోట్లు మామూలు అభివృద్ధి కార్యాలకు వినియోగిస్తుంది. ఇవన్నీ లెక్కచూస్తే అభివృద్ధి కార్యక్రమాలకు ఈ సంవత్సరం రూ 70 కోట్లు. రానున్న సంవత్సరం రూ 165½ కోట్లు ఒక్క కేంద్రప్రభుత్వమే ఖర్చుచేస్తుంది.

స్వతంత్ర భారత ప్రథమ బడ్జెట్ ప్రజలు ఆశిస్తున్న సోషలిస్టు వ్యవస్థకు పునాదులు వేయటంలేదు; సరికదా తద్వతిరేకం చేస్తున్నది. దేశ ఆర్థిక వ్యవస్థ సుస్థిరపడి, బలిష్టమయ్యేవరకు అటువంటి కార్యక్రమాలు తల పెట్టకూడదంటే, దానివలన లాభం పొందే పెట్టుబడిదారులు తప్ప మరెవరు ఒప్పుకోరు. కేంద్రప్రభుత్వంపట్ల విద్యాధికులలో అసంతృప్తి జనించటానికి ఈ బడ్జెట్ ఒక ముఖ్యకారణం. కాంగ్రెస్ ఆర్థిక ఆశయాలు అమలు జరుపటానికి ఈ బడ్జెట్ ఏమాత్రం ఉపయోగపడదు. కాంగ్రెస్ సంస్థ, కాంగ్రెస్ మంత్రులు ఇకనైనా శ్రద్ధవహించి, తమబడ్జెట్ తాము ప్రచారంచేస్తున్న ఆశయాలను అనుసరించి వుండేటట్లు తయారుచేయాలి.

## రైల్వే బడ్జెట్

ఆగస్టు 15 వ తేదీ తర్వాత జరిగిన కల్లోలాలవలన రైల్వేలు బాగా దెబ్బతినటంవలన వాటి ఆర్థిక పరిస్థితి చాల కృంగిపోయి వుంటుందని చాలమంది భయపడినారు. కాని అట్టిది జరుగలేదు. ఆగస్టు 15 వ

తేదీనుంచి మార్చి 31 వ తేదీవరకు గల 7½ నెలల కాలంలో రైల్వేల ఆదాయం రూ 107 కోట్లు వుంటుందని అంచనా వేశారు. ఈకాలంలో రైల్వేల వ్యయం రూ. 107 కోట్ల చిల్లరవున్నా, ఇతర పద్దులవల్ల మొత్తం రూ. 3.19 కోట్లు లోటువస్తుందని భావించారు. కార్మికులకు 'పే కమిషన్' సిఫార్సుల ప్రకారం రూ. 17¼ కోట్లు జీతాలు, రూ. 5¼ కోట్ల ఖర్చుతో ఇతర సౌకర్యాలు ఏర్పాటుచేసిన తర్వాతనే రైల్వేల ఖర్చు మొత్తం రూ. 107 కోట్ల పైచిల్లర అయినది. అవి అప్పుడు రాకుండా వున్నట్లుయితే, రైల్వేలు ఆకల్లోలం సమయంలోకూడా 'మిగులు' ఆదాయాన్ని కనపరిచేవే నన్నమాట! రైల్వేలలోటు భర్తీ చేయటానికి, అభివృద్ధి కార్యక్రమాలకు సొమ్ము సంపాదించ టానికి రైల్వే ప్రయాణపు రేట్లు వెంటనే పెంచాలని, రవాణా రేట్లు ఎంతెంత పెంచాలో ఆలోచించి, సిఫార్సులు చేయటానికి ఒక కమిషన్ నియమించాలని నిర్ణయించారు. దూరపుప్రయాణాలకు, పైతరగతులకు చార్జీలు బాగా హెచ్చించారు. క్రొత్తరేట్ల ప్రకారం మొదటి తరగతి ప్రయాణానికి మైలుకు 30 పైసలు, రెండవ తరగతి ప్రయాణానికి మైలుకు 16 పైసలు, ఇంటర్ తరగతి ప్రయాణానికి మైలుకు 9 పైసలు, మూడవగరగతి ప్రయాణానికి మైలుకు మైలులో 5 పైసలు, ప్యాసింజెరులో 4 పైసలు చార్జిచేస్తున్నారు.

1948-49 వ సం. బడ్జెట్ సమయంలో గత 7½ నెలల వ్యవహారాలు సమీక్షించగా, రైల్వేలలోటు అంచనా వేసినట్లు రూ. 3. 19 కోట్లు గాక, రూ. 5.20 కోట్లని తేలింది. ఆదాయం రూ. 8.15 కోట్లు, వ్యయం రూ. 6 కోట్లు తగ్గిపోయి, ఇతర పద్దుల ఆదాయం కొంచెం పెరగటంవల్ల ఇల్లా సంభవించింది. కల్లోలం సమయంలో, ఏమీ ఆధారంలేని అంకెల సహాయంతో తయారుచేసిన బడ్జెట్ వాస్తవ పరిస్థితులకు ఇంత సన్నిహితంగా వున్నదంటే మెచ్చుకొని తీరవలసిందే.

1948-49 వ సం. లో రైల్వేల ఆదాయం రూ. 190 కోట్లు వుండుననీ, వ్యయం రూ. 147. 15 కోట్లు వున్నా, అరుగుదల, వడ్డీ

మొదలైన పద్దులు పోను రూ. 9. 85 కోట్లు నికరం లాభం వుంటుందనీ అంచనా వేశారు. ఈలాభం ఏవిధంగా వినియోగించాలనే విషయంపై ఖజానామంత్రికి, రవాణామంత్రికి అభిప్రాయ భేధాలువచ్చి, మధ్యవర్తిత్వం కోరినారు. రైల్వేలు ఇంకా చాల అభివృద్ధి చెందవలసి వున్నది కాబట్టి వాటి లాభాలను అవే వినియోగించుకుని, అభివృద్ధి చెందటం సమంజసం. ఈసంవత్సరంలో రూ. 53. 29 కోట్లు అభివృద్ధి కార్యాలకు వినియోగిస్తారు. ఇందులో రూ. 25. 61 కోట్లు కొత్త ఇంజన్లు కొనటానికి, రూ. 24. 80 కోట్లు క్రొత్తవర్కుషాపులు, కట్టడాలకు వినియోగిస్తారు. మొత్తంమీద మన రైల్వేల ఆర్థిక పరిస్థితి సౌష్టవంగానే వున్నది. రవాణా రేట్లవిషయం ఆలోచించి, రివైజు చేయవలసినపని ఇంకా వెనుకబడియే వున్నది. ఇందుకు రవాణామంత్రి వెంటనే పూనుకొనవలెను, కొత్తరైలుమార్గాల నిర్మాణము ఇంతవరకు తీవ్రంగా ఆలోచనలోనికే రాలేదు. ఇందుకు కూడా ఒక ప్రత్యేక సంఘం నియమిస్తే బాగుండును. ప్రయాణీకుల సౌకర్యాలను గురించి మాట్లాడటము తప్ప పనిఏమీ కనిపించటం లేదు.



# విద్య, ఆరోగ్యము

ప్రజా శ్రేయోభివృద్ధికి ముఖ్యముగా అవుసరమైనది విద్య, ఆరోగ్యము నని అందరూ అంగీకరిస్తారు. మనదేశములో నూటికి 95 వంతుల మంది ప్రజలకు ఈ రెండూ ఎప్పుడూ కరువుగానే వున్నవని మనకు తెలుసును. జాతీయప్రభుత్వాలు అధికారంలోనికి రాగానే నిరక్షరాస్యతా నిర్మూలనము, సర్వప్రజలకు వైద్యసౌకర్యాలు కలిపించి, ఆరోగ్యాభివృద్ధి చేయటానికి ఎంతో పాటుపడుతవని మనము ఆశించాము. విద్య, ఆరోగ్యము విషయంలో ప్రపంచంలోకల్లా భారతదేశమే వెనుకపడివున్న దేశము.

విద్య, ఆరోగ్యము కేంద్రప్రభుత్వము నేరుగా బాధ్యతవహించే శాఖలు కావు; వీటిపై అధికారమంతా రాష్ట్రప్రభుత్వాలకే వున్నది. ఆయాప్రాంతాల అవుసరాలను, విశిష్టతనుబట్టి విద్య, వైద్యసౌకర్యాలు సమకూర్చటానికి కేంద్రప్రభుత్వానికన్న రాష్ట్రప్రభుత్వానికే ఎక్కువ అవకాశంవుంటుంది. అందువలన కేంద్ర విద్య, ఆరోగ్యశాఖలలో ఎక్కువ జరుగవలసిన కృషి ఏమీ వుండదు. అన్నిరాష్ట్రాల పథకాలను, పద్ధతులను, సమన్వయపరచటము, దేశానికంతటికీ ప్రాముఖ్యత వహించగల కొన్ని సంస్థల నేర్పరచటము, రాష్ట్రప్రభుత్వాల తాహతుకు అందని సాంకేతిక విద్యాలయాలను ఏర్పరచటము, రాష్ట్రప్రభుత్వాలు జరుపుతున్న కృషిని అజమాయిషీ చెయ్యటము - ఇవే ఈ కేంద్రశాఖల కర్తవ్యము. అవుసరమునుబట్టి సంవత్సరానికొకటి రెండు పర్యాయాలు సలహా సంఘాలను, రాష్ట్రమంత్రులను సమావేశపరచి, అప్పటివరకు జరిగిన కృషిని సమీక్షించి, భవిష్యత్ కార్యక్రమాన్ని నిర్ణయిస్తుంటమే ఈ శాఖలలో జరిగే కృషి.

అఖిలభారత విద్యావిషయిక సలహాసంఘము జనవరినెల రెండవ వారంలో జరిగింది. అది జరిగినతర్వాత వెంటనే రాష్ట్రమంత్రుల సమావేశంజరిగి, ఆ సంఘ సూచనలు ఆలోచించి, భవిష్యత్ కార్యక్రమం నిర్ణయించటం జరిగింది. స్వతంత్ర భారతదేశంలో, విద్యాభి

వృద్ధికి తీవ్రకృషి చేయాలని కేంద్రప్రభుత్వము, అన్ని రాష్ట్ర ప్రభుత్వాలు ఆలోచిస్తున్నవి. పరాయిభాష అయిన ఇంగ్లీషును తొలగించి దానిస్థానే దేశభాషను పెట్టటం ప్రస్తుతం ఆలోచింపవలసిన ఒక ముఖ్య సమస్య. ఆంగ్ల భాషకు 10 ఏండ్లలో పదచ్యుతి జరిపి, దానిస్థానే హిందీ లేక హిందుస్థానీని తీసుకురావాలని అందరూ అంగీకరించారు. విశ్వవిద్యాలయాలలోకూడా, ఇక 5 ఏండ్లనుంచి దేశభాషలోనే బోధన జరుగవలసివుంటుందని మౌలానా ఆజాద్ హెచ్చరించారు. భారత దేశ భాష హిందీవుండాలా, ఉర్దూ, నాగరి లిపులతో హిందూస్థానీ వుండాలా అన్నది తీవ్రసమస్య అవుతున్నది. బీహార్, యు. పి. రాష్ట్రాలు హిందీనే రాజభాష చేసుకున్నాయి. హిందీ మాట్లాడే ప్రజలున్న ఆ రాష్ట్రాలే ఆ వైఖరి నవలంబిస్తే ఇతరరాష్ట్రాలు అనుసరించక బహుశః తప్పకపోవచ్చును. ఏమైనను, పాకిస్థాన్ విడిపోయిన తర్వాత ఉర్దూలిపికి, పర్షియన్ మాటలకు మనభాషలో తావుండుట మనభాషలకు అప్రతిష్టాకరణము. పైగా, స్వచ్ఛమైన హిందీని నేర్చుకోవటం ఇతరభాషలవారికి చాల తేలిక. భారతప్రభుత్వము హిందీనే రాజభాష చేయవలెను.

పాఠశాలలలో మతబోధ జరుగవలెనని మౌలానా ఆజాద్ పట్టుపట్టినాడు. పాఠశాలలలో మతబోధ జరుగనిచో, ఆ బోధన ఇతరులచే జరిగి, మన యువకులకు మత - మూర్ఖత హెచ్చిపోగల అవకాశము లేకపోలేదు. భారతప్రభుత్వము ఏ మతమును రాజమతముగా గుర్తింపదు కాబట్టి అన్ని మతములను గూర్చి బోధన పాఠశాలలలో, అవుసరమునుబట్టి జరుగవలెను.

వయోజనులందరికి విద్య నేర్పి, 10 ఏండ్లలో నిరక్షరాస్యతను నిర్మూలించటానికి ఒక పంచవర్ష ప్రణాళికను తయారుచేసి రాష్ట్రప్రభుత్వాలకు సూచించారు. దీనిని అన్నిరాష్ట్రములు ఇప్పుడిప్పుడే ఆచరణలో పెట్టుతున్నవి. ఈ కార్యక్రమం మనం ఆశించినంత త్వరగాగాని, చురుకుగాగాని జరగటంలేదు. ప్రభుత్వంగాని, అధికారేతర నాయకులు గాని దీనిపట్ల ఉండవలసినంత ఉత్సాహవంతంగా లేరు. ఈ పథకానికి రూ. 24 కోట్లు ఖర్చుపెట్టటానికి నిశ్చయించారు.

ఇప్పటివరకు ఉపకారవేతనాలపై విదేశాలకు విద్యార్థులను పంపి శిక్షణ యిప్పిస్తున్నారు. ఇప్పు డది మానివేసి, ఆ సొమ్ముతో విదేశాల నుండి శిక్షకులను, ఆచార్యులను పిలిపించి, మనదేశంలోనే ఇంకా ఎక్కువమందికి శిక్షణ యిప్పించటానికి ఏర్పాట్లుచేయాలని నిశ్చయించారు. ఇందుకు ఇంతవరకు కృషిఏమీ జరుగలేదు.

దక్షిణభారతదేశంలో కర్నాటక సంగీత కళాశాలను స్థాపించటానికీ, లక్నోలోని హిందుస్థానీ సంగీత కళాశాలను పునరుద్ధరించటానికీ, జాతీయకళలు, శిల్పము, కవిత, గానము, నాట్యము మొదలగు లలితకళల పురోభివృద్ధికి దోహదముచేయటానికి 'జాతీయ సాంస్కృతిక రక్షణాలయము'ను ఏర్పాటుచేయటానికీ, గుడ్డివారందరు చదువుకోవటానికి బ్రెయిలీ లిపిలో పుస్తకాలు విరివిగా అచ్చువేయటానికి ఒక ముద్రాక్షరశాలను స్థాపించటానికీ, శారీరకశిక్షణ, గృహపాలనాశాస్త్రములలో ఉపాధ్యాయులను తర్ఫీదుచేసే కళాశాలను స్థాపించటానికీ, విదేశభాషలను నేర్చుకోవటాన్ని ప్రోత్సహించి, సహాయపడే సంస్థను ఏర్పరచటానికీ, జాతీయపురావస్తువుల మ్యూజియం ఏర్పరచటానికీ ఈ సంవత్సరం కేంద్రవిద్యాశాఖ నిశ్చయించింది. సుప్రసిద్ధ వేదాంతాచార్యుడు సర్వేపల్లి రాధాకృష్ణ యాజమాన్యాన ఒకసంఘమును నేర్పరచి భారతీయ వేదాంతశాస్త్రమును వ్రాయించుటకు ప్రభుత్వము నిశ్చయించింది. భారతదేశ ఆర్థికాభ్యున్నతికి అవుసరమగు అన్నిరకముల సాంకేతికశాస్త్రజ్ఞులకు, సాంకేతికనిపుణులకు శిక్షణ ఏర్పాట్లు జరపటానికి ఏర్పాట్లుచేయటానికి 'అఖిలభారత సాంకేతిక విద్యాసమితి'ని ఏర్పాటుచేయటానికికూడా ప్రభుత్వం నిశ్చయించింది. వీటిలో ఏదీ ఇంతవరకు కార్యరూపం దాల్చలేదు. రాష్ట్రాలలోకూడ సాంకేతిక విద్య, వృత్తివిద్య, వయోజనవిద్య మొదలగు అవుసరవిషయాలలో చెప్పదగినంత అభివృద్ధి కనిపించటంలేదు. ప్రభుత్వోద్యోగులను తయారుచేసే యంత్రాలయ - 'కళాశాలలుమాత్రం పెరుగుతూనేవున్నాయి. కేంద్రప్రభుత్వ విద్యాశాఖసంగతటుంచి, భారతదేశంలో విద్యావ్యాప్తి చాల అసంతృప్తికరంగా, ఆశాభంగకరంగా జరుగుతున్నదని ఒప్పుకొనక తప్పదు.

# ఆరోగ్యము

ఆరోగ్య శాఖలో విద్యాశాఖలో జరిగినంత కృషికూడా జరుగ లేదు. భోర్ కమిటీ నివేదికను ఏవిధంగా ఆచరణలో పెడదామా అనే విషయంపైననే ఇంకా చర్చలు జరుగుతున్నవి. పట్టణాల సంగతటుంచి ప్రభుత్వం ముఖ్యంగా గ్రామాలలో ఆరోగ్యాభివృద్ధికి తీవ్రకృషి చేయాలి. ఆరోగ్యం రాష్ట్రప్రభుత్వాల బాధ్య కాబట్టి ఎక్కువ కృషి రాష్ట్ర ప్రభుత్వాలే చేయవలసి వుంటుంది. ఆధునిక వైద్యశాస్త్రం చదువుకున్న డాక్టర్లు గ్రామాలకు పోవటానికి ఒప్పుకోరు. వీరికి తగిన జీతము, ఇతర సౌకర్యాలు యిచ్చి, ఎక్కువమంది డాక్టర్లు గ్రామాలలో స్థిర నివాసం ఏర్పరచుకునేటట్లు ప్రోత్సహించాలి.

అమెరికాలో, వ్యక్తికి సాలుకు రూ 36 లు, బ్రిటన్‌లో వ్యక్తికి సాలుకు రూ 53 వంతున ప్రజారోగ్యానికి ప్రభుత్వాలు ఖర్చు పెడుతున్నవి. మన దేశంలో ప్రజారోగ్యానికి వ్యక్తికి సాలుకు ఆరునుండి ఎనిమిది అణాలు ప్రభుత్వం ఖర్చుచేస్తుంది. ప్రజారోగ్యం విషయంలో మనం ఎంత వెనుకబడి వున్నదీ ఈ అంకెలు రుజువు పరుస్తున్నవి. ప్రస్తుతం మన దేశంలో 47,500 మంది డాక్టర్లున్నారు; ఇంకొక 2,37,500 మంది కావలెను. నర్సులు ప్రస్తుతం 7715 గురు వున్నారు; ఇంకా కనీసం 40 వేల మంది అయినా వుండాలి. మంత్రసానులు ప్రస్తుతం 5 వేల మంది వున్నారు; ఇంకొక లక్ష పదివేలమంది కావాలి. ఇంతమంది డాక్టర్లు, నర్సులు, మంత్రసానులకు శిక్షణ యివ్వటానికి చాల ఏండ్లు పట్టును. ఇప్పుడున్న కళాశాలలు ఏమూలకు చాలవు; కాని కొత్త కళాశాలలు చాల తక్కువ స్థాపిస్తున్నారు. ప్రజారోగ్యం, ఇంకే ఇతర విషయంకన్న, చాల నిర్లక్ష్యంచేస్తున్నారు. కేంద్రరాష్ట్ర ప్రభుత్వాలలో రెంటికీచెంది, దేనికీపట్టక మధ్య నలిగిపోతున్న ఈ శాఖను పునరుజ్జీవింపజేసి, శక్తివంతంగా పనిచేయింకపోతే, దేశానికి చాలనష్టం వాటిల్లగలదు.

—೦೦೫೦೦—

# నిర్మాణాత్మక కార్యక్రమాలు

స్వతంత్ర భారతదేశం సత్వరంగా సర్వతో ముఖంగా అభ్యున్నతికి రావలని భారతప్రజలు, ప్రభుత్వము వాంఛిస్తున్నారు. దేశంలో పారిశ్రామికాభివృద్ధి జరిగి, జాతీయాదాయం పెరిగి, ప్రజలందరికి సక్రమంగా, సమంజసంగా పంపిణీ అయితే ప్రజం జీవనం సౌఖ్యవంతమై దేశం స్వతంత్రమైన ఫలితాన్ని వారు అనుభవించగలుగుతారు. బ్రిటిష్ పరిపాలనలో మనదేశ పరిశ్రమలు కావాలని అదుపులో వుంచివేశారు; ప్రజలను, బలవంతంగా, బీదతనంలోవుంచారు. ప్రజల జీవనస్థాయి అభివృద్ధిపరచటమే తమ కర్తవ్యమని కాంగ్రెస్ నాయకులు చాలకాలము నుండి స్పష్టపరుస్తూనే వున్నారు. ఒక దశాబ్దం క్రితం పండిట్ నెహ్రూ అధ్యక్షతన 'నేషనల్ ప్లానింగ్ కమిటీ' ఏర్పడి, మనదేశ పరిశ్రమాభివృద్ధికి గల అవకాశాలను వివరంగా పరిశీలించి, నివేదికలు తయారు చేసింది. అధికారం వశపరచుకోగానే పరిశ్రమాభివృద్ధికి, దేశ ఆర్థిక వ్యవస్థకు చక్కనిపునాది వేయటానికి జాతీయప్రభుత్వం పూనుకున్నది. అనేక నిర్మాణాత్మక కార్యక్రమాలను తలపెట్టారుకాని వానికి సంబంధించిన కార్యక్రమం ఇంకా పారంభదశలోనే వుంది. వానిలో కొన్ని ముఖ్యమైన వానిని ఈక్రింద వివరిస్తాను.

## 1. పరిశ్రమలకు ఋణసహాయ సంస్థ

పరిశ్రమాభివృద్ధి చురుకుగా జరగాలంటే ప్రభుత్వసహాయం అనేక రూపాలలో పారిశ్రామిక వేత్తలకు లభించాలి. పరిశ్రమలకు అవుసరమైన రక్షణ, యంత్రములు, కార్మికులు, రవాణా మొదలగు సౌకర్యాలను ప్రభుత్వం తప్పక చేకూరుస్తుంది. అది ప్రభుత్వ కర్తవ్యం. పరిశ్రమాభివృద్ధి మరింత చురుకుగా, త్వరగా జరగాలంటే కొన్ని భారీ పరిశ్రమలకు ప్రభుత్వం ధనసహాయంకూడా విరివిగా చేయాలి.

ప్రభుత్వం తనకు ఆర్థికంగా తోడ్పడుతుందని తెలిస్తే, భారీపరిశ్రమలను స్థాపించటానికి తాహతులేని వారుకూడా ముందుకు వచ్చి, తాము తమ స్వంతబాధ్యతపై స్థాపించగల వానికన్నా పెద్దపరిశ్రమలను స్థాపించి అభివృద్ధికి తోడ్పడతారు. పరిశ్రమలకు ఋణసహాయ సంస్థలు ప్రపంచంలో అన్ని పారిశ్రామిక దేశాలలోను వున్నవి. ఆ సంస్థను మనదేశంలో కూడా ఏర్పరచాలని చాలరోజులనుండి ఆలోచనలు జరుగుతున్నవి. దానికి సంబంధించిన చట్టం ఈసంవత్సరమే ప్యాసుచేసి, పరిశ్రమల ఋణసహాయ సంస్థను ఏర్పాటుచేశారు. ఈ సంస్థ ఇప్పుడిప్పుడే కార్యాచరణకు పూనుకుంటున్నది.

ఈ సంస్థ మూలధనం 5 కోట్ల రూ. లు బ్యాంకులు, భీమా కంపెనీలు, ఇన్వెస్టుమెంట్ ట్రస్టులు మొదలైన పెద్ద పెద్ద సంస్థలకే ఇస్తారు. ఈ మూలధనంపై నూటికి సాలుకు 2½ రూ. లు లాభానికి ప్రభుత్వం పూచీ వహిస్తుంది. సంస్థ నిర్వహణకు 11 గురు డైరెక్టర్లను ఎన్నుకుంటారు. వీరిలో మేనేజింగ్ డైరెక్టరును, ఇతర ఇద్దరు డైరెక్టర్లను కేంద్రప్రభుత్వము, ముగ్గురు డైరెక్టర్లను రిజర్వుబ్యాంకు, 5 గురను వాటాదారులు ఎన్నుకుంటారు. ఎప్పుడు ప్రభుత్వ డైరెక్టర్లకే మెజారిటీ వుండి, ప్రభుత్వ విధానాలే అమలు జరుగుతూ, ఈ సంస్థ ప్రభుత్వ సంస్థగా పనిచేస్తుంది. ఇది చాల గొప్ప సుగుణం. ఇటువంటి సంస్థలు వ్యక్తులచేతులలో వుండి ప్రైవేట్‌గా నిర్వహణ జరిగితే, ధన సహాయం పక్షపాతంతో జరిగి, పరిశ్రమాభివృద్ధిని కుంటు పరుస్తుంది. ఈ సంస్థ బ్రాంచీలు కలకత్తా, బొంబాయి, ఢిల్లీ, మద్రాసులలో స్థాపిస్తారు. మూలధనంపై నాలుగురెట్లు మొత్తం ఈసంస్థ ఋణపత్రాల ద్వారా అప్పు చేయవచ్చును. ఇది చాల తక్కువ మొత్తం. మూలధనము, రిజర్వుఫండులు కలిపి, వాటి మొత్తానికి 6, 7 రెట్లు మొత్తం ఋణం చేయటానికి అధికారం ఇవ్వవచ్చును. దీని లాభాలనుండి 'రిజర్వుఫండు'ను ఏర్పాటుచేయాలి. ఆ రిజర్వుఫండు మూలధనం మొత్తమంతకు పెరిగే వరకు మూలధనంపై డివిడెండు నూటికి సాలుకు 2½ రూ. లు మించరాదు.

భారీ పరిశ్రమలకు, 25 సంవత్సరాలలో కాబట్టుకునే ఏర్పాటుపై పెద్ద మొత్తాలను ఋణమివ్వటము, పెద్ద కంపెనీలు జారీచేసే షేర్ల అమ్మకానికి పూచీపడటము, వాటి బిల్లులు 'డిస్కౌంట్' చేస్తుండటము ద్వారా ఈ సంస్థ వాటికి తోడ్పడుతుంది. చిన్నచిన్న పరిశ్రమలకు ఈవిధంగా ఋణసహాయం చేయటానికి ప్రతి రాష్ట్రప్రభుత్వము ఒక్కొక్క పరిశ్రమల ఋణసహాయ సంస్థను స్థాపించవలసిందని కేంద్ర ప్రభుత్వం ఆదేశించింది. చాల రాష్ట్రాలలో అప్పుడే ఈ సంస్థలను ఏర్పాటుచేశారు కాని ఇంకా ఎక్కడా అవి పని ప్రారంభించలేదు. భారీపరిశ్రమలకు ఋణసహాయం చేయటానికి కేంద్రప్రభుత్వం ఏర్పరచిన సంస్థ ఈమధ్యనే మూలధనం వాటాలు జారీచేసింది.

దేశంలో పరిశ్రమలకుగల అవకాశాలను పరిశోధించి, వివరాలు తెలియజేసే సంస్థ ఒకటి స్థాపించి, పారిశ్రామిక వేత్తలకు సహాయపడితే పరిశ్రమాభివృద్ధి ఇంకా చురుకుగా జరుగుతుంది. పరిశ్రమల ఋణసహాయ సంస్థ పెద్దపెద్ద పెట్టుబడిదారులకు, కంపెనీలకు మాత్రమే గాక క్రొత్తగా వచ్చేవారికి, చిన్న కంపెనీలకు ఎక్కువ ధనసహాయము చేయాలి. తాము ధనసహాయం చేసే కంపెనీలు సరియైనవో లేదో పరిక్షించాలి. దేశ అభ్యున్నతికి ఎక్కువగా అవశ్యకమైన పరిశ్రమలకు ముందు సహాయం చేయాలి. ఈ సంస్థ డైరెక్టర్లు నిష్పాక్షికంగా ప్రతి దరఖాస్తును పరిశీలించి, న్యాయమార్గాన్నే అనుసరించాలి. అప్పుడు ఈ సంస్థ పరిశ్రమాభివృద్ధికి ఎక్కువ సహాయం చేయగలదు.

## 2. రిజర్వు బ్యాంకు

మనదేశ ఖజానా వ్యవహారాలను, ఆర్థిక వ్యవహారాలను రిజర్వు బ్యాంకు నిర్వహిస్తుంటుంది. చలామణిలో వుండవలసిన ధనము, వడ్డీ రేటు, విదేశ మారకము, ప్రభుత్వ నిలువలు, ఋణాలు, బ్యాంకులపై అధికారము మొదలగు ముఖ్య వ్యవహారాలన్నీ రిజర్వుబ్యాంకు అధీనంలో వుంటాయి. ధరలు పెరిగిపోకుండా వుండటం, ఆర్థికమాంద్యం

ఏర్పడకుండా చూడటం, ప్రభుత్వానికి కావలసినధనం సమకూరుస్తుండటం మొదలైన బాధ్యతలన్నీ రిజర్వు బ్యాంకు వహిస్తుంది. రిజర్వు బ్యాంకు నిర్వహణలో ప్రభుత్వానికి ఇప్పటికే ఎక్కువ భాగమున్నది. దాని గవర్నర్‌ను, డిప్యూటీ గవర్నర్‌లను, కొంత మంది డైరెక్టర్లను ప్రభుత్వమే నియమిస్తుంది. కాని కొంతమంది డైరెక్టర్లు వాటాదారులచేకూడా ఎన్నుకోబడి, ఎన్నుకోబడినవారందరూ పెట్టుబడిదారులై వుండి, కొన్ని ముఖ్యవిషయాలలో రిజర్వుబ్యాంకు నిర్ణయాలను తమ వర్గానికి అనుకూలం చేసుకుంటున్నారు. గత పుష్కరం నుంచి రిజర్వుబ్యాంకు వ్యవసాయదారులకు, సహకారోద్యమానికి ఎన్నతగిన సహాయం చేయలేకపోయింది; వాటికి ఎంతో సహాయం చేయటం దాని ఉద్దేశ్యాలలో ఒకటి. పారిశ్రామికాభివృద్ధి ఒక నిర్ణీతమైన ప్లానుప్రకారం చురుకుగా జరగాలంటే రిజర్వుబ్యాంకు కేవలం జాతీయదృష్టితోనే ప్రతివ్యవహారాన్ని పరిశీలించి, ప్రభుత్వానికి సహాయపడాలి; కాని దాని డైరెక్టర్లలలో పెట్టుబడిదారులుంటే అది నిష్పాక్షికంగా వారి సమస్యలను ఆలోచింపలేదు. కాబట్టి రిజర్వు బ్యాంకును ప్రభుత్వం ముందు వశపరచుకోవాలి. 1948 వ సం. సెప్టెంబరు 30 వ తేదీ తర్వాత, రిజర్వు బ్యాంకుకు పాకిస్థాన్‌కు సంబంధాలు పూర్తిగా తెగిపోయిన తర్వాత దానిని ప్రభుత్వం వశపరచుకోదలచిందని ఖజానా మంత్రి షణ్ముఖంచెట్టిగారు ఫిబ్రవరి 24 వ తేదీన ప్రకటించారు. వ్యక్తుల చేతులలోనున్న వాటాలను వాటి మార్కెట్ రేటుప్రకారం పరిహారం ఋణపత్రాల రూపంలో చెల్లించి ప్రభుత్వం వశపరచుకుంటుంది. రిజర్వు బ్యాంకు రూ. 100 ల వాటా ఇప్పుడు రూ 120 వరకు అమ్ముతున్నది.

మనదేశమంతటా అయిదారువందల బ్రాంచీలు వుండి, రిజర్వు బ్యాంకుకు అనుబంధసంస్థగా, పెద్దబ్యాంకుగా వున్న ఇంపీరియల్ బ్యాంకునుకూడా ప్రభుత్వం వశపరచుకుంటుంది. ఈ బ్యాంకు మన దేశంలో అత్యధిక భాగం వ్యాపారాన్ని నిర్వహిస్తున్నా ఇప్పటివరకు

మానేజిమెంటు అంతా విదేశీయుల చేతులలోనే వున్నది. ఇది ప్రభుత్వం చేతులలోనికి మారితే మన పరిశ్రమలకు, వ్యాపారాలకు ఎక్కువ సౌకర్యాలు, మన యువకులకు ఎక్కువ అవకాశాలు లభిస్తాయి. ఈ బ్యాంకుషేరులకు రూ. 500 ల వాటా ప్రస్తుతం మార్కెట్‌లో రూ. 1800 నుండి 2200 వరకు అమ్ముతున్నది. దీనికికూడా మార్కెట్ రేటుప్రకారం పరిహారం, ఋణపత్రాలరూపంలో యిస్తారు. దీనికి విదేశాలలో బ్రాంచీలు వున్నవి. వాటిని వశపరచుకునేవిషయమై ఇప్పుడు సంప్రదింపులు జరుగుతున్నవి.

ఇతరబ్యాంకులన్నీ ప్రైవేట్ మానేజిమెంటుక్రిందవున్నా ముఖ్యమైన ఈ రెండుబ్యాంకులు ప్రభుత్వపరంగా నడిస్తే, జాతీయప్రయోజనాలు చాల జాగ్రత్తగా కాపాడబడగలవు. వీటిని ప్రభుత్వం వశపరచుకోరాదని పెట్టుబడిదారులు ఆందోళన ప్రారంభించారుగాని తన నిశ్చయం మార్చుకోదలచలేదని ప్రభుత్వం వీరికి సమాధాన మిచ్చింది.

## 3. బహుళ ప్రయోజనాత్మక ప్రాజెక్టులు

పరిశ్రమలు నడపటానికి కావలసిన విద్యుచ్ఛక్తిని, అధికాహారోత్పత్తికి కావలసిన సాగుబడి సౌకర్యాలను ఏక కాలంలో సాధించగల ప్రాజెక్టులనుబహుళప్రయోజనాత్మకప్రాజెక్టులంటారు. పెద్దపెద్దనదులలో నీరు సముద్రంలోనికి వృధాగా పోకుండా అక్కడక్కడా ఆనకట్టలు కట్టి నీరు నిలువచేసి, దానిద్వారా విద్యుచ్ఛక్తిని తయారుచేస్తూ, ఆ నీటినే వ్యవసాయానికి సప్లయిచేస్తూ, రెండు విధాలుగాను నదీ జలశక్తిని ఉపయోగించటం ఎక్కువ లాభదాయకం. పరిశ్రమలకు కావలసిన విద్యుచ్ఛక్తిని తేలిక ధరలకు లభింపజేసి వాటి అభివృద్ధిని ప్రోత్సహించటము, నీటి పారుదల సౌకర్యాలు అభివృద్ధిచేసి, వ్యవసాయము, తద్వారా, అధికోత్పత్తికి తోడ్పడటము ఒకే పర్యాయం జరుగుతుంది. నదులపై వెల్లువలను అరికట్టుట, వాటిపై పెద్ద నౌకల రాకపోకలకు ఎల్లకాలము సరిపోయే నీటిసప్లయి ఏర్పాటు చేయుటకూడా ఈ ప్రాజె

ష్టులద్వారా సాధ్యపడుతుంది. ఇటువంటి బహుళ ప్రయోజనాత్మక ప్రాజెక్టుల నేకము నిర్మించటాని మన ప్రభుత్వాలు తలపెట్టివున్నవి. భవానీ, కృష్ణా-సంగమేశ్వరం, తుంగభద్ర, రామపాదసాగరం, కోసి, కోయ్నా, మాచిఖండ్, హీరాకుడ్, దామోదర్‌లోయ, బఖ్రా, సర్‌హింద్ మొదలైనవి అనేక ప్రాజెక్టులు ఆయారాష్ట్ర ప్రభుత్వాల ఆలోచనలలోనున్నవి.

అమెరికాలోని బౌల్డర్ డాం తరువాత రామపాదసాగర ప్రాజెక్టు ఆనకట్ట ప్రపంచంలోకల్లా పెద్దది అవుతుంది. దీనిని భద్రాచలంవద్ద గోదావరినదిపై నిర్మిస్తారు. ఇక్కడ ఆనకట్ట 428 అడుగుల ఎత్తుంటుంది. దీనివెనుక తట్టున నిలవవుండే నీరు కొన్ని చదరపుమైళ్ళు వ్యాపిస్తుంది. ఇందుకు కొన్నిగ్రామాలనే ఖాళీ చేయవలసివస్తుంది. దీని నిర్మాణం 12 ఏండ్లు పటుతుందనీ, ఇందుకు రూ. 86 కోట్లు ఖర్చవుతవనీ. దీనిద్వారా 2 కోట్ల 30 లక్షల ఎకరాలు సాగగుతుందనీ, 10,15 కోట్ల కిలోవాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పత్తి అవుతుందనీ, గోదావరినదిపై 170 మైళ్ళపొడుగున ఓడల రాకపోకలకు సౌకర్యం ఏర్పడుతుందనీ అంచనా వేస్తున్నారు. దీని అభివృద్ధిపట్ల విముఖతచూసే అధికార వర్గాల చేతిలో ఇది నలిగిపోతున్నది.

దామోదర్‌నది వరదలవల్ల బీహార్, బెంగాల్‌లలో పంటలు నష్టమవటమే గాక, కలకత్తా పట్టణానికి, రాకపోకల సౌకర్యాలకు ప్రమాదం తటస్థిస్తున్నది. ఈనదిపైన అక్కడక్కడ ఆనకట్టలు కట్టి విద్యుచ్ఛక్తి, నీటిపారుదల, రెండు సౌకర్యాలు సాధించటానికి నేరుగా కేంద్రప్రభుత్వమే పూనుకొని, ఒక కార్పొరేషన్ ఏర్పాటు చేసింది. ఇది అమెరికాలోని టి. వి. ఏ. పద్ధతిపై నడుస్తుంది. దామోదర్‌లోయ ప్రాజెక్టు మొత్తం 10 ఏండ్లలో, రూ., 55 కోట్ల ఖర్చుతో నిర్మాణం అవుతుందనీ, దీనివల్ల 7 లక్షల ఎకరాలకు నీటిపారుదల, 3½ లక్షల కిలోవాట్ల విద్యుచ్ఛక్తి లభిస్తుందని అంచనా వేశారు. దీనికన్న ఎన్నో రెట్లు పెద్దదైన రామపాదసాగరం నేరుగా కేంద్రప్రభుత్వం వశపరచుకోకపోవటం శోచనీయము.

# 4. నౌకాపరిశ్రమ

గత ఒకటిన్నర శతాబ్దాలనుండి భారతనౌకాపరిశ్రమ బ్రిటిష్‌వారి వారి పుణ్యమా అని నాశనమైపోయింది. ప్రాచీనకాలంనుంచి ఎంతో మహోచ్ఛస్థితిలోనున్న ఈ పరిశ్రమను పునరుద్ధరించి, భారతనౌకా-శక్తిని వృద్ధిపరచాలనీ, భారతదేశ వాణిజ్యమంతా మన నౌకలద్వారనే జరపాలని ప్రభుత్వం ఆతృతపడుతున్నది. గత ఒకటిన్నర శతాబ్దాలలో భారతదేశంలో నిర్మింపబడిన ప్రథమ నౌక 'జల ఉష'ను మార్చి 15 వ తేదీన పండిట్ నెహ్రూ జలప్రవేశం జరిపాడు. ప్రస్తుతం మన దేశంలో నౌకానిర్మాణ శాలలు 6 వున్నవి. వాటిలోకల్లా విశాఖపట్టణం నౌకా నిర్మాణశాల పెద్దది. ఈ 6 నౌకా నిర్మాణశాలలు కలసి ఇప్పుడు సంవత్సరానికి 10 వేల టన్నుల నౌకలు నిర్మించగలవు, 1950 వ సం. నకు ఇవి సాలుకు 50 వేల టన్నుల నౌకలను నిర్మించగలవు. మనకు అవుసరమైనంత పెద్ద నౌకలు, కావలసినన్ని వీనిలో నిర్మింపబడ గలిగే వరకు విదేశాలలోనే మనం నౌకలు ఖరీదు చేయాలి. ఇందుకు ప్రైవేటు వ్యక్తులకు ప్రభుత్వం తోడ్పడాలి. మనదేశంలో ఓడ కంపెనీల కన్నిటికి 1946 వ సం. జూన్ నాటికి $1\frac{1}{2}$ లక్షల టన్నుల నౌకలు వుండేవి. 1947 వ సం. జూన్ నాటికి $2\frac{1}{2}$ లక్షల టన్నుల నౌకలున్నవి. ఇంకా నౌకాలు కొనవలెనని ఈ కంపెనీలు ఆలోచిస్తున్నవి. ఇండియా - బ్రిటన్‌లమధ్య రవాణా నౌకాసర్వీసు ఫిబ్రవరి 3 వ తేదీన ప్రారంభమైంది. సింధియా కంపెనీవారి 'జల బాల' నౌక ఆ రోజున బొంబాయినుండి ప్రయాణమై బ్రిటన్ వెళ్ళింది. ఈ మధ్యనే వీరు రెండు 'ప్యాసింజరు' నౌకలనుకూడా ఈ దారికి మరల్చారు. భారతదేశ వర్తకము, రాకపోకలు భారత నౌకలద్వారానే జరుగగల శుభదినం త్వరలోనే వస్తుంది.

భారత నౌకాపరిశ్రమ త్వరగా అభివృద్ధిచెందటానికి ప్రైవేటు కంపెనీలకు తోడ్పడటానికి భారతప్రభుత్వ వాణిజ్య మంత్రి భాభా

నవంబరు 3 వ తేదీన ఒక పథకం ప్రకటించారు. మనదేశంలో రెండు మూడు 'నౌకా కార్పొరేషన్'లను ఏర్పరచి, ఒక్కొక్కటి 1 లక్ష టన్నుల నౌకలను నిర్వహించటానికి ఏర్పాటుచేసి, దానిలో నూటికి 51 వంతులు మూలధనము, తద్వారా మానేజిమెంటులో అత్యధిక భాగము ప్రభుత్వం వశపరుచుకుంటుంది. ఇప్పుడున్న ప్రైవేట్ కంపెనీలు ఒక్కొక్కటిగాని, సమూహాలుగాని ఆ కార్పొరేషన్‌లకు అనుబంధాలుగా జేరిపోయి, ఆ కార్పొరేషన్‌లను నిర్వహించాలి. ఇందుకు వాటికి తగిన ప్రతిఫలం ముట్టచెప్పతారు. ఈ విధానం ప్రకారం మేనేజిమెంటు బాధ్యత ప్రభుత్వం చేతులలోనేవున్నా, వాస్తవ నిర్వహణ అనుభవశాలురైన ప్రైవేట్ కంపెనీల చేతులలో వుండి, జాతీయ దృక్పథంలో, చక్కగా నిర్వహణ జరుగుతుంది. ఎక్కువభాగం మూలధనాన్ని ప్రభుత్వమే సరఫరాచేస్తుంది కాబట్టి ప్రైవేట్ వ్యక్తులకు స్థానం వుండకూడదని కొందరు వాదిస్తారు. వీటి నిర్వహణలో ప్రభుత్వాధికారులు అనుభవంపొందేవరకు ప్రైవేట్ కంపెనీలు నిర్వహిస్తుండటమే మంచిది. అయితే త్వరలోనే ఇవి పూర్తిగా ప్రభుత్వపరమై తీరవలసినదే.

## 5. అంతర్జాతీయ విమాన సర్వీసు

ఇంతవరకు భారతవిమాన కంపెనీలు మనదేశంలోనే రవాణా, రాకపోకల సర్వీసులు నిర్వహిస్తుండేవి. విదేశాలకు రవాణా, రాకపోకల సర్వీసులు విదేశకంపెనీల చేతులలో వుండేది. ఇంత పెద్దదేశం నేరుగా ఇతర విదేశాలతో విమానాలద్వారా రాకపోకలు జరపటానికి స్వదేశకంపెనీ లేకపోవటం గొప్ప లోపమేనని చెప్పాలి. దేశం స్వాతంత్ర్యమైనప్పటినుండీ ఇట్టి సర్వీసును స్థాపించాలని ప్రభుత్వం ప్రయత్నిస్తూనేవుంది. నవంబరునెలలో 'ఎయిర్ ఇండియా ఇంటర్నేషనల్' కంపెనీని స్థాపించి, దానిలో నూటికి 51 వంతులు వాటాలు, మానేజిమెంటులో అధిక భాగము ప్రభుత్వము వుంచుకుని, దైనందిన

నిర్వహణ తాతా కంపెనీకి వప్పజెప్పింది. తాతా కంపెనీవారు ఇదివరకే దేశంలో కొన్ని సర్వీసులు నిర్వహిస్తున్నారు కాబట్టి అనుభవశాలురైన నిపుణులను, చోదకులను, ఇతర మానేజింగ్ వ్యక్తులను సప్లయిచేసి, దీనిని బాగుగా నిర్వహించగలరనే ఉద్దేశ్యముతో ఇట్లుచేసిరి. బొంబాయి నుండి కైరోమీదుగా లండన్‌కు వీరు సర్వీసు ఈమధ్యనే ప్రారంభించారు. ఇతరమార్గాలలో కూడా త్వరలోనే సర్వీసులు ప్రారంభం కాగలవు. కొన్నాళ్ళయిన తర్వాత వీటిని పూర్తిగా ప్రభుత్వం వశపరుచుకుని, నిర్వహించవలెను.

## 6. శాస్త్రపరిశోధన

ఆధునిక నాగరికతాభివృద్ధికి శాస్త్రపరిశోధనలే మూలకారణము. ఒక దేశము శాస్త్రపరిశోధనలలో ఎంత ముందంజవేస్తే, అది పారిశ్రామికంగాను, ఆర్థికంగాను అంత అభివృద్ధిజెందుతుంది. బ్రిటిష్‌పాలనలో మనదేశంలో శాస్త్రపరిశోధనలకు ప్రోత్సాహము లభించలేదు. స్వతంత్ర భారతప్రభుత్వము శాస్త్రపరిశోధనలవిషయములో ఓ, న, మః దగ్గర నుంచి మొదలుపెట్టవల్సివచ్చినది. ఈశాఖ ప్రాముఖ్యతను గమనించి ప్రధాని నెహ్రూయే స్వయముగా దీనిని నిర్వహిస్తున్నాడు. ఆయా విషయాలలో పరిశోధనలు జరపటానికి మనదేశంలో పెద్దపెద్ద లేబొరెటరీస్ (పరిశోధనాలయాలు) స్థాపించటానికి ప్రభుత్వం నిశ్చయించింది. నేషనల్ ఫిజికల్ లేబొరెటరీస్, నేషనల్ కెమికల్ లేబొరెటరీస్, నేషనల్ గ్లాస్, సిరమిక్ రిసెర్చి ఇన్‌స్టిట్యూట్, ఫ్యూయల్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్‌లు ఇప్పటికి స్థాపించారు. ఎలక్ట్రో కెమికల్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్‌కు మొన్ననే పండిట్ నెహ్రూ శంఖుస్థాపనచేశాడు. లెదర్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్, రోడ్ రీసెర్చ్ ఇన్‌స్టిట్యూట్, బిల్డింగ్ రీసెర్చ్ ఇన్‌స్టిట్యూట్‌లు ఇంకా స్థాపించాలి. మనదేశపు మందుల గుణాలను పరిశీలించేటందుకు, క్రొత్తరకపు మందులను కనిపెట్టేటందుకు డ్రగ్ రిసెర్చి ఇన్‌స్టిట్యూట్ ఏర్పాటుచేస్తున్నారు. మనదేశంలో

పుష్కలంగా లభించే తక్కువరకపు బొగ్గునుండి పెట్రోల్ తీసే విధానాన్ని పరీక్షించటానికి ఒకసంఘము, మనదేశంలో పెట్రోల్ గనులు ఎక్కడైనా వున్నవేమో పరిశీలించేందుకు ఒకసంఘము గత మార్చి నెలలో ఏర్పాటుచేశారు. ఏటం పరిశోధనాలయాలు మనదేశంలో కలకత్తాలో రెండు, బొంబాయిలో ఒకటి వుంది. ఏటంకు సంబంధించిన పరిశోధన అంతా ప్రభుత్వపరంగానే జరగటం అవుసరం. ఏటం పరిశోధనకు కావలసిన సామగ్రి ప్రభుత్వం తప్ప మరెవ్వరూ కొనలేరు. ఏటం పరిశోధనపైన యాజమాన్యం వహించటానికి ఏటం పరిశోధనలో వుపయోగించే తోరియం, యురేనియం, ప్లుటోనియం, నెప్ట్యూనియం మొదలైనవాటి ఉత్పత్తి, ఉపయోగము కంట్రోల్ చెయ్యటానికి అధికారం పుచ్చుకుంటూ ఈమధ్యనే కేంద్రశాసనసభ ఒక శాసనం చేసింది.

నిర్మాణాత్మక కార్యక్రమం భారతప్రభుత్వం విస్మరించలేదు. అందుకు చాల సంస్థలను, స్కీములను ప్రభుత్వం ఆచరణలోకి తెస్తున్నది. కాని అవి జరుగవలసినంత త్వరగా జరగటంలేదు. అనేక సంస్థలు ఇంకా కార్యరంగంలోనికి రానేలేదు. మనదేశంవంటి పెద్దదేశానికి ఇప్పుడు స్థాపిస్తున్న కేంద్రాలుకూడా ఏమాత్రము చాలవు. ప్రస్తుతం ప్రభుత్వం చేస్తున్నదల్లా కొంత అనుభవం సంపాదించటము, ఉత్తరోత్రా అభివృద్ధికి చక్కని పునాదు లేర్పరచటము. ఇకముందైనా ఈకృషి చురుకుగా జరుగవలెను.



# గాంధీజీ

స్వతంత్ర భారతదేశంలో తొలిసంవత్సరంలో జరిగిన సంఘటనలలో భారతప్రజల మనస్సులను కలతపెట్టినది గాంధీజీ నిర్యాణము. భారతదేశములోనే కాదు ప్రపంచములో కూడా కొన్ని శతాబ్దముల నుండి ఆయనవంటి మహావ్యక్తి జన్మింపలేదు. ఆయనలీలలన్నియు మన కట్టెదుటనే జరిగియుండటంవలన ఆయన మహాత్మ్యమును, దానివల్ల గొప్పఫలితములను పొందిన మనమే సరిగా గుర్తింపలేకపోతిమి. ప్రపంచచరిత్రలో - చరిత్రకందనికాలపు వ్యక్తులైన రాముడు, కృష్ణుడు మొదలగు అవతారాలను మినహాయిస్తే - బుద్ధుడు, క్రీస్తు ఇద్దరే ఆయనకు సరిపోలిన వ్యక్తులు. వాస్తవానికి, వారిద్దరు అర్ధాంతరంలో దిగవిడిచిపోయిన కార్యక్రమాన్ని పూర్తిచేసి, ఆధునిక యంత్రజాలంలో పడి దారి తెన్నుగానలేక వ్యథపడుతున్న ప్రపంచానికి మార్గోపదేశం చేయటానికే ఆయన అవతరించాడు.

ఆయన ఒకనూతన మతం స్థాపించదలచలేదు. తానొక ప్రవక్త నౌదామని ప్రయత్నించను కూడాలేదు. సర్వమూ తనకు తెలుసునని ఎన్నడూ చెప్పలేదు సరి కదా మనస్సులోనైన భావించి వుండలేదు. తన వ్యక్తిగత గొప్పతనానికి, హోదాకు ఆయన ఎన్నడూ పాటుపడ లేదు. తన సోదర ప్రజలలో అతి సామాన్యుడైన సామాన్యునికన్నా సామాన్యుడుగా జీవించి, వారితోపాటు ఆ కష్టసుఖాలను అనుభవించి, వారిమేలుకు తన చేతనైనంత సహాయం చేయటమే ఆయన లక్ష్యము. ఆయన కార్యాగారంలోనికి సత్యము, అహింస అనే రెండు తప్ప ఏ ఇతర సామగ్రితోను ప్రవేశించలేదు. శరీరబలమునకు కేవల వ్యతిరిక్తముగా నున్న తన బుద్ధిబలముతో, ఆయాపరిస్థితులకు తగినట్లు, నూతన విధానా లను సృష్టిస్తూ ప్రపంచం ఇదివరకెన్నడూ కని, విని ఎరుగని నవ్య రాజకీయసిద్ధాంతాన్ని ఆయన ఊహించి, పరీక్షించి, సరిచేసి, ప్రసాదించి

నాడు. ఇంతవరకు కేవలము మత, ఆధ్యాత్మిక విషయాలలోనే అను సరింపబడుతున్న అహింసను రాజకీయాలకు అనువదించి, ఒక నూతన ఆర్థిక రాజకీయ సిద్ధాంతమును ఆయన జయప్రదముగా ఉపయోగింప గలిగెను. సంఘ సంస్కరణ, సాంఘికాభ్యున్నతి, సామాజిక న్యాయము, సర్వమానవ సౌభ్రాతృత్వము, ప్రపంచశాంతి, కళ్యాణము ఆయన రాజకీయ సిద్ధాంతములో సమ్మేళన మొనర్పబడిన భాగములు. కల్లోలితము, వినాశాత్మకము, విద్వేషకరమునైన పాశ్చాత్య ప్రపంచమునకు శాంతి, పురోభివృద్ధి ప్రసాదింపగలవి ఆయన సిద్ధాంతములు మాత్రమే నని ప్రపంచ మిప్పుడిప్పుడే గ్రహిస్తున్నది.

ఆయన గుణగుణములను ఏకరువుపెట్టుట ఎవ్వరును సంతృప్తి కరముగా చేయజాలని పని. ప్రపంచ మెరిగిన కొద్దిమంది యుగపురుషు లలో ఆయన ఒకడు. ఆయన నన్నివిధముల గమనించుటకు నోచుకున్న మనము ఆయనను గురించి ఏమి భావించినను, ముందుయుగముల పురు షులు ఆయన లీలామానుష విగ్రహుడని, ఏకాదశావతారపురుషుడని, కారణజన్ముడని ఆయన నూహించి, పూజింపకపోరు.

ఆయన స్వతంత్ర భారతపిత, నవభారతభాగ్యవిధాత, భారతీయు లకు జాతీయజీవనదాత. అట్టి మహాపురుషుని మనకండ్లఎదుటనే కొంద రున్మాదులుకూడి హత్యచేసిరి. రత్నము, మసిబొగ్గు ఒకేగనిలో ప్రక్క ప్రక్కనే ఉద్భవించినవి. తమ మహాపురుషునిపై తమవాడే అకృత్యము జరిపినందుకు భారతజాతి సిగ్గిలినది, శోకించినది. ఈ మహారత్నము తిరిగి ఇక ఈ శతాబ్దములో, మరి 10 శతాబ్దములలో, ఈ ప్రపంచములో, అందులో, ఈదేశములో ఉద్భవించునా!

ఆయన మృతికి మనమే కాదు; ప్రపంచమే విషణ్ణమైపోయినది. ఆయనతో వ్యక్తిగతముగా పరిచయమున్నవారేకాదు; ఆయన దర్శన భాగ్యము పొందినవారే కాదు, ఆయన సూక్తులను చదివి, గ్రహించి, తన్మయులై దాసోహమనినవారే కాదు, ప్రపంచములో జ్ఞానమున్న మానవమాత్రులందరు ఆయన మృతితో తమ ఆత్మమిత్రుని కోల్పోయినట్లు కలత చెందినారు,

ఇప్పుడు ఈ దేశములోనే కాదు, భవిష్యత్తులో ఎల్లప్పుడూ ప్రపంచమంతటా ఆయనసూత్రములు, బోధనలు సూక్తులవలె, వేద వాక్కులవలె, శిరోధార్యములై చిరస్థాయి గాంచగలవు. ఇంతకన్న ఆయనకు స్మృతిచిహ్న మేమికావలెను? తనకు స్మృతిచిహ్నమూ యనయే నిర్మించుకుపోయినాడు. ఆయనబోధనలను, సూత్రములను అనుసరించుచు, ఆచరింపుచు ఆయన స్మృతిచిహ్నమును శోభాయమాన మొనరించుటయే మనము చేయగలిగినపని; మనము చేయవలసినపని. ఆయనమార్గముల ననుసరించి, ఈ ప్రపంచము నావహించివున్న విద్వేష వినాశాత్మక గాఢాంధకారమును శాంతి, అభ్యుదయ సూర్యరశ్మిచే పటాపంచ లొనర్చి, జీవితకాలమునకన్న తదనంతరముననే ఆయనను మిక్కుటముగ గౌరవించి, ఈ దేశములో జన్మించినందుకు ఆయన ఋణమును తీర్చు కొనుట మన బాధ్యత !



# కాంగ్రెస్ రాజకీయాలు

ప్రపంచంలో 5 వ వంతు జనాభాను పోషిస్తూ, అతిప్రాచీనము, చారిత్రికము, ప్రాముఖ్యమునైన ఒకదేశానికి, ఇంకే ఇతర సంస్థ అనుసరింప సాహసింపని శాంతియుత, అహింసా విధానాల ద్వారా విదేశ పరిపాలననుండి విముక్తి సాధించిన సంస్థయని కాంగ్రెస్ చరిత్రలో చిరకాలము శ్లాఘింపబడుతుండగలదు. ప్రతిదేశంలోను రాజకీయ సంస్థ లుంటవి; దేశాభ్యుదయానికి పాటుపడటమే వాటి లక్ష్యమైవుంటుంది. కాని ఏ దేశంలోను ఏ సంస్థకూడా కాంగ్రెస్‌వలె వినూత్నమార్గాల ద్వారా అచిరకాలంలోనే తన లక్ష్యాన్ని సాధించగలగటంగాని, ఒక క్రొత్త రాజకీయపంథాను సృష్టించి, ఆచరించి, జయమొంది ప్రపంచ రాజకీయతత్వ చరిత్రలో మహోన్నత స్థానాన్ని పొందగలగటంగాని జరగలేదు. మనదేశ స్వాతంత్ర్యంకోసం బ్రిటిష్ పాలకులతో పోరాడ టానికి కాంగ్రెస్ ప్రజాబాహుళ్యంనుంచి ఏర్పరచిన 'శాంతియుత పోరాటకసైన్యం' క్రమశిక్షణలో, త్యాగపటిమలో, ధైర్యసాహసాలలో ఏదేశ సైన్యాలకైనా తలదన్నేదిగా పనిచేసింది. ఈ శాంతియుత పోరాటకసైన్యానికి ఆధ్వర్యంవహించిన మహానాయకుడు, ఏకకాలంలో మహాప్రవక్తగా, శాంతిదూతగా, రాజకీయ దురంధరుడుగా, చతురసేనా నాయకుడుగా పేరుగాంచి, ప్రపంచ మహాపురుషులలో అగ్రశ్రేణిలో విశిష్టస్థానాన్ని పొందగలిగాడు.

గత 60 ఏండ్లనుండి భారతదేశ రాజకీయ స్వాతంత్ర్యమే కాంగ్రెస్ ఏకైక లక్ష్యంగా వుండేది. ఆ లక్ష్యం సిద్ధించటంతో, కాంగ్రెస్ భవిష్యత్తును గురించి ప్రశ్న లుదయించాయి. స్వాతంత్ర్యసము పార్జనకోసం భారతీయులందరు, ఇతర విభేధా లెన్ని వున్నప్పటికీ కాంగ్రెస్‌ను ఇంతకాలము అనుసరించారు. కాని స్వాతంత్ర్యం లభించిన తర్వాత భారతదేశ అభ్యున్నతికి అనుసరించవలసిన పంథాను గురించి

వీరిలో వీరికి తీవ్ర భేదాభిప్రాయాలు మొదటినుండీ లేకపోలేదు. స్వాతంత్ర్యం లభించినతర్వాత తమ విధానంప్రకారం దేశాభ్యున్నతికి పోటుపడాలని ఎవరికివారే ఉబలాటపడటం సహజమే. అందువలన కాంగ్రెస్ ఇకమీదట వీరినందరని కలిపి కట్టుకురాలేక, చిన్నాభిన్నమై పోయి పూర్వ ప్రతిష్టకే భంగం తెచ్చుకుంటుంది. కాబట్టి స్వాతంత్ర్య సముపార్జన తర్వాత కాంగ్రెస్‌ను రద్దుపరచి, ఎవరికి నచ్చినట్లు వారు ఇతర రాజకీయ పార్టీలలో జేరి దేశాభ్యున్నతికి కృషిచేయుట మంచిదని మొదట్లో భావించారు. ఆగస్టు 15 వ తేదీ తర్వాత కాంగ్రెస్ రద్దయి పోగలదనే చాలమంది ఆశించారు. కాంగ్రెస్‌లో కొందరు వేరొక విధంగా ఆలోచించారు. దేశానికి స్వాతంత్ర్యం లభించినా, కొంత భాగం విడిపోతోంది. ప్రపంచ పరిస్థితులు ఆనాటి కానాడు విషమించి పోతున్నవి. భారతదేశానికి విదేశాల దాడి ప్రమాదం ఇదివరకటికన్న ఇప్పుడెక్కువైనా సైనికంగాను ఆర్థికంగాను భారతదేశం బలహీనమైన దేశం. ఆటువంటి క్లిష్టపరిస్థితిలో భారతదేశ నాయకులు-ఇప్పటివరకు ఏకోన్ముఖంగా కృషిచేసినవారు - ఇప్పుడు వేర్వేరు పంధాలలోకి దిగితే దేశం ఆవుసరమైనంత చురుకుగా అభివృద్ధిపొందలేక ఎక్కువకాలం బలహీనంగానే వుండిపోతుంది. అది దేశానికిగాని, దానికి స్వాతంత్ర్యం సంపాదించిన కాంగ్రెస్‌కుగాని ప్రతిష్టాకరం కాజాలదు. కాంగ్రెస్ లక్ష్యాలలో ప్రధానమైన రాజకీయ స్వాతంత్ర్యం లభించినా దేశానికి ఆర్థికస్వాతంత్ర్యం, ప్రజలలో ఆర్థిక సమత, సామాజికన్యాయము ఇంకా సాధించవలసివుంది. స్వాతంత్ర్యం సముపార్జించిన కాంగ్రెసే ఇదివరకటి ఐక్యతతోనే వీటినికూడా సాధించి, భారతప్రజలకు ఇతోధిక సేవచేయాలి. కాంగ్రెస్ రద్దయిపోకుండా ఇదివరకటికన్న ఎక్కువ ఐక్యతతో తీవ్రంగా కృషిచేయటం అవుసరం. కాంగ్రెస్ సంస్థను రద్దుచేయకూడదు అని వీరు వాదించారు. కాంగ్రెస్ అగ్రనాయకులకు ఈ వాదనలువచ్చి కాంగ్రెస్‌ను కొనసాగించటానికే వారు నిశ్చయించారు; ఆనిర్ణయాన్ని గాంధీజీ హర్షించారు. దేశంలో కాంగ్రెస్

శాఖలన్నీ ఈ నిర్ణయాన్ని ఆమోదించాయి. వీరి దృక్పథంలో ఒక ప్రాథమికమైన పొరపాటువుంది. భారతదేశ ఆర్థికాభ్యున్నతి ఏపంథా ప్రకారము జరుగాలనువిషయముపై కాంగ్రెస్ వాదులలోనే తీవ్ర భేదాభిప్రాయము లున్నవి. వీరందరికి సంతృప్తికరమగు రాజీమార్గము ఎన్నటికి కుదరదు. స్వాతంత్ర్యసముపార్జన అనే ఏకలక్ష్యమే ఇన్నాళ్ళు కాంగ్రెస్‌వాదులలో ఐక్యతను కూర్చింది. దానిసాధన పంథానుగురించి వారిలో విభేదములున్నా రాజీ తేలికగానే కుదిరింది. దేశ ఆర్థిక వ్యవస్థానిర్మాణము అట్టి లక్ష్యము కాదు. స్వాతంత్ర్యము ఫలము; ఆర్థిక వ్యవస్థా నిర్మాణము ఆ ఫలానుభవము. ఫలమును సాధించువరకు అందరు ఒకటిగా కృషి చేయవచ్చును కాని దానిని పొందిన తర్వాత ఎక్కువభాగ మనుభవించవలెనని ఎవరికివారే ఉబలాటపడెదరు. ఒకవేళ వీరినందరిని ఏదో ఒకవిధముగ కలిపికట్టుకు వచ్చినా అది అతుకుల బొంతగావుండి కాంగ్రెస్ గతప్రతిష్ఠకు, ప్రస్తుత హోదాకు భంగము కలిగిస్తుంది. కాలముగడిచినకొద్దీ ఈ సత్యము సుబోధితమై, కాంగ్రెస్‌ను ఆదిలోనే రద్దుపరచిన్న బాగుండెడిదని అనిపించకపోదు.

రాష్ట్రాలలోను, కేంద్రంలోను అధికారం కాంగ్రెస్ హస్తగతం కాగానే కాంగ్రెస్‌వాదులలో పెద్దమార్పు వచ్చింది. ఇన్నాళ్ళనుండి తాము పాటుపడుతున్న లక్ష్యం ఇప్పుడు సిద్ధించింది. కాబట్టి దానిని పూర్తిగా స్వప్రయోజనాలకొరకు ఉపయోగించుకోవాలనే ఆశ, అల్లా ఉపయోగించుకోవటం సమంజసమేననే భావము, వారిలో కలిగాయి. ఇల్లాంటి భావాలు ఏర్పడటంవల్ల వారు పరిపాలన నిష్పక్షపాతంగాను, న్యాయయుతంగాను జరుపలేక అవినీతికి, అన్యాయానికి పక్షపాత ప్రదర్శనకి పాలుపడి, ప్రజలలో పలుకుబడి పోగొట్టుకుంటున్నారు. రెడ్-టేపిజం, ఉద్యోగాలకు ప్రాకులాడటం, అవినీతి, లంచగొండితనం బ్లాక్‌మార్కెటింగ్, అధికలాభాపేక్ష బ్రిటిష్‌పరిపాలనసమయంలోవలెనే ఇప్పుడుకూడా వ్యాపించివున్నాయని కాంగ్రెస్ అధ్యక్షపదవినుండి విరమిస్తూ ఆచార్యకృపాలనీకూడా విమర్శించాడు. కాంగ్రెస్‌నాయకులు

ప్రతివిషయంలోను పురోగమనశీలురుగా కబుర్లుచెప్పినా, వారి వ్యవహార ధోరణి విశీర్ణమైనపూర్వకాలపుపద్ధతులను జ్ఞాపకంచేస్తున్నది. కాంగ్రెస్ సంస్థ పేరుకు ప్రజాస్వామికసంస్థ అయినా అధికారమంతా అగ్రనాయకులచేతులలోవుండి, ఎ. ఐ. సి. సి మహాసభ వారెట్లా ఆడమంటే అట్లా ఆడుతున్నది. ప్రభుత్వోద్యోగాలు, ఇతరపదవులు కూడా వారి అనుయాయులకే, వారికటాక్షం మూలంగానే పంపకమైపోతున్నాయి. శాసనసభలన్నింటిలోను కాంగ్రెస్‌వాదులు అత్యధిక మెజారిటీలో వుండటంవల్ల కాంగ్రెస్ నాయకులు తలుచుకున్నదల్లా జరిపివేస్తున్నారు. వాస్తవానికి ఈ శాసనసభలకు ఎన్నికలు స్వాతంత్ర్యసముపార్జనకుపూర్వం జరిగాయి. దేశానికి స్వాతంత్ర్యం సంపాదించటమనే ముఖ్యకార్యనిర్వహణకే ఈ శాసనసభ్యులు ఎన్నుకోబడ్డారు. దేశానికి స్వాతంత్ర్యం లభించి, ఆర్థిక వ్యవస్థ నిర్మింపబడవలసివస్తుందని ఆనాడు ఆలోచనేలేదు. ప్రస్తుత శాసనసభలను రద్దుచేసి, క్రొత్తగా ఎన్నికలు జరిపితేగాని, ప్రజలు ఎటువంటి ఆర్థికవ్యవస్థను కోరుతున్నారనేవిషయంగాని ప్రస్తుత శాసనసభ్యులు ప్రజాప్రతినిధులేనా అనేవిషయంగాని స్పష్టపడదు.

అధికారం చేజిక్కించుకున్న కాంగ్రెస్‌వారు దానిని వదలుకోదలచలేదు. ఇప్పుడిప్పుడే పైకివస్తున్న నాయకులు, కాంగ్రెస్ నురద్దుచేస్తే తాము మళ్ళీ మొదటినుంచి ప్రారంభించవలసి వస్తుందేమోనన్న భయంతో కాంగ్రెస్‌ను రద్దుపరచకుండా వుంచి, దానిసహాయంతో తాము పైకిరావాలని అభిలషించారు. అధికారంలోవున్న వారు దానిని కాపాడుకోటానికీ, తక్కినవారు ఏదో ఒకవిధమైన పదవులు సంపాదించటానికీ తాపత్రయపడుతూ, దేశం ఎదుర్కొంటున్న ముఖ్య సమస్యలను విస్మరించారు. కాంగ్రెస్‌వారు మంత్రులైనా ప్రభుత్వ పద్ధతులేమి మారకపోగా, మరింత చెడిపోయాయి. సామాన్యంగా అధికారం మానవుడిని అవినీతిపరుడిని చేస్తుంది; కాని కాంగ్రెస్‌లో, అధికారం లభించే అవకాశమే అవినీతిపరులను చేయ ప్రారంభించింది.

స్వాతంత్ర్యం లభించిన తర్వాత తాము వక్రమార్గాన్నవలంబిస్తున్నామనీ, కాంగ్రెస్ సంస్థలో ఇదివరకటినుండి వున్నక్రమశిక్షణ

త్వరత్వరగా సడలిపోతున్నదనీ కొంతమంది కాంగ్రెస్‌వాదులు గ్రహించారు. ఇదే కాంగ్రెస్ సంస్థ - కాంగ్రెస్ ప్రభుత్వాల సంబంధాలనే సమస్యపై వెల్లుబికివచ్చి, కాంగ్రెస్ అధ్యక్షుడు ఆచార్యకృపాలనీ రాజీనామాకు దారితీసింది. కాంగ్రెస్ అధ్యక్షుడు గత మూడుదశాబ్దాల నుండి భారతదేశ ప్రధానపౌరుడుగా పరిగణింపబడుతున్నారు. ఆతడు భారతదేశానికి అనధికార ప్రభువుగా గౌరవింపబడుతుండేవాడు. కాంగ్రెస్ కార్యవర్గము దేశమునకు అనధికారమంత్రివర్గముగా భావింపబడుతుండేది. కేంద్రంలో కాంగ్రెస్ ప్రభుత్వం అధికారంలోనికివచ్చి, కాంగ్రెస్ మహానాయకులందరు దానిలో స్థానాలాక్రమించుకున్న తర్వాత వారే కాంగ్రెస్ అధ్యక్షుని, కార్యవర్గాన్ని న్యూనతపరచటం ప్రారంభించారు. ప్రస్తుతం కేంద్రప్రభుత్వంలో వున్నవారు ప్రజలు ఎన్నుకున్న ప్రతినిధులు కారు; అధిక సంఖ్యాకులగు ప్రజలచే అనుసరింపబడుతున్న కాంగ్రెస్ ప్రతినిధులు మాత్రమే. అంటే, వీరి చర్యలకు ప్రజలకు వీరు గాక కాంగ్రెస్‌సంస్థ బాధ్యత వహిస్తున్నదన్న మాట! కేంద్రప్రభుత్వంలో ఏదైనా తప్పు జరిగితే దానికి ప్రజలకు జవాబుచెప్పకోవలసినది కాంగ్రెస్‌గాని మరొకరు కాదు. కాంగ్రెస్ ప్రతినిధులుగా కేంద్రప్రభుత్వంలో తాము వుంటున్నప్పుడు, కాంగ్రెస్ ఆదేశాలను పూర్తిగా శిరసావహించటమేగాక, ముఖ్యమైన అన్ని విషయాలపైనను ముందుగా కాంగ్రెస్ కార్యవర్గ అనుమతినిపొంది ఒక నిర్ణయానికి రావలసిన బాధ్యతకూడా కేంద్రమంత్రివర్గపై వుంది. లేకపోతే, ప్రభుత్వచర్యలను కాంగ్రెస్ ప్రజలలో ఎందుకు సమర్ధిస్తుంది? సామాన్యంగా ఏదేశంలోనైనా ఏరాజకీయపక్షంలోనైనా శాసనసభ్యులు, మంత్రులుకూడా తమపార్టీ ఆదేశాలను అనుసరిస్తారు. పార్టీ క్రమ శిక్షణకు కట్టుబడి వుంటారు. ఇందులో వ్యక్తిగత ప్రశ్నలకు, చిన్నపెద్ద తారతమ్యతలకు తావులేదు. కాంగ్రెస్ అధ్యక్షపదవి ప్రతిష్ట దానిని ఆక్రమించినవ్యక్తి ప్రతిష్టపై ఆధారపడి వుండదు; అది స్వతః అతి ప్రతిష్టాకరమైనపదవి. దీని నాక్రమించినంగువల్ల, ఆ-

మించిన వ్యక్తికే గౌరవం కలుగుతుందిగాని వ్యక్తివల్ల పదవికి గౌరవం రాదు. కాని ఈ మూలసూత్రాన్ని కాలదన్ని, కేంద్రంలోని కాంగ్రెస్ నాయకులు కాంగ్రెస్ అధ్యక్షుని, కార్యవర్గాన్ని నిర్లక్ష్యంచేసి, తమ ఇష్టంవచ్చినట్లు వ్యవహరించారు. తాము మహానాయకులే కావచ్చును; ప్రస్తుతం అధ్యక్షపదవి నాక్రమించినవాడు తమ ముందు కుర్రవాడే కావచ్చును. తాము నిర్లక్ష్యము చేస్తున్నది, అగౌరవపరుస్తున్నది వ్యక్తిని గాక పదవినని జ్ఞాపకం వుంచుకుంటే ఈ పొరపాటు జరిగి వుండేదే కాదు. ఒకపర్యాయం పొరపాటు జరిగినా దానిని సరి జేసుకోవచ్చును. కాని కేంద్రప్రభుత్వంలోని కాంగ్రెస్ సభ్యులు ఈ పనికూడా చేయలేదు. కాంగ్రెస్ కార్యవర్గానికి, కేంద్రప్రభుత్వానికీ వుండవలసిన సంబంధాలను గూర్చి తీవ్రభేధాభిప్రాయాలు వచ్చాయి. ఈ అభిప్రాయభేధాలు పండిట్ నెహ్రూ, సర్దార్ పటేల్ వంటి వారివల్ల రావటము మరీ శోచనీయము. ఈనాడు కృపాలనీ అధ్యక్షుగా వుండగా 'నీవెంత' అని నెహ్రూ ఆయనను నిర్లక్ష్యం చేయవచ్చును. కాని ఈ సాంప్రదాయాన్ననుసరించే రేవు నెహ్రూ అధ్యక్షుడుగానున్నప్పుడు ఇంకొకడు 'నీవెంత' అనకూడదా? తాను మహానాయకుడైనంత మాత్రాన కాంగ్రెస్ అధ్యక్షునే నిర్లక్ష్యం చేయవచ్చునా? క్రమశిక్షణ కాపాడటం మహానాయకుని కర్తవ్యము కాదా? దురదృష్టవశాత్తు ఎ. సి. సి. సి. సభ్యులు సంస్థకన్న వ్యక్తికే ఎక్కువ ప్రాముఖ్యత ఇచ్చారు. 60 ఏండ్లు, అనేకులు దేశభక్తులు తమ రక్తాన్ని ధారపోసి, స్వాతంత్ర్యాన్ని సంపాదించటానికి వారిని ఉత్తేజితులను చేసిన కాంగ్రెస్ సంస్థకంటె పండిట్ నెహ్రూ ఒక్కడే ఎక్కువ అని వారభిప్రాయపడ్డారు. కాంగ్రెస్ వాదులలో ప్రబలిపోయిన అధికార వ్యామోహమే ఇందుకు కారణం. తమ అధికారతృష్ణను తీర్చుకోటానికి కాంగ్రెస్‌ను చేయూతగానిలబెట్టుకుని దానిప్రతిష్ట మంటిపాలుజేశారు.

భారతదేశం స్వాతంత్ర్యమైన తర్వాత ఏ. ఐ. సి. సి. ప్రధమ పర్యాయం నవంబరునెల 15వ తేదీన న్యూఢిల్లీలో సమావేశమైంది.

ఇది రహస్య సమావేశం. ఈ సమావేశంలోనే ఆచార్యకృపాలనీ అధ్యక్షపదవికి రాజీనామా నిచ్చాడు. కాందిశీకులపట్ల, ముస్లింలీగ్ పట్ల, ప్రభుత్వోద్యోగులపట్ల కేంద్రప్రభుత్వం ప్రదర్శిస్తున్న వైఖరిని, కాంగ్రెస్ ప్రభుత్వాల వ్యవహారధోరణిని ఈయన నిశితంగా విమర్శించాడు. కేంద్రప్రభుత్వంలోని కాంగ్రెస్ మంత్రులు తనను న్యూనత పరుస్తున్నందువలననే తాను రాజీనామా నిస్తున్నాననికూడా ఆయన స్పష్టపరిచాడు. ఈసమావేశంలో ఆయన చేసిన ఉపన్యాసము ఆగస్టు 15 వ తేదీ తర్వాత కాంగ్రెస్‌లో జరిగిన, చెప్పుకోతగిన ఏకైక సంఘటన. కాంగ్రెస్‌లో అప్పుడు వాస్తవముగా ఒక విషమస్థితి ఏర్పడినది. మహానాయకులందరు ఆచార్య కృపాలనీ కదల్చిన సమస్యకు 'ఔ' ననీ 'కా'దనీ సమాధానం చెప్పలేని సందిగ్ధావస్థలో పడిపోయారు. చిట్టచివరకు, కాంగ్రెస్ కార్యవర్గానికి కేంద్రప్రభుత్వానికి వుండాలసిన సంబంధాలను స్పష్టపరచటం మానివేసి, ఆచార్య/కృపాలనీ స్థానే డా. రాజేంద్ర ప్రసాద్‌ను అధ్యక్షునిచేసి, ఈ సంకటస్థితినుండి బైటపడ్డారు, ఇటువంటి సమస్యలను అంతగా పట్టించుకోకుండా, చూసీచూడనట్లు తాను వ్యవహరిస్తూ, అటు కార్యవర్గాన్ని, ఇటు కేంద్రప్రభుత్వాన్ని కలిపి కట్టుకురాగల సమర్థుడాయన. పండిట్ నెహ్రూ, సర్దార్ పటేల్ లకు వ్యక్తిగతముగా కూడ ఆయనయందు గౌరవముమెండు. అందువలన ఈ సమస్య అప్పటికి అడుగున పడిపోయింది. కాని అది ఎప్పటికైనా తిరిగి తలఎత్తక మానదు, ఇటువంటి ప్రాథమిక సమస్యలను ముందే పరిష్కరించుకుని, సాంప్రదాయాలు ఏర్పరచుకుంటే కాంగ్రెస్ సంస్థ క్రమశిక్షణ చెడకుండా వుండేది. అట్లాజరుగకుండా, సమస్యను ముఖాముఖిగా ఎదుర్కొని పరిష్కరించకుండా కప్పదాటు వేయటంవల్ల భవిష్యత్తులో పెద్ద ప్రమాదానికి అవకాశం యిచ్చినట్లవుతున్నది. ఈ ఎ. ఐ. సి. సి. సమావేశంలో జరిగిన ముఖ్యనిర్ణయం ఇది ఒక్కటే.

భారత స్వాతంత్ర్య సంపాదనే ఇన్నాళ్ళనుండి కాంగ్రెస్ లక్ష్యముగా వుండేది. ఆలక్ష్యంలం సిద్ధించటంతో కాంగ్రెస్ లక్ష్యాలు పున

రాలోచించి, పునర్నిర్వచించవలసి వచ్చింది. ఇకముందు ప్రజల ఆర్థిక స్వాతంత్ర్యాన్ని సాధించటానికే కాంగ్రెస్ కృషిచేస్తుందని నాయకులు అనేకపర్యాయాలు ప్రకటిస్తూవచ్చారు. వాటినిగురించి వారి నిర్వచన ఏమిటో, వాటిని సాధించటానికి వారనుసరింపదలుస్తున్న మార్గాలేమిటో, వివరించవలసి వచ్చింది. ఇందుకు 'కాంగ్రె ఆర్థికలక్ష్య నిర్వచన సంఘ,' మని ఒక ప్రత్యేకసంఘము ఏర్పాటుచేశారు. ఈ సంఘానికి పండిట్ నెహ్రూ అధ్యక్షుడు. డా. జాన్ మత్తయ్, మౌలానా అజాద్, శంకరరావ్ దేవ్, జె. సి. కుమారప్ప, ఆచార్య రంగా గారలు ఇతర సభ్యులు. పెట్టుబడిదారీ వ్యవస్థ వ్యాప్తిని వెంటనే అరికట్టి 10 ఏండ్లలోగా దేశములో పూర్తి సోషలిస్టు వ్యవస్థను ఏర్పరచటానికి తగు సూచనలు ఈ సంఘ నివేదికలో వున్నాయి. ఈ నివేదిక పారిశ్రామిక వేత్తలలో పెద్ద సంచలనలం కలిగించింది; భారతదేశ ఆర్థిక వ్యవస్థలో తమ స్థానమేమిటో నిష్కర్షగా తేల్చి చెప్పవలసిందని కోరుతూ, పారిశ్రామికాభివృద్ధిని, అధికోత్పత్తినికూడా నిలిపివేసి వీరొక పెట్టుబడిదారీ సమ్మెను ప్రారంభించి, దేశానికి తీరని నష్టం కలిగించారు. వీరిని సంతృప్తిపరచటానికి సూత్రప్రాయంగా కాకపోయినా, కార్యచరణ రంగంలో ఒక విధమైన రాజీకి రావటానికి కాంగ్రెస్ నాయకులు ఆమోదించక తప్పలేదు. అయినా ఎప్పటి కప్పుడు ఏవో సాకులు చెపుతూ, పారిశ్రామిక ఉత్పత్తిని, అభివృద్ధిని ఆటంపరుస్తూ తమ సమాజ వ్యతిరేకతను వీరు రుజువుచేసుకుంటున్నారు. పెట్టుబడి దారులను అనునయించటానికి భారత ప్రభుత్వం తన ఆర్థికవిధానాన్ని ప్రకటించింది. కాంగ్రెస్ ఆర్థిక లక్ష్యనిర్వచన నివేదిక నాటినుండి ప్రభుత్వ ఆర్థిక విధాన నిర్వచన నాటికి, తమ లక్ష్యమైన సోషలిస్టు ఆర్థిక వ్యవస్థ విషయంలో కాంగ్రెస్ నాయకులు చాలవరకు దిగివచ్చారని ఈ రెండింటినీ పరిశీలిస్తే అంగీకరింపక తప్పదు.

స్వాతంత్ర్య పోరాటం జరుగుతున్నంత కాలం, తమలో తమకు వున్న విభేదాలను విస్మరించుకుని, భారతీయులందరు కాంగ్రెస్ అండనే

నిలిచారు. స్వాతంత్ర్యమనే లక్ష్యమే వీరిలో ఒక క్రమశిక్షణ సమకూర్చింది. స్వాతంత్ర్య సంపాదనతో ఆ క్రమశిక్షణ సడలిపోయి, కాంగ్రెస్‌లో వివిధ వర్గాలమధ్య విభేదాలు ప్రస్ఫుటమైనాయి. కాంగ్రెస్ జాతీయ ఏకైక సంస్థగా వుండలేదని తేలిపోయింది. కాంగ్రెస్ పేరు నుపయోగించుకుంటూ వివిధవర్గాలు వేర్వేరు విధానాలను అనుసరించటానికి అవకాశం ఏర్పడి, కాంగ్రెస్ ఐక్యత ఛిన్నాభిన్నమైపోయింది. కాంగ్రెస్ నిబంధనలను సవరించి, సభ్యులందరు దాని క్రమశిణను తు. చ. తప్పకుండా అమలు పరిచేటట్లు చేయకపోతే కాంగ్రెస్ అపహాస్యంపాలై పోగల పరిస్థితి ఏర్పడింది. అందువలన కాంగ్రెస్ ఆశయాలను, లక్ష్యాలను పునర్నిర్వచిస్తూ, కాంగ్రెస్‌కు నూతన నిబంధనావళిని ఏర్పరచటానికి వేరొకసంఘం డిశెంబరు ఎ. ఐ. సి. సి. సమావేశంలోనే ఏర్పరచారు. కాంగ్రెస్ నూతన నిబంధనావళి, నూతన ఆశయముల్లను గురించి ఈ సంఘం అనేక పర్యాయాలు గాంధీజీతో కూడా చర్చలు జరిపింది. ఈ సంఘం కోరికపై తన సూచనలు లిఖిత పూర్వకంగా తన జీవితంలో ఆఖరు రోజుననే గాంధీజీ తెలియజేసాడు. ఈ సూచనలు గాంధీజీ మరణశాసనం, అంతిమ ఆదేశంవంటివిగా భావించి, భారతీయులందరు శిరసావహించవలసినవి. కాంగ్రెస్‌ను ఇకముందు లోకసేవక సంఘంగా మార్చవలెననీ, రాజకీయాలనుండి విరమించి, నిర్మాణాత్మక కృషిపైననే దృష్టినంతనూ కేంద్రీకరించవలెననీ, కాంగ్రెస్ సభ్యత్వమంటూ లేకుండా, ప్రజలంతా సభ్యులుగానే భావించి, వర్కర్ల పేర్లను మాత్రమే నమోదుచేసుకోవాలనీ గాంధీజీ సూచించారు. వర్కర్లుగా చేరదలచేవారి యోగ్యతలుకూడా గాంధీజీ వివరంగా తెలియజేసారు. కాంగ్రెస్ నూతన నిబంధనారచనా సంఘము గాంధీజీ సూచనలను చాల వరకు ఆమోదించింది. కాని రాజకీయ రంగంనుంచి కాంగ్రెస్ వైదొలగవలెననే సూచనను మాత్రం ఆమోదించలేదు. ఈ సంఘము సూచించిన నిబంధనావళిని కాంగ్రెస్ కార్యవర్గం చర్చించి స్వల్ప మార్పులతో ఆమోదించింది. ఈ నిబంధనావళిలో 30 నిబంధనలున్నాయి. "భారత

ప్రజల శ్రేయస్సుకొరకు, పురోభివృద్ధికొరకు, శాంతియుత, న్యాయ సమ్మత మార్గములద్వారా, సర్వ మానవులకు సమానావకాశములు, సమాన రాజకీయ, ఆర్థిక, సామాజిక హక్కులునిచ్చు ప్రాతిపదికపై భారతదేశములో సహకార ప్రజాస్వామ్యము నేర్పరచుటకొరకు, ప్రపంచ శాంతి, సర్వమానవ సౌభ్రాతృత్వముల కొరకు'' కృషిచేయుటయే కాంగ్రెస్ లక్ష్యమని ఈ నిబంధనావళిలో తెలియజేశారు.

కాంగ్రెస్ నూతన నిబంధనావళిని, ఆర్థికలక్ష్యములను ఆమోదించి, కాంగ్రెస్ సంస్థను పునర్నిర్మించటానికి ఎ.ఐ.సి.సి. బొంబాయిలో ఏప్రిల్ నెలాఖరున సమావేశమైంది. దేశరాజకీయ పరిస్థితి గురించి అధ్యక్షుడు డాం రాజేంద్రప్రసాద్, ప్రధానమంత్రి పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ గారలు వివరముగా ఉపన్యసించారు. సభ్యులనందరిని కలవరపరుస్తున్న హైదరాబాద్ సమస్యను గురించి సంస్థానశాఖమంత్రి సర్దార్ పటేల్ ఒక సందేశం పంపించారు. అప్పటికి నెల రోజులనుండి అస్వస్థతగా నుండటంవలన ఆయన ఈ సమావేశానికి హాజరుకాలేక పోయినాడు.

దేశం స్వాతంత్ర్యమైనతర్వాత ఎ. ఐ. సి. సి. బహిరంగసమావేశం జరపటం ఇదే ప్రథమ పర్యాయం. ఈ సమావేశంలోనే కాంగ్రెస్ సంస్థను క్రొత్తరూపిచ్చి పునర్మిరించారు. కాంగ్రెస్ ఆర్థికలక్ష్యాలు ప్రథమ పర్యాయం నిర్వచింపబడినవి. అఖిలభారత సంస్థాన ప్రజామండలిని కాంగ్రెస్‌తో కలిపివేయుటకు ఈ సమావేశంలోనే తీర్మానించారు. సోషలిస్టులు కాంగ్రెస్‌నుండి వైదొలగినతర్వాత, ఇదే ఎ. ఐ. సి. సి. ప్రథమ సమావేశం. ఫిబ్రవరి ఆఖరువారంలో ఎ. ఐ. సి. సి. ఢిల్లీలో సమావేశమైందికాని అందులో ముఖ్య నిర్ణయాలు ఏమీ జరుగలేదు.

గాంధీజీకి నెహ్రూజీ వారసుడైనాడని ఈ సమావేశంలో ధృవపడింది. నూత్ననిబంధనావళిలోని తాత్కాలిక ఏర్పాట్ల నిబంధనలనుగురించి చర్చజరిగినప్పుడు ఈ సంఘటన జరిగింది. ఎ. ఐ. సి. సి. ఎన్నుకోబడి ఇప్పటికి రెండుసంవత్సరాలైంది. రాష్ట్రకాంగ్రెస్ కార్య

వర్గాలు, జిల్లా కాంగ్రెస్ కార్యవర్గాలు ఎన్నుకోబడికూడా రెండు సంవత్సరాలైంది. వాటిని ఎన్నుకొన్నతర్వాత చరిత్రాత్మకమైన సంఘటనలు జరిగాయి. కాంగ్రెస్ నిబంధనావళి ఇప్పుడు మార్చివేశారు. క్రొత్తనిబంధనావళిప్రకారం ఎన్నికలు జరగటానికి మరి రెండుసంవత్సరాలైనా పడుతుంది. అంతవరకు పాత ఎ. ఐ. సి. సి. ఏ అమలులో వుండటం మంచిదికాదనీ, ఎ. ఐ. సి. సి., రాష్ట్రకాంగ్రెస్ కార్యవర్గాలు తిరిగి వెంటనే ఎన్నికకావాలనీ కార్యవర్గం సూచించింది. ఈ తీర్మానాన్ని ఆచార్యజుగుల్ కిషోర్ ప్రతిపాదించగా ఓడిపోయింది. అంటే ఎ. ఐ. సి. సి. సభ్యులు తమ పదవులకు తిరిగి ఇప్పట్లో ఎన్నికలు జరుపరాదని నిర్ణయించారు. ఈ నిర్ణయం పండిట్ జీకి చిరాకు పుట్టించింది. ఎ. ఐ. సి. సి. కి తిరిగి ఎన్నికలు జరగాలిసిందేననీ, లేకుంటే తాను రాజీనామా నిస్తాననీ నెహ్రూజీ స్పష్టపరిచాడు. మరల వోటు తీసుకోగా తీర్మానం నెగ్గింది. అయితే ఈ తీర్మానంవల్ల జరిగిన ఫలితంమాత్రం శూన్యమే. అన్నిరాష్ట్రాలలోను పాత కార్యవర్గమే తిరిగి ఎన్నికైంది. ఎ. ఐ. సి. సి. కికూడ పాతసభ్యులే తిరిగి ఎన్నికైనారు. స్వాతంత్ర్యం లభించి, అధికారం హస్తగతమైనతర్వాత దానిని వదులుకోటానికి ఎవ్వరూ అంగీకరించటంలేదనీ, ఏదో ఒకవిధంగా తమ పదవులకు, అధికారాలకు అంటిపెట్టుకువుండితీరతారనీ ఇది రుజువుచేసింది. ఎ. ఐ. సి. సి. కి తిరిగి ఎన్నికలు జరపాలన్న పండిట్ జీ రాష్ట్రశాసన సభలకు, కేంద్రశాసనసభకు తిరిగి ఎన్నికలు జరగాలని ఎందుకు కోరటంలేదో దురూహ్యం.

కాంగ్రెస్ నూతన నిబంధనావళిని, కార్యవర్గం సూచించిన దానిని కొలదిమార్పులతో ఎ. ఐ. సి. సి. ఆమోదించింది. కార్యవర్గ సభ్యులు 20 మంది వుండాలని కార్యవర్గం చేసిన సూచన నెగ్గింది. అయితే అందులో మూడవవంతుమందిమాత్రమే అధికారసభ్యులై వుండాలనీ, తక్కినవారందరూ అనధికారులై వుండాలనీ తీర్మానించారు.

తూర్పుబెంగాల్, పశ్చిమపాకిస్థాన్ లలో వున్న కాంగ్రెస్ సంఘాలను రద్దుపరచాలని ఈ సమావేశంలో నిర్ణయించారు. కాంగ్రెస్

జాతీయసంస్థగాని అంతర్జాతీయసంస్థ కాదు. పాకిస్థాన్ విదేశం కాబట్టి అక్కడ కాంగ్రెస్ శాఖ వుండటం సమంజసం కాదు. ఆ ప్రాంతాలలోని కాంగ్రెస్‌వాదులు వేరే ఒక పక్షాన్ని స్థాపించుకోవచ్చునని సలహా ఇచ్చారు. ఇది చాల సమంజసమైన నిర్ణయం.

కాంగ్రెస్ ఆర్థికాశయములు నెహ్రూ కమిటీ సూచించినట్లుగా ఆమోదింపబడినవి. కేంద్రప్రభుత్వము, రాష్ట్రప్రభుత్వములు ఈ ఆశయాలను ఆచరణలో ఎంతవరకు మన్నిస్తున్నారో పరీక్షిస్తూ, వీటినిగురించి కార్యవర్గానికి సూచనలు చేస్తుండేటందుకు పండిట్ నెహ్రూ అధ్యక్షతన రఫీఅహమ్మద్ కిద్వాయ్, శంకరరావ్ దేవ్, డా. పట్టాభి, ఆచార్యరంగా, జగజీవనరామ్, గుల్జారీలాల్ నందా, జె. సి. కుమారప్ప, ఆనంద ప్రసాద్ చౌదరిగారలు సభ్యులుగా ఒక స్థాయిసంఘం ఏర్పాటుచేశారు.

అఖిలభారత సంస్థాన ప్రజామండలిని, దాని అనుబంధసంస్థలను కాంగ్రెస్‌లో మిళితం చేసుకోటానికి ఈ సమావేశంలో అంగీకరించారు. సంస్థానాలలోని ప్రజామండలులను రాష్ట్రకాంగ్రెస్ సంఘాలుగాను, జిల్లాకాంగ్రెస్ సంఘాలుగాను గుర్తిస్తారు.

హైదరాబాద్, కాశ్మీర్‌సంస్థానాల వ్యవహారాలనుగురించి రహస్యంగా చర్చించటానికి ఎ. ఐ. సి. సి. సభ్యులు ప్రత్యేకసమావేశం జరిపారు. హైదరాబాద్ వాస్తవ్యులు కొందరు, సరిహద్దులలో పర్యటించి వచ్చిన పెద్దలు కొందరు, పండిట్ నెహ్రూ, డా. ప్రసాద్ మొదలగువారు ఈ సమావేశంలో ఉపన్యసించారు. హైదరాబాద్ సంస్థానంపై తీసుకోనున్న చర్యలను పండిట్ నెహ్రూ వివరించినట్లు తెలిసినది. ఈ ఎ. ఐ. సి. సి. సమావేశంలో జరిగినన్ని ముఖ్యనిర్ణయాలు ఇదివరకు సమావేశంలోను జరిగివుండటంలేదు. కాంగ్రెస్‌సంస్థకు కొత్త జీవనం పోశామని సభ్యులందరు సంతోషించారు.

కాంగ్రెస్ పేరుకుమాత్రం పునర్నిర్మాణమైంది. ఇన్నాళ్ళనుంచి జాతీయసంస్థగా వున్న కాంగ్రెస్ ఇప్పుడు కేవలం ఒక రాజకీయపక్షంగా మారిపోయింది. ఇదివరకటి కాంగ్రెస్‌కు ఇప్పటి కాంగ్రెస్‌కు అసలు

సంబంధం లేనేలేనంతంగా మారిపోయింది. కాంగ్రెస్‌లోని అభివృద్ధి కాముకులు దానినుండి వైదొలగనైనా వైదొలగారు; తమ పదవులను కాపాడుకోటానికి తమ ఆశయాలనైనా విసర్జించారు. అభివృద్ధినిరోధకులు, స్వాతంత్ర్య పోరాటవిరోధులు కాంగ్రెస్‌లో చేరారు; కేంద్ర మంత్రివర్గంలోనే గౌరవనీయపదవులు ఆక్రమించారు. ప్రస్తుతసమయంలో దేశానికి అందరి తెలివితేటలు అవుసరమే కాబట్టి వారిని వేరు చేయకూడదని వాదించవచ్చు; కాని కాంగ్రెస్‌లోను కేంద్రప్రభుత్వంలోను చేరిన తర్వాత వారి నడవడికలో, వ్యవహారధోరణిలో, ఆశయాలలో ఎట్టిమార్పు రాలేదు. వారికి ఆశ్రయం ఇవ్వటంవల్ల కాంగ్రెస్ ప్రతిష్టమాత్రం భగ్నమైపోయింది.

ఈ మధ్య జరిగిన ఉపఎన్నికలలోను, మ్యునిసిపల్, ఎన్నికలులోను కాంగ్రెస్ అభ్యర్థులే గెలిచారు కాబట్టి కాంగ్రెస్ ప్రతిష్ట తగ్గిపోయిందనటం సమంజసం కాదని కొందరి కష్టం కలుగవచ్చును. మధ్యతరగతి, అమాయిక గ్రామీణ ప్రజలు ఈ మధ్య కాంగ్రెస్‌లోవచ్చిన మార్పును గ్రహించలేకపోయారు. గాంధీ, నెహ్రూల పేర్లు, పచ్చపెట్టె వారిపై ఇంకా గారడీ ప్రభావాన్ని చూపిస్తూనేవున్నవి. అలవాటుచొప్పున చెయ్యి పచ్చపెట్టె దగ్గరకే వెడుతోంది. అంతేగాని కాంగ్రెస్ వాదుల నైతిక పతనాన్ని హర్షించి, వోటిస్తున్నారని మాత్రం భావించరాదు. ఈ నాడు వయోజనుల కందరికీ వోటింగ్ హక్కు వచ్చినా, కేవలం విద్యాధికులకే వోట్లువున్నా కాంగ్రెస్ అపజయం తథ్యం. కాంగ్రెస్‌తో ఈ మధ్య పోటీచేసిన సోషలిస్టుపార్టీ ఇప్పుడే ప్రత్యేక పార్టీగా ఏర్పడ్డది. అది అంత ప్రచారంలోనికి రాలేదు. క్రొత్తరాజ్యాంగచట్టం ప్రకారం ఎన్నికలు జరిగినప్పుడుగాని కాంగ్రెస్ వారికి తమశక్తి సరిగా బోధపడదు.

అధికారమును హస్తగత మొనర్చుకుని, చెలాయించుచున్న కాంగ్రెస్‌వాదులు నానాటికి ప్రజలకు దూరమగుచున్నారు. వారి వ్యవహార ధోరణిపట్ల అసంతృప్తి వ్యాపించిపోతున్నది. దేశస్వాతంత్ర్య

సంపాదనకు ఎట్టి త్యాగపటిమతో కృషిచేసినారో అట్టి నిస్వార్థతతోనే ఇప్పుడు వ్యవహరించవలసిన అవశ్యకత వున్నది. కాంగ్రెస్ నిబంధనావళిని మార్చినంతమాత్రన, పెద్ద పెద్ద ఆశయములను నిర్వచించినంత మాత్రాన కాంగ్రెస్‌కు ప్రతిష్టరాదు ; కాంగ్రెస్ వాదుల చేతలవలననే, వారి ప్రభుత్వాలు సాధించిన దానివలననే కాంగ్రెస్ ప్రతిష్ట హెచ్చుతుంది. కాంగ్రెస్ నిబంధనావళిలోగానే కాంగ్రెస్‌వాదుల హృదయాలలో మార్పు ఇప్పుడెంతేని అవుసరము. ఈ మార్పు అతి త్వరలో తెచ్చుకొనగలిగితేనే వారు ఇకముందుకూడా పరిపాలన నిర్వహించటానికి అర్హులు. అట్లు జరుగకపోతే, వారిని తొలగించి, పరిపాలనాధికారం వేరొకరికి వప్పజెప్పవలసి వస్తుంది.

# రాజకీయ పక్షాలు

## ముస్లింలీగు

దేశవిభజన దేశభక్తుల నేరులకు కష్టకారణమైనది. అదృష్టవశాత్తు, అదికోపకారణ మాత్రము కాలేదు. తూర్పు, పశ్చిమ పంజాబ్‌లలో మత రాజకీయ కారణాలవలన, ముస్లింలీగ్ ప్రేరేపణచే జరిగిన సంక్షోభముతప్ప, దేశమంతా ప్రశాంతముగనే వుండిపోయినది. ద్విజాతి సిద్ధాంతమును బలపరచి, దేశవిభజనకు దారితీసిన భారత ముస్లింల పట్ల ప్రజలకు కోపముగాని, ప్రతీకార వాంఛగాని కలుగలేదు. ఈ స్నేహాద్భావమును సరిగా వినియోగించుకుని, గతమును విస్మరించి, ఇకముందైనా భారత ప్రజలుగా మెలుగుటకు ముస్లింలకు చక్కని అవకాశము దొరికినది. వారు దానిని అపార్థము చేసుకుని, దుర్వినియోగము మాత్రమే చేసికొనగలిగారు. పాకిస్థాన్ స్వతంత్ర రాజ్యంగా తమ కృషివలన ఏర్పడినదనీ, తాము ఇప్పుడు నివశిస్తున్న భారతదేశానికి ద్రోహంచేసి అయినాసరే పాకిస్థాన్‌కు సహాయం చేయాలని భారత ముస్లింలు భావిస్తున్నారు. తాముగాని, తమ ముత్తాతలుగాని, తమ పౌత్రులుగాని నివసించ నోచని ఒక పరాయి రాజ్యమును ఇంత పట్టుకు ప్రేలాడుటకు వారి మత మాధ్యముకన్న వేరేవీ కారణంలేదు. అవతలి పక్షమువారుకూడ ఇంత మూర్ఖులే అయినచో, భారతదేశమంతట, కల్లోలము, అశాంతి, ముస్లింజాతి నిర్మూలన జరిగివుండేవి. కాంగ్రెస్ నాయకు లెప్పుడు మతోన్మాదులు కారు; వారి అనుచరులు ఆవేశకర సమయములలో కూడ కాంగ్రెస్ సాంప్రదాయాలను కాపాడి, దేశ శాంతిని, కీర్తిని నిలబెట్టారు. ఇందుకు ఈ నాటి ముస్లింలు కాకపోయినా ముందుతరం ముస్లింలైనా వారికి కృతజ్ఞులుగా వుండకపోరు.

దేశవిభజనకు కాంగ్రెస్, ముస్లింలీగ్ నాయకులు అంగీకరించిన తర్వాత, అంతవరకు తాము 'బాయ్‌కాట్' చేస్తున్న ప్రజాపరిషత్తు

సమావేశాలకు హాజరుకావలసిందని లియాకతాలీఖాన్ భారతముస్లిం ప్రతినిధులుగా ఎన్నుకోబడినవారికి ఆదేశం యిచ్చాడు. 1947 జూన్ 29 వ తేదీన ఒక ప్రకటనచేస్తూ, "నూతన రాజ్యాంగచట్టంలో ముస్లింలమత, సంస్కృతి, ఆర్థిక, రాజకీయహక్కులు సంరక్షించటానికి అనువైన, అవుసరమైన రక్షణలు" చేర్పించేటందుకు వీరు కృషిచేయాలనికూడా ఆయన స్పష్టపరిచాడు. ఆగస్టు 15 వ తేదీన ప్రజాపరిషత్తు అధికారం దత్తతచేసుకున్న సమావేశంలో ముస్లింలీగ్ సభ్యులు పాల్గొన్నారు; భారతదేశంపట్ల తమ భక్తివిశ్వాసాలను వెల్లడిస్తూ, వీరి నాయకుడు చౌదరికాలీకుజ్జమాన్ మాట్లాడాడు. పంజాబ్ మతకలహాలు ఇతరరాష్ట్రాలకుకూడా వ్యాపించిపోకుండా అదుపులో పెట్టటానికి అన్ని రాష్ట్రాలలోను హిందూముస్లింల యిండ్లుసోదాలు జరిగినప్పుడు అన్ని పట్టణాలలోను, పల్లెలలోను ముస్లింలీగర్ల ఇండ్లలో ఆయుధాలు దొరికిపోయినవి. అవుసరమైతే అన్నిప్రాంతాలలోను కల్లోలం జరిపించటానికి ఆగస్టు 15 ముందర వీరందరికి ఆయుధాలు లీగ్ సప్లయిచేసింది. కాని కాంగ్రెస్ దేశవిభజనకు అంగీకరించటంతో వాటి అవుసరం తీరిపోయింది. ఆగస్టు 15 వ తేదీ తర్వాత ఈ ముస్లింలీగర్లు వాటిని ప్రభుత్వానికి వప్పజెప్పటమో, నాశనంచేయటమో జరిగితే వారిపట్ల ఇతరులకు అనుమానం ప్రబలివుండేది కాదు. అట్లా చేయకుండా ఆయుధాలు దాచివుంచుకుని, తమ పెడసరవైఖరిని ప్రదర్శిస్తూండడంవల్ల భారత ముస్లింలకు ఈదేశంపట్లగల భక్తివిశ్వాసాలు అనుమానాస్పదమై వీరిని ఇక్కడ వుండనివ్వవచ్చునా అనేప్రశ్న ఉదయించినది. ముస్లింలీగ్‌తో సంబంధంలేని ప్రముఖముస్లింనాయకులు హుస్సేన్ భాయ్‌లాల్జీ, అబ్దుల్ మజీద్‌ఖాన్, అబ్దుల్ కయూం అన్సారీ మొదలైనవారు ముస్లింలీగ్ వంటి మత-విద్వేషకసంస్థ ఇక వుండరాదనీ, దానిని రద్దుచేయవలసిందని స్పష్టపరిచారు. కాంగ్రెస్ ఒక్కటే, మౌలానా ఆజాద్ ఒక్కడే భారతముస్లింలను రక్షించగలడనికూడా వారు స్పష్టపరిచారు. ముస్లింల ఇండ్లలో ఆయుధాలు దొరుకుతూ, వారు గూఢచారులుగా వ్యవహ

రిస్తున్నారని రుజువుపడుతూవుండటంవలన వారపై అధికసంఖ్యాకులకు అనుమానం ప్రబలి ఈదేశంలో ముస్లింలస్థాయి ఏమిటో తేల్చవలసిందని, ఈదేశంపట్ల భక్తివిశ్వాసాలు లేనివారికి ఇక్కడ తావులేదని బాహాటంగా చెప్పటం ప్రారంభించారు. తూర్పుపంజాబ్, ఢిల్లీనుండి తప్ప ఇతర ప్రాంతాలనుండి ముస్లింలను పాకిస్థాన్ రానివ్వమని లియాకతాలీఖాన్ ప్రకటించటంతో ఈప్రశ్న సమస్యగా మారిపోయినది. ముస్లింలీగర్లే లీగ్ను నిరసించటము, జిన్నాను దూషించటము, ద్విజాతి సిద్ధాంతాన్ని ఖండించటము ప్రారంభమైంది. భారతముస్లింలందరు, లీగర్లు, ఇతరులు కూడా కలిసి సమావేశమై తమ భవిష్యత్తు నిర్ణయించుకుంటే బాగుంటుందని, ఇట్టి సమావేశం ఏర్పాటుచేయవలసిందని అనేకులు ముస్లింలు, లీగర్లతోసహా మౌలానా ఆజాద్ను అర్థించారు. నవంబరు 14 వ తేదీన ఢిల్లీలో ఈ సమావేశం జరపటానికి ఆజాద్ నిశ్చయించాడు. కూలిపోతున్న లీగ్ ప్రతిష్ఠను రక్షించటానికీ, భారతముస్లింలను పాకిస్థాన్ పంచమాంగదళంగా తయారుచేయటానికీ బెంగాల్ మాజీప్రధాని సుహ్రావర్దీ ఆఖరి ప్రయత్నం చేయటానికి ప్రయత్నించాడు. భారత ముస్లింలీగర్లనందరిని కలకత్తాలో నవంబరు 11 వ తేదీన సమావేశపరచి ద్విజాతి సిద్ధాంతం ప్రసక్తిగాని, పాకిస్థాన్ అల్పసంఖ్యాకుల ప్రసక్తిగాని, ముస్లింల అకృత్యాల ప్రసక్తిగాని లేకుండా హిందూమహాసభ ఆర్. ఎస్. ఎస్లను నిషేధించాలని, ముస్లింలహక్కులు హామీ చేయబడాలని, ముస్లింలీగ్ కౌన్సిల్ సమావేశమై ముస్లింల భవిష్యత్తు తేల్చేవరకు ఎవ్వరూ ముస్లింలీగ్ను వదలిపోరాదని మొత్తం 18 తీర్మానాలు చేయించాడు. కలకత్తా ముస్లింలే ఈయన చర్యను ఆమరునాడు ఖండించారు. నవంబరు 14 వ తేదీన ఢిల్లీసమావేశంలో మౌలానా ఆజాద్ మాట్లాడుతూ, లీగ్ను రద్దుచేసి ముస్లింలందరు ఏకైక జాతీయ సంస్థయగు కాంగ్రెస్లో చేరాలని ఉద్బోధించారు. అన్నిపక్షముల ముస్లింలు లక్నోలో డిసెంబరు నెలలో సమావేశమై, భారతముస్లింల భవిష్యత్తు నిర్ణయించాలని ఈ సభలో తీర్మానించారు. భారతముస్లింలీగ్

నాయకుడు కాలీకుజ్జమాన్ నవంబరు రెండవవారంలో రహస్యంగా పాకిస్థాన్ పారిపోయాడు.

అఖిలభారత ముస్లింలీగ్ కౌన్సిల్ జిన్నా అధ్యక్షతన, కరాచీలో డిశెంబరు 15 వ తేదీన సమావేశమై, ముస్లింలీగ్‌ను రెండుగా విభజించి, ఇండియాకొక సంస్థను, పాకిస్థాన్‌కొక సంస్థను ఏర్పాటు చేయాలనీ, భారత ముస్లింలీగ్ కౌన్సిల్ సభ్యులు త్వరలో సమావేశమై తమ భవిష్యత్తు నిర్ణయించుకోవాలనీ తీర్మానించారు. భారత ముస్లింలీగ్ కన్వీనర్‌గా మద్రాసు శాసనసభ లీగ్‌పార్టీ నాయకుడు మహమ్మద్ ఇస్మాయిల్, పాకిస్థాన్ లీగ్ కన్వీనర్‌గా లియాకతాలీఖాన్ ఎన్నుకోబడ్డారు. తర్వాత, భారతదేశంనుంచి పారిపోయి వచ్చిన కాలీకుజ్జమాన్ పాకిస్థాన్ లీగ్ కన్వీనర్‌గా నియమింపబడ్డాడు. భారత ముస్లింలీగ్ కన్వీనర్ పదవిని అంగీకరించి, ఆ సమావేశం మద్రాసులో జరపటానికి నిశ్చయించినందుకు ఇస్మాయిల్‌ను ముస్లింలందరు విమర్శించారు. ఇతని చర్యలవలన దక్షిణ భారతదేశంలోకూడా కల్లోలం ప్రారంభమౌతుం దేమోనని అందరు భయపడ్డారు గాని ప్రభుత్వం జాగ్రత్తగా వుండటం వల్ల అటువంటిదేమీ సంభవించలేదు. సుహ్రావర్దికి లీగ్ అంటే అప్పటికే తలనొప్పిపుట్టి, పాకిస్థాన్ ప్రభుత్వాల చర్యల నతడు నిరసించటం మొదలుపెట్టాడు. ముస్లింలందరు కాంగ్రెస్‌లో జేరవలసిందని నవంబరు నెలనుంచి అతడుకూడా ప్రచారం ప్రారంభించాడు. అలఖిల భారత మోమిన్‌లు లక్నోలో డిశెంబరు 25 వ తేదీన సమావేశమై, లీగ్‌ను రద్దుపరచి, ముస్లింలందరు కాంగ్రెస్‌ను బలపరచాలనీ, ఆజాద్ మాత్రమే వారిని రక్షించగలడనీ తీర్మానించారు.

సర్వపక్ష ముస్లిం మహాసభ లక్నోలో డిశెంబరు 27 వ తేదీన మౌలానా ఆజాద్ అధ్యక్షతన సమావేశమై, ముస్లింలందరు గతమును విస్మరించి, లీగ్‌ను రద్దుచేసి, మత తత్వమును రూపుమాపి, కాంగ్రెస్‌లో జేరవలసిందని తీర్మానించింది. ఈ సభలో అనేకమంది లీగర్లుకూడా పాల్గొన్నారు. ఇండియా ముస్లింలీగ్ కౌన్సిల్ మద్రాసులో మార్చి

10 వ తేదీన ఇస్మాయిల్ అధ్యక్షతన సమావేశమైంది. 150 మంది సభ్యులలో 30 మంది మాత్రమే సభకువచ్చారు. మద్రాసునుంచి 19 మంది, మైసూరునుంచి 5 గురు, బొంబాయినుండి 4 గురు, సి. పి., యు. పి. ల నుండి ఒక్కొక్కరు వచ్చారు. ముస్లింలీగ్ ఇకమీదట ముస్లింల మత, సంస్కృతి, విద్య, ఆర్థిక ప్రయోజనముల రక్షణ సంస్థగా వుండాలనీ, ముస్లింలీగ్ శాసనసభ పార్టీలు ఇతర సభ్యులతో కలసి, లీగ్ ఆదేశం ప్రకారం వ్యవహరించాలనీ తీర్మానించారు. సామాజికాభ్యున్నతి ముసుగులో లీగ్‌కును కొనసాగించటమే వీరి అభిప్రాయమవి దీని వలన రుజువైంది. అన్ని రాష్ట్రాల శాసనసభల ముస్లింలీగ్ పార్టీలనుండి చాలమంది సభ్యులు రాజీనామా లిచ్చివేశారు. చాలచోట్ల ముస్లింలీగ్ బ్రాంచీలు రద్దుచేశారు. ఇప్పుడు లీగ్ కేవలం నామమాత్ర సంస్థగా మాత్రమే వున్నది.

గాంధీజీ నిర్యాణానంతరము ప్రభుత్వం ఖక్సార్, లీగ్ నేషనల్ గార్డ్స్ సంస్థలను రద్దుపరచి, నాయకులను నిర్బంధించి, తర్వాత విడుదల చేసింది. నేషనల్ గార్డ్స్‌వద్ద అనేక ప్రాంతాలలో ఆయుధ సామగ్రి పట్టుపడింది. ప్రజాపరిషత్తు లీగ్‌పార్టీ సభ్యులు 27 గురిలో 14 గురు ఫిబ్రవరి 27 వ తేదీన సమావేశమై, ప్రస్తుత పరిస్థితులలో లీగ్ భారత ముస్లింలకు ప్రమాదంమాత్రమే తేగలదు కాబట్టి, మార్చి 1 వ తేదీనుండి తమ పక్షాన్ని రద్దుపరుస్తున్నామని ప్రకటించారు.

జాతీయ ముస్లింలు ఎప్పుడూ ఈ దేశ హితాభిలాషులే. వారి నెవరూ సందేహించరు. లీగర్లుమాత్రం పైకి ఎన్ని కబుర్లు చెప్పినా, లీగ్ సాంప్రదాయాలను వదులుకోలేక పోతున్నారు. హైదరాబాద్‌పై వారివైఖరి చాల అసంతృప్తికరంగా వున్నది. వీరి చర్యలవలన నష్టపడేది భారతదేశంగాక, భారత ముస్లింలేనని వీరు గ్రహించుకుని, తమ నడవడికను దిద్దుకొనకపోతే ఇతరులను నిందించి ప్రయోజనం లేదు.

# హిందూ మహాసభ

హిందూమహాసభ దేశవిభజనను ఎప్పుడూ వ్యతిరేకముగానే వున్నది. 1947 జూన్ 8వ తేదీన అఖిలభారత హిందూమహాసభ కౌన్సిల్ డా. శ్యామప్రసాదముఖర్జీ అధ్యక్షతన సమావేశమై "దేశ ఐక్యతను కాపాడుతామని హిందూనియోజకవర్గాలకు వాగ్దానం చేసినతర్వాత, రిఫరెండం జరుపకుండా దేశవిభజనను అంగీకరించి ప్రజలను మోసం చేసినందుకు" కాంగ్రెస్‌ను నిరసిస్తూ, ఐక్యభారతదేశమే తమ లక్ష్య మని పునరుద్ఘాటిస్తూ తీర్మానించారు. అయినా హిందూమహాసభ ప్రతినిధిగా డా. ముఖర్జీ కేంద్రమంత్రివర్గంలో చేరాడు. గాంధీజీని హిందూ మహాసభ సభ్యు డొకడు హత్యచేయటంతో దానిపతనం ఒక్కమాటుగా జరిగిపోయింది. గాంధీజీ హత్యానంతరం బొంబాయిరాష్ట్రమంతటా హిందూమహాసభ నాయకుల ఇండ్లు తగలపెట్టటము, కార్యాలయాలు తగల పెట్టటము జరిగింది, కలకత్తాలో డా. ముఖర్జీ ఇంటిపై రాళ్ళు రువ్వారు. హిందూమహాసభ కార్యదర్శి దేశపాండేను అరెస్టుచేయటము, వీరి కార్యాలయాలన్నీ సోదాచేయటము జరిగింది.

హిందూమహాసభ దౌర్జన్యచర్యలను ఎప్పుడూ ప్రోత్సహించలేదనీ, ఆసంస్థ సభ్యుడొకడు "గొప్పభారతీయుని, ఈతరములో అతిశ్రేష్ఠుడైన హిందువును" హత్యచేసినందుకు ఆసంస్థతో సంబంధ మున్నవారందరు సిగ్గుపడుతున్నారనీ, డా. ముఖర్జీ ఫిబ్రవరి 6వ తేదీన ఒక ప్రకటన చేశాడు. హిందూమహాసభ కార్యవర్గం ఫిబ్రవరి 14-15 తేదీలలో సమావేశమై రాజకీయాలనుండి విరమించి, హిందువుల సాంస్కృతిక, సాంఘిక అభ్యున్నతికి ఇకముందు పాటుపడాలని తీర్మానించి, నెహ్రూ ప్రభుత్వంలో సంపూర్ణవిశ్వాసం వెల్లడించింది. అప్పటినుండి హిందూ మహాసభ ఏమీ పనిచేయటంలేదు. హిందూమహాసభ తిరిగి రాజకీయాలలో ప్రవేశించాలని ఈమధ్యనే మహారాష్ట్రులు కొందరు సూచిస్తున్నారు. హిందూమహాసభ కార్యవర్గం ఈమధ్య సమావేశమై రాజకీయాలలో

తిరిగి ప్రవేశించాలని నిర్ణయించింది. అయితే, ఇది లీగ్ కంటె అనామక సంస్థగా మాత్రమే వుండిపోతుంది.

## కమ్యూనిస్టులు

భారతరాజకీయాలలో కమ్యూనిస్టుపార్టీ గయ్యాళి ఆడుబిడ్డ పాత్ర వహిస్తున్నది. కాంగ్రెస్ చేసినదల్లా కాదనటమే వీరి విధానం. దేశ విభజనకు లీగ్‌కు మద్దతుచేసి, తీరా కాంగ్రెస్ ఆమోదించినతరువాత విభజనకూడదని ప్రచారంచేశారు. భారతప్రభుత్వాన్ని ఇబ్బంది పెట్టటానికి, కార్మికవర్గంలో ప్రభుత్వంపై అసంతృప్తి కలిగించటానికి లెక్కలేనన్ని సమ్మెలునడిపి, విఫలులై, వున్న ప్రతిష్ట కాస్తా పోగొట్టుకున్నారు. ఇక శాంతియుతంగా పనిచేస్తే, తమపార్టీ నామమాత్రమైపోతుందని గ్రహించి, మార్చినెలలో కలకత్తాలో వార్షికసమావేశం జరిపి, ఇదివరకటినుంచి 'సంస్కారవాదం' అవలంబించామనీ, అది తప్పని ఇప్పుడు గుర్తించామనీ, ఇకముందు 'విప్లవపంధా' అనుసరించాలనీ తీర్మానించి పి. సి. జోషీని తొలగించి బి. టి. రణదివేను నాయకుడుగా ఎన్నుకున్నారు. అప్పటినుంచి తమకు కొంచెం బలం వున్నచోటల్లా సాయుధకొట్లాటలు ప్రారంభించి, పోలీసులనెగిర్చి జైళ్ళలోకి పోవటమో, పారిపోయి అజ్ఞాతవాసంలో వుండటమో వీరి కార్యక్రమంగా పరిణమించింది. ఇతరదేశాలలోని కమ్యూనిస్టులతోకూడి భారతప్రభుత్వాన్ని కూలదోయాలని ప్రయత్నిస్తున్నారని రుజువైనపిమ్మట పశ్చిమ బెంగాల్‌లో కమ్యూనిస్టుపార్టీ పూర్తిగా నిషేధించబడినది. ఇతర రాష్ట్రాలలో పార్టీకార్యాలయాలన్నీ సోదాచేయటము, నాయకులను అరెస్టుచేయటము జరుగుచున్నది.

హైదరాబాద్ సంస్థానం విషయంలో కమ్యూనిస్టులు అనుసరించిన విధానంవల్ల వీరంటే ప్రజలకు మరీ రోతపుటుతున్నది. హైదరాబాద్ భారతయూనియన్‌లో జేరకూడదనీ, సంస్థానంలో బాధ్యతాయుత

ప్రభుత్వం స్థాపించకూడదని ప్రచారంచేస్తూ వీరు రజ్వీకి వంతపాట పాడుతున్నారు. భారతకమ్యూనిస్టుపార్టీ ఇప్పుడు కేవలం నామమాత్రం గానే వున్నది.

## సోషలిస్టులు

భారతరాజకీయరంగంలో ఇప్పుడే ప్రవేశించిన సోషలిస్టుపార్టీ అనేక హృదయాలలో ఆశాభావాలు రేకెత్తిస్తున్నది. దేశంలో ఏఇతర జాతీయవాదికి తీసిపోని తీవ్రజాతీయవాదులుగా, స్వాతంత్ర్యపోరాటంలో అగ్రగాములుగా సోషలిస్టులు పేరుగాంచారు. స్వాతంత్ర్య సముపార్జన తర్వాత కాంగ్రెస్‌నాయకులు పెట్టుబడిదారులవలలో పడిపోయినప్పుడు, దేశశ్రేయస్సుకొరకు వారిని మరలించటానికి సోషలిస్టులు అనేక ప్రయత్నాలు చేశారు. తమ కృషి ఫలప్రదంకాదని గ్రహించుకున్నతర్వాత, ఇటువంటి కాంగ్రెస్‌లో వుండటమా, చీలిపోయి వేరొకపార్టీ స్థాపించటమా అని వీరు చాలకాలం తటపటాయించారు. చిట్టచివరకు మార్చి 20 వ తేదీన నాసిక్‌లో సర్వసభ్య సమావేశంలో కాంగ్రెస్‌నుండి విడిపోవటానికి సోషలిస్టులు నిర్ణయించారు. సోషలిస్టుపార్టీ సభ్యులందరు ఏప్రిల్ 15 వ తేదీలోగా కాంగ్రెస్‌నుండి రాజీనామా నివ్వవలసిందనీ, కాంగ్రెస్ అభ్యర్థులుగా శాసనసభలకు, ఇతర అధికారపదవులకు ఎన్నుకోబడినవారు రాజీనామా నివ్వవలసిందని ఈ సమావేశంలో తీర్మానించారు. దేశమంతటా చాలమంది ఈవిధంగా రాజీనామా లిచ్చారు. సోషలిస్టులు రాజీనామా లిచ్చిన స్థానాలకు తిరిగి ఎన్నికలు జరుగగా, సోషలిస్టులందరు - ఆచార్య నరేంద్రదేవ్ సహా - ఓడిపోయారు. బొంబాయి మ్యునిసిపల్ ఎన్నికలలో లభించినంత విజయం, యు. పి. జిల్లాబోర్డులలో ఎన్నికలలో వీరికి లభించలేదు. శాసనసభల ఎన్నికలలో అసలు ఒక్క సోషలిస్టు పోటీదారుడు కూడ నెగ్గలేదు. అయితే ఇది సోషలిస్టులకు అపజయం అనిగాని, కాంగ్రెస్‌కు విజయమని గాని భావించటానికి వీలులేదు. ప్రజలు అల

వాటు ప్రకారం కాంగ్రెస్‌కే వోటువేశారు. అది కేవలం పసుపుపెట్టె ఆకర్షణమాత్రమే. వయోజనవోటింగ్ పద్ధతి ప్రకారం ఎన్నికలు జరిగి, ప్రజలు కాంగ్రెస్, సోషలిస్టుపార్టీల ఆశయాలు సరిగా అవగాహన చేసికోగలిగినప్పుడు విజయం సోషలిస్టులదే కాగలదు. సోషలిస్టులు తమ పార్టీ యంత్రాన్ని, ప్రచారాన్ని చురుకుగా ఏర్పాటు చేసుకుని, రానున్న ఎన్నికలలో కాంగ్రెస్‌తో విజయవంతంగా పోటీచేయటానికి ఇప్పటినుంచే తీవ్రంగా కృషిచేయాలి. భారతదేశంలో సోషలిస్టు ఆర్థిక వ్యవస్థను, సరియైన ప్రజాస్వామ్యాన్ని స్థాపించటానికి, కాంగ్రెస్ తప్పులను ఎత్తిచూపి, సరియైనత్రోవలో నడిపించటానికిగాని, అవుసరమైతే తామే అధికారం వహించి ఆ లక్ష్యాలు సాధించటానికి గాని సోషలిస్టుపార్టీ ఒక్కటే తగివున్నది.



# వైదేశిక విధానము

ప్రపంచంలో ఏ దేశమైనా, ఇతర దేశాలతో సంబంధం లేకుండా ఏకాకిగా వుండగలగటం అసంభవం. ప్రతి దేశంతోను మనకు అనేక లావాదేవీలు సంభవిస్తుంటవి; ఒక్కొక్కప్పుడు కొన్ని దేశాలతో వివాదాలే ఏర్పడుతూంటవి. విదేశాలలో మన దేశప్రతిష్ట, హోదా, గౌరవము మన విదేశ వ్యవహారాల నిర్వహణపైన ఆధారపడి వుంటుంది. మనది ప్రస్తుతం అన్నివిధాలా—ఒక్క జనాభాలో తప్ప—బీదదేశం. సైనికంగాను, పారిశ్రామికంగాను, వైజ్ఞానికంగాను మనం ఎంతో వెనుకబడి వున్నాము. కాని ఇతర దేశాలలో మనపట్ల ఎంతో సానుభూతి, సౌహార్ద్రత వున్నవి. ఆసియా దేశాలు తమకే ఇక్కట్టు సంభవించినా సహాయం కొరకు మనవంక చూస్తున్నవి. ప్రపంచ సభలలో కూడా భారతదేశ దృక్పథం ఏమిటని ఆతురతగా ప్రశ్నించి, పరీక్షిస్తున్నారు. మన దేశానికి సైనిక-శక్తి, ఆర్థిక-శక్తి శూన్యమని తెలిసివుండి కూడా, ప్రతి విషయంలోను మన దృక్పథానికి ఇంత విలువ యిస్తున్నారంటే, ఇతర దేశాల దృష్టిలో మనదేశానికి ఎంతటి విశిష్ట స్థానమున్నదో బోధపడుతున్నది. ప్రస్తుతం మనపట్ల విదేశాలలోగల సౌహార్ద్రతను పెంపొందించుకుంటూ, సద్వినియోగ పరుచుకుంటూ, మనకు లోటు పడివున్న సైనిక-శక్తి, ఆర్థిక-శక్తి సత్వరమే చేకూర్చుకుని, ప్రపంచ వ్యవహారాలలో మనకు అయాచితంగా, స్వతఃసిద్ధంగా లభించిన విశిష్టస్థానానికి మన అర్హతను రుజువుచేసుకుని, ప్రపంచశాంతి సౌభాగ్యాలకు పాటుపడేటట్లు ఇతర దేశాలను మందలిస్తుండగల స్థాయికి రావటమే మన విదేశ విధాన లక్ష్యమైవుండాలి. అప్పుడే భారతదేశం ప్రపంచంలో తన పూర్వ వైభవానికి అనుగుణమైన స్థానం పొందుతుంది; మన పూర్వీకుల సాంప్రదాయాలను మనం రక్షించి, సాగించినవాళ్ళమౌతాము.

బ్రిటిష్ పాలకులు మన దేశంలో వున్నంతకాలము ఇతర దేశాలతో మనము నేరుగా ఎట్టి సంబంధాలు ఏర్పరుచుకోవటానికి వీలులేక

పోయింది. పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ అధ్వర్యాన కేంద్రంలో తాత్కాలిక ప్రభుత్వం ఏర్పడిన తర్వాత విదేశ వ్యవహారాల బాధ్యత ఆయనకు వప్పగించారు. భారత ప్రజాప్రతినిధులు ప్రథమ పర్యాయం 1946 వ సం, లో జరిగిన ఐక్యరాజ్య సమితి సమావేశాలకు వెళ్ళారు. ప్రతి సమస్యపైనా వీరి స్వతంత్ర దృక్పథం అగ్రరాజ్యాలకు కొంత చికాకు కలిగించినా, వీరి నిష్పాక్షికత ప్రపంచరాజ్యాల, ప్రపంచ ప్రజల మన్ననపొందింది. ఆ సంవత్సరమే, మన ఆహ్వానముపై ఢిల్లీలో జరిగిన ఆసియారాజ్యాల మహాసభలో ఆసియా రాజ్యాలపట్ల మనకు కొన్ని బాధ్యతలున్నవినీ, వాటిని నిర్వర్తించి మన విశిష్టతను కాపాడుకోటానికి మనం సమర్థులంగా వుండాలనీ బోధపడింది. ఈ బాధ్యతను పురస్కరించుకునే ఇండోనీసియా సమస్య విషయమై ఐక్యరాజ్య సమితిలో ఫిర్యాదుచేసి, ఇండోనీసియా రిపబ్లికన్‌లకు మన చేతనైనంత సహాయం చేశాము. మనదేశం స్వతంత్రమైన తర్వాత చాల విదేశాలలో మన ప్రతినిధులు నియమించబడ్డారు. వీరి ఎన్నిక కేవలం రాజకీయ చతురత, అనుభవములను పురస్కరించుకునే గాక, పార్టీ రాజకీయాలలో వుండే అనేక ఇతర కారణాలవలన జరుగుతుండటం కొంత అసంతృప్తి కలిగించింది. విదేశాలలో మన రాయబారుల కృషికూడ ఏమంత సంతృప్తికరంగాలేదు. కాంగ్రెస్ కార్యవర్గ సభ్యుడు, కేంద్రమంత్రివర్గంలో ఆదినుండి సభ్యుడు అయిన అసఫ్ఆలీని వాషింగ్‌టన్‌లో రాయబారిగా నియమించి, ఒక్క సంవత్సరంలోనే తొలగించవలసి వచ్చింది; లండన్‌లో హైకమిషనర్ గత 25 సంవత్సరాలుగా మన స్వాతంత్ర్యోద్యమానికి ఎంతో తోడ్పడినవాడేనైనా చీటికి మాటికి అనేక చిక్కు ప్రశ్నలు నెత్తిపై తెచ్చుకుని, తనపైగల అభిమానాన్ని పోగొట్టుకుంటున్నాడు; మాస్కోలో రాయబారి తన కార్యాలయం అలంకరించుకోవటం కంటె చేస్తున్నపని ఏమిటో బోధపడటంలేదు. మన పారిశ్రామికాభివృద్ధికి యంత్ర సామగ్రి, నిపుణులు ప్రతి విదేశంనుండి తెచ్చుకోనకపోతే, మన అభ్యున్నతి చాల వెనుకపడిపోతుంది. కాని విదే

శాలలోని-మన ప్రతినిధులు, ఇచ్చట మన మంత్రులు దీనిని చాల నిర్లక్ష్యం చేస్తున్నారు. ఐక్యరాజ్యసమితికి కాశ్మీర్ సంఘటన విషయంలో పాకిస్థాన్‌పై మనం చేసిన ఫిర్యాదు అగ్రరాజ్యాలపై ఎత్తులు, స్వప్రయోజనా కాంక్షలవల్ల సరిగా విచారింప బడలేదనీ, నిష్పాక్షికమైన తీర్పు జరగలేదనీ మనం విమర్శించవచ్చు గాని, ఆ సభలో పాకిస్థాన్ ప్రతినిధి వాదనలతో పోల్చిచూస్తే, భారత ప్రతినిధివాదన అతి పేలవంగా వుందని అంగీకరించక తప్పదు. ముస్లింజాతి హత్య, ఒడంబడికల నిర్లక్ష్యము, జునాగఢ్ మొదలగు వానిపై మనం చేయవలసిన ఫిర్యాదును ఎదురు మనపైన నేచేసి పాకిస్థాన్ ప్రతినిధి తన వాదానికి బలం చేకూర్చుకున్నాడు. పాకిస్తాన్ అబద్ధమాడుతున్నదనీ, న్యాయం మన పక్షానే వున్నదని ఇక్కడవుండి పరిస్థితులు స్వయంగా చూస్తున్న మనకు తెలియవచ్చుగాని, ఏంతో దూరానవుండి; పరిస్థితులు స్వయంగా పరిశీలించక కేవలం వాది ప్రతివాదుల వాదాలనుబట్టి తీర్పు, పరిష్కారము చేయవలసివచ్చే విదేశస్థులు, ఎవరి ప్రతినిధులు సహేతుకంగా నచ్చేటట్లు వాదిస్తారో వారి కనుకూలంగా పరిష్కరించటం అసమంజసమేమున్నది? మన విదేశ వ్యవహార నిర్వహణ జరుగవలసినంత చాకచక్యంతోను, సమర్థతోను జరుగుట లేదని ఈ సంవత్సరంలో తేలిపోయింది. మన రాయబారులు, ప్రతినిధులు తమ వ్యవహార పద్ధతులను మార్చుకోవాలి.

భారతప్రభుత్వ విదేశ వ్యవహారవిధానాన్ని వివరిస్తూ భారత ప్రధాని పండితజవహర్‌లాల్ నెహ్రూ గత మార్చినెలలో అధినివేశ శాసనసభలో ఒక ప్రకటన చేశాడు. అగ్రరాజ్యాల విభేధాలవల్ల ప్రపంచం ఈనాడు రెండుగా చీలిపోయి, ఈ రెండుభాగాలమధ్య ఏక్షణమైనా సంక్షోభం ప్రారంభంకాగల ప్రమాదం ఏర్పడింది. భారత దేశం ఈ రెండువిభాగాలలో దేనితోను పూర్తిగా జేరిపోకూడదు. అగ్రరాజ్యాలమధ్య ఏర్పడ్డ వివాదాలను, ప్రపంచ సభలలో చర్చకు వచ్చేసమస్యలను కూలంకషంగా పరిశీలించి, అవగాహన చేసుకుని, మన

దృష్టిలో న్యాయము, నిష్పాక్షికము అని తోచిన వైఖరిని అవలంబించటమే మంచిది. అట్లాగాక, ఏ ఒక్క వర్గంతోనో సంపూర్ణంగా చేతులు కలిపితే, మనం ఆ అగ్రరాజ్యానికి అన్నివిధాలా లొంగిపోయి, మన ప్రతిష్టను, గౌరవాన్ని, పోగొట్టుకోవటమే గాక, చారిత్రికంగా మనకు వచ్చిన సాంప్రదాయలను రక్షించుకోలేకపోయి, మనకు సంబంధంలేని వివాదాలలో ఒక పక్షాన్ని గుడ్డిగా సమర్థించవలసివస్తుంది. కాబట్టి అగ్రరాజ్యాలలో ఏవర్గాన్ని సమర్థించకుండా, ఆయాసమస్యలనుబట్టి మన వైఖరిని నిర్ణయించుకుంటూ, వివాదాలలోవున్న రెండువర్గాలకు అతీతంగా, మధ్యే మార్గాన్ననుసరిస్తూ, ప్రపంచ అభ్యున్నతికి మన చేతనైనంత కృషి చేయటమే మన విదేశ వ్యవహారవిధానము. ఈ విధానము పైకి 'ఆదర్శవాదము'గా 'వాస్తవికత' లోటయినట్లుగా కనిపిస్తుంది. ఏవో తాత్కాలిక ప్రయోజనములను పొందటానికి ఏదో ఒక వర్గముతో జేరిపోయిన బాగుండుననీ, ప్రపంచమంతా రెండు విభాగలైపోయి వున్నది కాబట్టి మనం ప్రత్యేకంగా, అంటించుకోకుండా వుంటామనటంలో అర్థంలేదనీ, ఒకవేళ మనం అంటించుకోకుండా వున్నా ప్రపంచరాజకీయాల ధోరణిలో అందువలన మార్పేమీ రాదనీ చాలమంది వాదిస్తారు. కాని జాగ్రత్తగా పరిశీలిస్తే, నెహ్రూ సూచించిన విధానమే అన్నివిధాల ఉత్తమమైనదని బోధపడుతుంది. మనదేశం అంతర్జాతీయరంగంలో స్వతంత్రంగా వ్యవహరించటం ప్రారంభించకముందే ప్రపంచం రెండుగా విభాగమై పోయింది. పరిస్థితి ప్రమాద భూయిష్టంగా వున్నప్పుడు మనం ఒకవర్గంతో జేరి ఆ ప్రమాదాన్ని మనపైకి ఆహ్వానించి తెచ్చుకోవటం ఎందుకు? మన దృష్టి ఎప్పుడూ శాంతి, సౌభాగ్యాలపైననే వున్నది. ప్రస్తుత అగ్రరాజ్యాలు కేవల తద్వ్యతిరేకంగా వ్యవహరిస్తున్నవి. వాటితో జేరి మన సత్సాంప్రదాయాలకు తిలోదకాలివ్వటం ఎందుకు? మనదేశం ఒక్కటి అగ్రరాజ్యవిబేధాలతో అంటించుకొనకపోవటంవలన, ప్రపంచ ప్రమాదం ఏమీ తగ్గకపోవచ్చును. కాని సహృదయులు, న్యాయపక్షపాతులు

అయినవారు మన విధానాన్ని హర్షింపకపోరు; ఈ విధానంవలన మనకు తాత్కాలిక లాభంఏదీ కనిపించకపోయినా, ప్రపంచ చరిత్రలో నే ఒక నూతన అధ్యాయాన్ని ప్రారంభించినట్లవుతుంది. ఇప్పుడు ప్రయోజన రహితంగా కనిపించినా, ఏనాటికైనా ఇది ఫలించి తీరుతుంది. అన్నిటినిమించి, 'నెహ్రూ విధానం' ద్వారా మనం మన చారిత్రిక సాంప్రదాయాలను అనుసరిస్తూ, మననుంచి ప్రపంచం ఆశించిన విశిష్టత, ప్రత్యేకతలను సాధించిన వారమౌతాము. మనదేశ ఆర్థిక - శక్తి, సైనిక - శక్తి చాలతక్కువగా వున్నవి. మనం వెంటనే ఏదో ఒక వర్గంతో జేరిపోతే, ఆ వర్గ ప్రయోజనాలకు దోహదం చేసేటట్లుగా మన సైనిక శక్తిని, ఆర్థికశక్తిని వృద్ధిపరచటానికి వారు కృషిచేసి, మన దేశాన్ని ఆర్థికంగా అభ్యున్నతికి తెస్తారు. కాబట్టి ఈ అవకాశాన్ని జారవిడువరాదని కొందరు భావిస్తున్నారు. కాని మనం ఏవర్గంలో జేరినా, మన అవుసరాలను, అభిరుచులనుబట్టి గాక ఆవర్గ ప్రయోజనాలకు అనుగుణంగానే, మన ఆర్థిక అభ్యున్నతి జరిగి, ఒకచేతితో పొందిన స్వాతంత్ర్యాన్ని వేరొకచేతితో పోగొట్టుకున్నట్లయి, రాజకీయదాస్యానికి బదులు ఆర్థికదాస్యం తెచ్చిపెట్టుకున్న వాళ్ళమౌతాము. కాబట్టి ఏదృష్టితో పరిశీలించినా 'నెహ్రూ వైదేశిక విధానం' సమర్థనీయంగానే కాక ప్రశంసనీయంగా కూడా వున్నది.

ఒక విధానం ప్రశంసనీయంగా వున్నంతమాత్రాన అది జయప్రదం కాదు; దాని ఆచరణకూడా ప్రశంసనీయంగానే జరగాలి. మన విదేశ వ్యవహారాలను నిర్వహించే రాయబారులు తగు సమర్థులైతే గాని మన విధానం రాణించదు. ఇంతేగాక, మనదేశ సైనిక, ఆర్థికశక్తి సంపదలను బట్టికూడా మనవిధానం పట్లగౌరవము, విధేయత ఏర్పడుతవి. మనం సూచిస్తున్న విధానాన్ని అమలు జరుపటానికి శక్తి, తాహతు మనకు వున్నదని తెలిసినప్పుడు మన విధానాన్ని ఎవరైనా గౌరవిస్తారు, ఆదరిస్తారు, అనుసరిస్తారు. కాబట్టి భారతప్రభుత్వం సూచించిన స్వతంత్రవైదేశిక విధానం ప్రపంచంలో రాణించి, గౌర-

వింపబడాలంటే మనదేశ ఆర్థిక సైనికశక్తులు అతి చురుకుగా వృద్ధి పొందాలి. ఇందుకు మనకు కావలసిన యంత్రసామగ్రి, నిపుణులు విదేశాలనుండి సేకరించటానికి మన రాయబారులు కృషిచేయాలి. ఇదే ప్రస్తుతం వారు చేయతగిన ముఖ్యమైనపని. యూరప్ రాజ్యాలలో ఎంత చిన్నరాజ్యమైనా మనకు కావలసిన మంత్రసామగ్రి ఎంతో కొంత సప్లయి చేయగల స్థితిలో వుంది. మన ప్రతినిధులు చాకచక్యంతో దానిని సంపాదించటమే జరుగవలసినపని. కాని భారతప్రభుత్వము, రాయబారులు కూడా ఈవిషయాన్ని నిర్లక్ష్యంచేసి, తమ ప్రభుత్వాన్ని, తద్వారా తమ విధానాలను బలహీనపరుచుకుంటున్నారు. నెహ్రూ మేధాశక్తి మనకొక చక్కని విదేశ విధానాన్ని ఏర్పరచింది. దానిని ఈ దేశంలోను, విదేశాలలోను నిర్వహించే ఉద్యోగులుమాత్రం పూర్వకాలపు పద్ధతులకే అలవాటు పడివుండి, అది సక్రమంగా నిర్వహణ జరుగకుండా అడ్డుపడుతున్నారు. పార్టీ రాజకీయతత్వాలు ఈ చక్కని విధానాన్ని ధ్వంసం చేస్తున్నవి. నెహ్రూ పండితుడు తీవ్రంగా ఆలోచించి, తాను నిర్వచించిన విధానం ఇకముందైనా సక్రమంగా నిర్వహింపబడేటట్లు కట్టుదిట్టాలు చేయాలి. అప్పుడే మనదేశ విదేశ వ్యవహార విధానం ప్రపంచ ఆదరణ పొందగలదు.



# పారిశ్రామిక విధానం

భారత ప్రజలకు రాజకీయ స్వాతంత్ర్యమేగాక ఆర్థిక స్వాతంత్రము కూడ లభింపజేయటమే తమ ఆశయమని గాంధీ మహాత్ముడు, ఇతర కాంగ్రెస్ పెద్దలు మొదటినుండి చెప్పుచునే వచ్చిరి. భారతదేశమును పారిశ్రామికముగా బ్రహ్మాండముగా అభివృద్ధిచేసి ప్రజల జీవనస్థాయిని వృద్ధిచేయుటకు అనేక కార్యక్రమములు, స్వాతంత్ర్యము లభించిన వెంటనే, అమలు జరుపబడగలవని కాంగ్రెస్ నాయకులు, ప్రజలుకూడ ఆశించుచుండిరి. పారిశ్రామికాభివృద్ధికి, ఇతర విధములుగా ఆర్థికాభి వృద్ధికి అనేక పథకములు ఏర్పాటు చేయబడినవి. స్వాతంత్ర్యము లభించి ఇప్పటికి ఒక సంవత్సరము గడచిపోయినది. కాని ఆపథకములు అప్పుడెట్లో, ఇప్పుడు కూడా అట్లే ఆశాపూరిత అంచనాలుగా మిగిలి పోయినవి. వాస్తవమునకు, పారిశ్రామికాభివృద్ధి జరుగకపోగా ఉన్న పరిశ్రమలలోకూడ ఉత్పత్తి చాల తక్కువైపోయి, అన్నివస్తువులు ఇది వరకెన్నడు లేనంత కరువుగా వున్నవి.

1946 వ సం. ఆగస్టు నెలలో ముస్లింలీగ్ 'ప్రత్యక్షనిరోధక' విధానం ప్రారంభమై కలకత్తా కల్లోలము జరిగినప్పటినుండి మనదేశములో పారిశ్రామిక ఉత్పత్తి పడిపోయింది. దేశములో ఎప్పుడు ఏదో ఒక మూల మతకలహాలు జరుగుతుండటము, అందువలన యంత్రాగారాలు మూసివేయబడటము సర్వసాధారణమైపోయింది. 1947 ఆగస్టు 15 వ తేదీ తరువాతకూడ ఈ పరిస్థితి ఏమాత్రము చక్కబడలేదు. రవాణాసౌకర్యాలన్నీ కాందిశీకుల నుతెచ్చుటకే వినియోగింపబడుటవలన ముడిసరుకులు సరిగా అందక పరిశ్రమలన్నియు నష్టపడెను. పైగా కమ్యూనిస్టు ప్రేరిత సమ్మెలు దేశమంతా జరిగి, ఉత్పత్తి మరింత తగ్గిపో వుటకు కారణమయ్యెను. 1947 వ నవంబరు నెలాఖరుకు మొత్తం 153 లక్షల పారిశ్రామిక దినములు పని ఆగిపోయెను. 1947 వ సం. లో

అన్ని వస్తువుల ఉత్పత్తికూడ ఆందోళన జనకముగా పడిపోయెను. నూలుగుడ్డలు 1944 వ సం. లో 482.6 కోట్ల గజములు ఉత్పత్తికాగా 1947 వ సం. లో 380 కోట్ల గజములు మాత్రమే ఉత్పత్తి జరిగెను. మన దేశములో ఇనుము, ఉక్కు పరిశ్రమకు 12,40,000 టన్నుల ఉత్పత్తి ప్రమాణము వున్నది; 1943 వ సం లో 11,60,000 టన్నులు ఉత్పత్తికాగా 1947 వ సం. లో 8,75,000 టన్నులు మాత్రమే ఉత్పత్తి జరిగెను. మన దేశములో నెలకు 1,73,000 టన్నులు సిమెంటు ఉత్పత్తి అగు అవకాశమున్నది. కాని ఉత్పత్తి 1,12,000 టన్నులు మాత్రమే జరుగుచున్నది. ఈ విధముగా ముఖ్యమగు 30 రకముల వస్తువుల ఉత్పత్తి 1947 వ సం. లో అతి తక్కువ స్థాయికి పడిపోయెను. క్రొత్త పరిశ్రమలను స్థాపించి, ఉత్పత్తిని హెచ్చుచేయు సంగతటుంచి, ఉన్న ఫ్యాక్టరీలన్నీ సక్రమముగా పనిచేసి ఉత్పత్తి చేయగల్గినంత మొత్తమును ఉత్పత్తిచేయునట్లు చూచుట ఒక పెద్ద సమస్యగా పరిణమించెను. వస్తూత్పత్తి తగ్గిపోయిన కొద్దీ వస్తువులకొరత, ధరలు, ధనోల్బణము పెరిగిపోవుట, తద్వారా ప్రజలలో అసంతృప్తి ప్రబలుట జరిగెను.

గత డిశెంబరు నెలలో పారిశ్రామికవేత్తలను, కార్మిక నాయకులను ఒక సభకు ఆహ్వానించి, వస్తూత్పత్తి మామూలు స్థాయికి వచ్చుటకు గైకొనవలసిన చర్యలనుగురించి భారతప్రభుత్వము ఆలోచించెను. వస్తూత్పత్తి పడిపోవుటకు ముఖ్యకారణములు ముడిసరుకు అందకపోవుట. రవాణాసౌకర్యములు తగ్గిపోవుట, దేశములో కల్లోలము, సందిగ్ధ పరిస్థితి, కార్మికరంగములో అశాంతి. ఈ సమస్య అన్నింటిని వీలైనంత వరకు పరిష్కరించి, వస్తూత్పత్తి సక్రమముగా జరుగునట్లు చేయవలెనని పారిశ్రామికవేత్తలు, కార్మిక నాయకులు, ప్రభుత్వము గుర్తించిరి. ఆ త్రైపాక్షిక సమావేశములో పారిశ్రామికవేత్తలు, కార్మిక నాయకులు ఒకరి అభిప్రాయముల నొకరికి నిర్మొహమాటముగ తెలియజేసికొని, ఇకముందైనను కలసి కట్టుగా పనిచేసి వస్తూత్పత్తి గరిష్టప్రమాణమునకు

తేవలెనని కృతనిశ్చయులైరి. రవాణాసౌకర్యములను సరిగ్గా వినియోగించుట, ముడిపదార్థములను సకాలమునకు అందజేయుట, పారిశ్రామిక తగాదాలు సమ్మెలకు దారితీయకుండా, ఆదిలోనే వాటిని పరిష్కరించుట మొదలగు వాని ద్వారా పారిశ్రామిక వస్తూత్పత్తి నిరాటంకముగా కొనసాగునట్లు చేయుటకు ప్రభుత్వము బాధ్యతవహించెను. అన్నిటిని మించి, మూడేండ్లవరకు సమ్మెలు జరుపకుండుటకు, సమ్మెలు జరుప వలసిన పరిస్థితి ఏర్పడనివ్వకుండుటకు, 'లాకౌట్'లు చేయకుండుటకు పారిశ్రామికులు, పారిశ్రామికవేత్తలు అంగీకరించిరి. త్రైపాక్షిక పారిశ్రామిక సమావేశము సాధించిన మహత్తరవిజయము పారిశ్రామిక రంగంలో 'అవతారము' నేర్పరచుటయేనని కార్మికనాయకులు, పారిశ్రామికవేత్తలు, పత్రికలుకూడ శ్లాఘించారు. ఈ సమావేశమునకు హాజరైన పెద్దలు, ఆయా సంస్థలతరఫున ప్రతినిధులుగాగాక, తమ వ్యక్తిగత హోదాలోనే వచ్చివుండటంవలన వీరి నిర్ణయాలు పారిశ్రామిక వేత్తలనుగాని కార్మికులనుగాని నిర్బంధించవన్నమాట నిజమేగాని వీరు ఆయారంగాలలో నాయకులై వుండుటవలన తమ పలుకుబడి నుపయోగించి, ఈ సమావేశ నిర్ణయాలు అమలుజరుగునట్లు చేయగలరని ఆశించారు. డిశెంబరు మూడవవారములో ఈ సమావేశము ముగిసిన తర్వాత పారిశ్రామిక వస్తూత్పత్తి అధికమగు అవకాశములు ఆశాపూరితములుగా నుండి, ఎట్టకేలకు కరువు తొలగిపోవునుగదా అను ఒక రకపు సంతుష్టి కలిగింది.

దురదృష్టవశాత్తు, త్రైపాక్షిక పారిశ్రామిక సమావేశములో జరిగిన ముఖ్య నిర్ణయము—మూడేండ్లపాటు సమ్మెలు జరుపకుండుట— అమలు జరుగకపోగా, దేశమంతట సమ్మెలు విరివిగా జరగటానికి దోహదంచేసింది. మనదేశ కార్మికవర్గము రాజకీయంగా కనీసం నాల్గు విభాగాలుగావుంది. అఖిలభారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌కు వ్యతిరేకంగా కాంగ్రెస్‌వాదులు జాతీయట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌ను స్థాపించారు. యం. ఎన్. రాయ్ ఆధిపత్యమున ఇండియన్ లేబర్ ఫెడరేషన్ ఏర్పడి చాల రోజులనుండి పనిచేస్తున్నది; సోషలిస్టులుపై

మూడు సంస్థలలో దేనికీ చెందక వేరే ఒక సంస్థను స్థాపించుటకు ఏర్పాటుచేస్తున్నారు. ఈ నాలుగు విభాగాలను ఏకపంథాకు తెచ్చుట దాదాపు అసంభవమని చెప్పవలెను. ఢిల్లీలో త్రైపాక్షిక సమావేశము ముగిసినవెంటనే కలకత్తాలో కమ్యూనిస్టులు, బొంబాయిలో సోషలిస్టులు బ్రహ్మాండమగు సమ్మెలు లేవదీసిరి. కలత్తా సమ్మె చాలవరకు భగ్నమైనను, బొంబాయి సమ్మె చాల జయప్రదమైనది. అప్పటినుండి దేశములో సమ్మెలు జరుగుతునేవున్నవి.

అన్నివస్తువుల ధరలు, పంపిణీవిధానము కంట్రోల్ చేసివుండటం వలన, వస్తువుల ఉత్పత్తి లాభసాటిగా లేదనీ, కంట్రోల్ తొలగిస్తే ప్రజానీకమువద్ద అధిక ధర వసూలుచేయకుండా, ధరలు కొంచెము హెచ్చించి వస్తూత్పత్తి లాభదాయక మొనర్చుకొని, అధిక ఉత్పత్తి చేస్తామని పారిశ్రామికవేత్తలు విజ్ఞప్తిచేయటం మొదలుపెట్టారు. కంట్రోల్ ధరలు నిర్ణయించునప్పటికన్న ఉద్యోగుల, కార్మికుల జీతాలు, ముడిపదార్థాల ధరలు హెచ్చిపోయినవి కాబట్టి కంట్రోల్ ధర పెంచనైనా పెంచవలెను లేదా కంట్రోల్ తొలగించవలెనని వారు కోరారు. కంట్రోల్ తొలగిస్తే ధరలు మితమునీరి పెరిగిపో నివ్వమని వారు హామీకూడ ఇచ్చారు. ఇందువలన ప్రభుత్వము, గాంధీ మహాత్ముని ప్రోద్బలముతో, కంట్రోల్ తొలగించుటకు నిశ్చయించి, క్రమేణా అన్నివస్తువులపై కంట్రోల్సును తొలగించెను. పెట్టుబడి దారులు, వ్యాపారస్థులు తమ మాటలను నిలబెట్టుకోలేదు. కంట్రోల్ తొలగించగానే అన్నివస్తువుల ధరలు కనీసము రెట్టింపయ్యెను.వస్తూత్పత్తి మాత్రము పెరగలేదు.

ఇది ఇట్లుండగా, కాంగ్రెస్ ఆర్థికలక్ష్య పునర్నిర్వచనకు పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ అధ్యక్ష తన ఏర్పరచబడిన సంఘము నివేదిక సమర్పించింది. ఈ సంఘసూచనలు, మేనెలలో జరుగనున్న ఎ. ఐ. సి. సి. సమావేశములో ఆమోదింపబడి, కాంగ్రెస్ లక్ష్యములో అంతర్భాగమగునని పెట్టుబడిదారులు గ్రహించి, తద్వ్యతిరేకముగ తీవ్ర

ప్రచారము ప్రారంభించిరి. ఈ సంఘసూచనలు యథాతథముగ అమలు జరుపుట దేశమునకు ఉపద్రవకరమని వీరు అలజడి చేశారు. క్రొత్త పరిశ్రమలను స్థాపించ దలచువారికి, ఇప్పుడున్న ఫ్యాక్టరీలను పెద్దవిచేసి ఉత్పత్తి అధికము చేయదలచువారికి ఈ సూచనలు పెద్ద ఆటంకములుగానున్నవనీ, ప్రభుత్వము తన పారిశ్రామిక విధానము వెంటనే స్పష్టపరచకపోతే పారిశ్రామిక ఉత్పత్తి స్తంభించి పోతుందనీ వీరు ప్రచారముచేసి, ప్రధానమంత్రివద్దకు, పరిశ్రమల మంత్రివద్దకు రాయభారములు వెళ్ళారు.

కాంగ్రెస్ ఆర్థికలక్ష్య నిర్వచన సంఘముచేసిన సూచనలలో అతి ముఖ్యమైనది 'మానేజింగ్ ఏజెన్సీ' పద్ధతిని రద్దుచేయుటకు సంబంధించినది. 'మానేజింగ్ ఏజెన్సీ' పద్ధతి ప్రపంచములో ఇంకే దేశములోను కనిపించదు. కొద్దిమంది బ్రిటిష్‌ప్రముఖులు భారతదేశ పారిశ్రామిక యంత్రమును తమ చేతులలో పెట్టుకొనుటకు దోహదము చేయటానికి బ్రిటిష్‌ప్రభుత్వమా విధానాన్ని మనపై రుద్దింది. బ్రిటిష్‌వారు వైదొలగిన తర్వాత ఆ స్థానమును తామాక్రమింపవలెనని ఆశిస్తున్న భారత పెట్టుబడిదారులకు 'మానేజింగ్ ఏజెన్సీ' పద్ధతిని రద్దు చేయవలెననుట అశనిపాతమువలె నున్నది. కాని భారతదేశ ఆర్థిక వ్యవస్థ దేశశ్రేయోభివృద్ధికి దోహదము చేయునట్లు వృద్ధిపొందవలెనన్న 'మానేజింగ్ ఏజెన్సీ' పద్ధతిని ముందుగా రద్దుపరచుట అవుసరము.

భారతదేశ జాతీయాదాయము ప్రజలందరికి న్యాయయుక్తముగ, సమంజసముగ పంపిణీ జరుగునట్లు చేయుట, దేశ అవుసరములకు తగినట్లు పరిశ్రమాభివృద్ధి వికేంద్రీకరణ సూత్రములపై జరుపుట లక్ష్యములుగా పెట్టుకొని ఆర్థికలక్ష్య నిర్వచనసంఘము తన నివేదిక తయారు చేసింది. వ్యవసాయమును, కుటీర పరిశ్రమలను సత్వరము, సహకారపద్ధతులపై ఆధునిక మార్గాలలో అభివృద్ధి జేయవలెనని, భారీపరిశ్రమలకు, కుటీర పరిశ్రమలకు పోటీరాకుండ ఏవేవి ఏయేవస్తువుల ఉత్పత్తిలో పాల్గొనవలెనో ముందుగా నిర్ణయించవలెననీ, వీలైనంతవరకు ప్రాంతీయ

స్వయంపోషకత్వము సాధించునట్లు వ్యవసాయిక, పారిశ్రామికాభివృద్ధి జరుపవలెననీ, రక్షణ, కీలక, సర్వజనోపయోగ పరిశ్రమలను ప్రభుత్వ పరముగనే నడుపవలెననీ, ఇప్పుడు వ్యక్తులచే నిర్వహింపబడుచున్న ఈ పరిశ్రమలను ఐదేండ్లతర్వాత ప్రభుత్వము వశపరచుకొనవచ్చుననీ, ఈలోగా పారిశ్రామిక, వ్యాపార నిపుణులుగా కొందరికి శిక్షణ యిప్పించి సిద్ధముగా వుంచుకొనవలసినదనీ, ప్రభుత్వపరముగా నడుస్తున్న పరిశ్రమలను నిర్వహించుటకు ప్రత్యేకసంస్థల నేర్పరుచవలెననీ, అన్నిరకముల పెట్టుబడిని కంట్రోల్ చేయవలెననీ, పెట్టుబడిపై పంచి పెట్టబడు లాభముల మొత్తమును నిర్ణీతమొనర్చవలెననీ, లాభములలో కొంతభాగము, పరిశ్రమ నిర్వహణాధికారములో పాలు కార్మికులకు లభింపవలెననీ, బ్యాంకింగ్, భీమా వవ్యహారములు ప్రభుత్వమే నిర్వహించవలెననీ, పరిశ్రమాభివృద్ధికి మార్గములు సూచించుటకు 'కేంద్ర ప్లానింగ్ కమీషన్' ఏర్పాటు చేయవలెననీ ఈ సంఘము సూచించెను. ఈ సూచనలు ఎ. ఐ. సి. సి. సమావేశములో ఆమోదింపబడెను. ఇవి ఏవిధముగా అమలు జరుగుచున్నవో పరిశీలించుటకు, రాష్ట్రప్రభుత్వములకు సిఫార్సులు చేస్తుండుటకు ఒక సంఘమును కూడ ఎ. ఐ. సి. సి. నియమించెను.

కలకత్తా, ఢిల్లీలలోని పారిశ్రామిక వేత్తల సంఘములు తమ సమావేశములలో ఈ సంఘ సూచనలను విమర్శిస్తూ వాటి నమలు జరుపరాదని కోరుతూ, భారత ప్రభుత్వ ఆర్థిక విధానమును స్పష్టపరచవలసినదని ప్రధాని పండిట్ నెహ్రూ, పరిశ్రమల శాఖమంత్రి డా. శ్యామప్రసాద్ ముఖర్జీగారల వద్దకు రాయబారాలు వెళ్లారు. పారిశ్రామికాభివృద్ధి జరుగకపోగా, ఉన్న ఫ్యాక్టరీలుకూడ పనిచేయక పోవు ప్రమాదము ఏర్పడెను. కాంగ్రెస్ ఆమోదించిన ఆర్థిక విధానము వలన ఇప్పుడున్న పరిశ్రమలకు ఎట్టి ప్రమాదము కలుగదని పండిట్ నెహ్రూ డా. ముఖర్జీలు వివరించి చెప్పినా పెట్టుబడిదారులు సంతృప్తి జెందలేదు. చివరకు భారత ప్రభుత్వ పారిశ్రామిక విధానమును నిర్వచిస్తూ

ఏప్రిల్ 7 వ తేదీన డా. శ్యామప్రసాద్ ముఖర్జీ అధినివేశ శాసనసభలో ఒక తీర్మానమును ప్రతిపాదించాడు.

ఈ తీర్మాన ప్రకారము పరిశ్రమలన్నియు మూడు భాగములుగా విభజింపవచ్చును: ఒకటి ప్రభుత్వమే నిర్వహించవలసిన పరిశ్రమలు; రెండు ప్రభుత్వము, వ్యక్తులుకూడ నిర్వహించ దగిన పరిశ్రమలు; మూడు వ్యక్తుల నిర్వహణకు వదిలివేయబడిన పరిశ్రమలు. ఆయుధ సామగ్రి ఆటంశక్తి, రైల్వేలు మొదలగు పరిశ్రమలు ఇప్పుడు ప్రభుత్వమే నిర్వహిస్తున్నది; ఇకముందుకూడ నిర్వహించుచుండగలదు. బొగ్గు, ఉక్కు, ఇనుము, విమానముల ఉత్పత్తి, నౌకా నిర్మాణము, టెలిగ్రాఫ్, వైర్ లెస్ సామగ్రి ఉత్పత్తి, లోహపు నూనెలు మొదలగు పరిశ్రమలు ఇప్పుడు వ్యక్తిపరముగా నిర్వహింపబడుతున్నవి. ఇకముందు ఈ పరిశ్రమలలో క్రొత్త ఫ్యాక్టరీలు ప్రభుత్వమే స్థాపిస్తుంది. ఇప్పుడు వ్యక్తులచే నిర్వహింపబడుచున్నవి, 10 సంవత్సరములవరకు వారిచేతులలోనే వుంచుతారు; ఈలోగా అభివృద్ధి చేయుటకు అన్ని అవకాశములు ఇస్తారు. పది సంవత్సరముల తర్వాత ప్రభుత్వము వానిని వశపరచుకుని తగిన పరిహారమిస్తుంది. ఇవి మొదటి తరగతికి చెందిన పరిశ్రమలు. ఇవిగాక దామోదర్ లోయ, కోసీలోయ, హీరాకుడ్ ప్రాజెక్టువంటి పెద్దప్రాజెక్టులనుకూడ ప్రభుత్వమే నిర్వహిస్తుంది.

కొన్ని ఇతర పరిశ్రమలు, దేశశ్రేయస్సు కొరకు, ప్రభుత్వపు అదుపులో నుండవలెను. ఉప్పు, మోటార్లు, ట్రాక్టర్లు, యంత్ర సామగ్రి, విద్యుచ్ఛక్తి సామగ్రి, రసాయనిక పదార్థములు, ఎరువులు, మందులు, రబ్బరు, పవర్ ఆల్కహాల్, వస్త్రపరిశ్రమ, సిమెంటు, పంచదార, కాగితము, న్యూస్ ప్రింట్, నౌకా, వాయురవాణాలు, ఖనిజములు మొదలగు పరిశ్రమలు ఈ తరగతిలో జేర్చబడినవి. ఈ పరిశ్రమలను ప్రభుత్వము స్థాపించవచ్చును. లేదా వ్యక్తులకు అనుమతి నివ్వవచ్చును. ఒక పరిశ్రమను వ్యక్తులు నిర్వహిస్తున్నను, దేశప్రయోజనాల ననుసరించి దానిని వశపరచుకొనటానికి ప్రభుత్వానికి హక్కువున్నది. ఇవి రెండవ

తరగతికి చెందిన పరిశ్రమలు. ఇతర పరిశ్రమలన్నీ వ్యక్తిపరముగా నిర్వహించవచ్చును. అయితే, వానినికూడ అవుసరమని తోచినప్పుడు ప్రభుత్వము వశపరచుకొన వచ్చును.

'మానేజింగ్ ఏజెన్సీ' పద్ధతిని రద్దుపరచుటకు, ప్రభుత్వము నిర్వహించు పరిశ్రమలను ప్రత్యేక సంస్థలద్వారా నిర్వహించుటకు నిశ్చయించిరి. కుటీర పరిశ్రమల అభివృద్ధికి, పరిశ్రమలశాఖలో ఒక ప్రత్యేక విభాగము నేర్పరతురు. కుటీర పరిశ్రమలకు అన్ని సహాయములు చేయబడును. వీని అభివృద్ధికి దోహదము చేయుటకు 'కుటీర పరిశ్రమల సంఘము'ను ఏర్పాటు చేసెదరు. మొత్తము పారిశ్రామికాభివృద్ధిని గురించి సిపార్సులుచేసి, కార్యక్రమ నిర్వహణను పరిశీలించుటకు ఒక ప్లానింగ్ కమిషన్‌ను నియమింతురు.

పారిశ్రామికాభివృద్ధితోపాటు కార్మికాభ్యుదయముకూడ జరుగవలెననియే భారతప్రభుత్వము భావిస్తున్నది. పరిశ్రమల నిర్వహణలోను, సంపాదించిన లాభములలోను కార్మికులకు పాలుండవలెను. ఈవిషయమై త్రైపాక్షిక పారిశ్రామిక సమావేశముచేసిన తీర్మానమును ప్రభుత్వమంగీకరించి తనవిధానములో అంతర్భాగముగా పరిగణిస్తున్నది.

విదేశస్థుల పెట్టుబడి భూతకాలములో మనదేశమునకు హాని కలిగించినది. కాని విదేశస్థుల పెట్టుబడిలేనిదే మనదేశము పారిశ్రామికముగా త్వరలో అభివృద్ధిచెందలేదు. కాబట్టి మనదేశప్రయోజనములకు హాని కలిగించని పరిస్థితిలో విదేశస్థుల పెట్టుబడిని అంగీకరింపవచ్చును. ఒక్కొక్క ప్రత్యేక పరిశ్రమలోనూ విదేశస్థులపెట్టుబడి ఎట్టి ఫలితము నిచ్చునో పరిశీలించి, అందుకు అనుమతి ఇవ్వబడునని ఈ తీర్మానములో తెలియజేయబడినది. మన పారిశ్రామికాభివృద్ధి ఆలస్యముగా జరిగినా సరేగాని నష్టదాయకములైన షరతులపై విదేశస్థుల పెట్టుబడి నాహ్వానించుటకు భారతప్రభుత్వ మంగీకరింపదు.

భారతపరిశ్రమలలో తమ కెట్టి స్థానమున్నదో వివరముగా స్పష్టపరచబడినది కాబట్టి పెట్టుబడిదారులందరు ప్రభుత్వముతో సహ

కరించి పారిశ్రామికాభివృద్ధి చురుకుగా సాగిస్తారని ఆశించాము. భారతప్రభుత్వ పారిశ్రామికవిధానమును వారు హృదయపూర్వకముగ ఆహ్వానించి, ఆమోదించి, సంతృప్తులైరి. కాని పారిశ్రామికాభివృద్ధి మాత్రము జరుగుటలేదు. యుద్ధకాలములో మనము సంపాదించి నిలువ చేసిన స్టర్లింగులో 83 మిలియన్ పౌనులు (దాదాపు 110 కోట్ల రూపాయలు) పారిశ్రామికాభివృద్ధికి అవుసరమగు యంత్రసామగ్రి కొనుక్కొనుటకు గత సంవత్సరము విడుదలచేయగా అందులో మూడు మిలియన్ పౌనులు మాత్రమే ఖర్చయ్యెను. విదేశద్రవ్యము అడిగినవారికెల్ల లేదనకుండ ఇస్తున్నామని ఖజానామంత్రి ప్రకటించాడు. మన పారిశ్రామికాభివృద్ధికి పారిశ్రామికవేత్తలు ఎంత తోడ్పడుచుండిరో దీనివలన విశదమైనది. ఇట్టివారితో ఏమని ప్రభుత్వమే పూనుకుని పరిశ్రమలను స్థాపించవలసినది. కాని అది జరుగలేదు. ఏమంటే ఇతర అత్యవుసర కార్యములలో ప్రభుత్వము నిమగ్నమై వున్నదంటారు. ఇంతమంది మంత్రులుండగా అందరూ ఒకేవిషయమునే ఆలోచిస్తున్నారా? ప్రధాని ఇతరమంత్రులు ఇతరవ్యవహారాలను చక్కబెట్టుతున్నప్పుడు పరిశ్రమల మంత్రి ఆరోగ్యము కలిగించుకొనక పరిశ్రమాభివృద్ధికి ఎందుకు కృషి చేయరాదు? పారిశ్రామికాభివృద్ధికి కావలసిన యంత్రసామగ్రి బ్రిటన్, అమెరికాలనుండి రావలెను. ఆర్డర్లిచ్చిన రెండేండ్లకుకూడ సరకు వచ్చుట లేదని మరొక సాకు చెప్పెదరు. బ్రిటన్, అమెరికాలుగాక యంత్ర సామగ్రి సరఫరాచేయుగల దేశము లనేకము లున్నవి. ఫ్రాన్సు, బెల్జియం, స్వీడన్, స్విట్జర్లాండు, చెకోస్లవేకియాలు మనకు కావలసిన యంత్ర సామగ్రిని, జర్మనీ మనకు కావలసిన నిపుణులను సరఫరాచేయగలవు. ఆయా దేశములలో ఏయే వస్తువులు దొరకునో విచారించుటగాని, భారీగా ఆర్డర్లిచ్చుటగాని జరుగలేదు. అసలు బ్రిటన్‌లోనే వస్తువులకు ఏమంత పెద్దఆర్డర్లు ఇవ్వలేదని బ్రిటిష్ కంపెనీలు చెప్పుచున్నవి. పారిశ్రామికాభివృద్ధి మాటలప్రకరణములోనే వుంది; చేతలప్రకరణలోనికి ప్రవేశింపలేదు. గత సంవత్సరము ఈ రంగములో మనము సాధించినది శూన్యము.



# రాజ్యాంగ పరిషత్తు

ఆగస్టు 14-15 వ తేదీ అర్ధరాత్రి జరిగిన చరిత్రాత్మక సమావేశంలో భారతదేశంపై సర్వాధికారాలను బ్రిటిష్ ప్రభుత్వంనుండి భారత రాజ్యాంగ పరిషత్తు వశపరచుకొన్నది. ఆ ఘడియలోనే భారత అధినివేశం ఉద్భవించింది. అప్పటినుండి రాజ్యాంగపరిషత్తు భారత శాసనసభగా కూడ వ్యవహరించవలసి వచ్చింది. శాసనసభా విధులు ఎక్కువగా వుండటంవలనా, రాజ్యాంగచట్టనిర్మాణంలో పాల్గొనవలసిన ప్రముఖులు ముఖ్యమైన పదవుల నిర్వహిస్తూ రాజ్యాంగచట్ట నిర్మాణమునకు ఎక్కువ కాలము వినియోగించలేకపోవుటవలనా రాజ్యాంగ చట్టనిర్మాణము కొంతవరకు ఆలస్యమైనది.

అధికారదత్తతకు పూర్వం 1947 వ సం. జూలై 19 వ తేదీనుండి 31 వ తేదీవరకు రాజ్యాంగపరిషత్తు సమావేశమయ్యెను. ఇది పరిషత్తు తృతీయ సమావేశము. ఈ సమావేశానికి 80 మంది క్రొత్త సభ్యులు హాజరైనారు. వీరిలో కొందరు ఇదివరకటినుండి సభ్యులుగావున్నా, దేశవిభజన నిర్ణయంవలన తమ స్థానాలను పోగొట్టుకుని, క్రొత్త నియోజకవర్గాలలో ఎన్నుకొనబడ్డారు. ముస్లింలీగ్ సభ్యులు 23 గురు ఈ సమావేశానికి హాజరైరి. విభజనపథకాన్ని కాంగ్రెస్ - ముస్లింలీగ్‌లు ఆమోదించటంతో, భారత ముస్లింలు తమ వైఖరిని మార్చుకుని రాజ్యాంగపరిషత్తుకు హాజరైరి. బరోడా, పాటియాలా, కూచ్-బీహార్, సిక్కిమ్, మణిపూర్, రాంపూర్, మైసూర్, కొచ్చిన్, గ్వాలియర్, ఆళ్వార్, బికనీర్, రాజపుటానా, పశ్చిమ ఇండియా, గుజరాత్, దక్కన్ సంస్థానాల ప్రతినిధులు 37 గురు ఈ సమావేశములోనే రాజ్యాంగపరిషత్తుకు ప్రథమపర్యాయం హాజరైరి. ఈ సమావేశములో రాజ్యాంగపరిషత్తులో ముఖ్యముగా మూడు విషయాలు ప్రస్తావనకు వచ్చినవి. 1. భారతరాజ్యాంగచట్టములో, కేంద్రప్రభుత్వ అధికార

ములను సూచించుటకు నియమింపబడిన ఉపసంఘ నివేదిక; 2. రాష్ట్ర రాజ్యాంగ స్వరూపనమూనాను సూచించుటకు నియమింపబడిన ఉపసంఘ నివేదిక; 3. భారతజాతీయ పతాక స్వరూపము.

రాజ్యాంగపరిషత్తు చతుర్థసమావేశం అధికారదత్తత తర్వాత, ఆగస్టు 20 వ తేదీనుండి ప్రారంభమైంది. అప్పటినుండి ఆగస్టు నెలాఖరు వరకు పరిషత్తు మూడు విషయములను గురించి ఆలోచించింది: 1. కేంద్ర, రాష్ట్రప్రభుత్వాల అధికారాలను సూచించటానికి ఏర్పాటు చేయబడిన ఉపసంఘముల ద్వితీయ నివేదిక; 2. అల్పసంఖ్యాకుల హక్కుల రక్షణను గూర్చి సలహాలిచ్చుటకు ఏర్పరుచబడిన ఉపసంఘ నివేదిక. ఇప్పటివరకు అమలులోవున్న ప్రత్యేక నియోజకవర్గాలను రద్దుచేసి అన్ని మతాలకు సమిష్టి నియోజకవర్గాల నేర్పాటుచేయాలని ఈ సంఘము సూచించింది. 3. రాజ్యాంగపరిషత్తు, అధినివేశ శాసనసభగా వ్యవహరించుటనుగూర్చి ఆలోచించుటకు ఏర్పాటుచేసిన ఉపసంఘ నివేదిక.

ఆయా ప్రత్యేక అంశములనుగూర్చి సిఫార్సులు చేయుట కేర్పాటు చేసిన ఉపసంఘాల నివేదికలను, వానిపై రాజ్యాంగపరిషత్తు సమావేశంలో జరిగిన చర్చలను క్రోడీకరించి, భారతరాజ్యాంగచట్టము సాయిదాను తయారుచేయుటకు అధినివేశ ప్రభుత్వ న్యాయ శాఖా మంత్రి డా. భీమారావు అంబేద్కర్ అధ్యక్షతన ఒక ఉపసంఘము నియమించిరి. శ్రీ గోపాలస్వామి అయ్యంగార్, శ్రీ అల్లాడి కృష్ణ స్వామి అయ్యర్, శ్రీ కె. యం. మున్షి, సయ్యద్ మహమ్మద్ సాదుల్లా, శ్రీ యన్. మాధవరావు, శ్రీ డి. పి. కైతాన్‌లు ఈ సంఘంలో ఇతర సభ్యులు. అనేకదేశాల రాజ్యాంగాలనుగురించి తమకుగల విజ్ఞానముతో వీరు భారతరాజ్యాంగచట్ట ముసాయిదాను తయారుచేసి, 1948 వ సం. ఫిబ్రవరి 21 వ తేదీన రాజ్యాంగపరిషత్ అధ్యక్షునకు సమర్పించారు. ఆయన ఫిబ్రవరి 25 వ తేదీన ఆ ముసాయిదా ప్రచురించి, ప్రజాభిప్రాయము నాహ్వానించెను. రాజ్యాంగపరిషత్తు ఈ పర్యాయము సమావేశమైనప్పుడు ఈ ముసాయిదాను చర్చించి, ఆమోదించును.

జనవరి 27 వ తేదీన రాజ్యాంగపరిషత్తు సమావేశమై తూర్పు పంజాబ్, పశ్చిమ బెంగాల్ ల ప్రతినిధుల సంఖ్యను పెంచుటకు నిర్ణయించెను. తూర్పుపంజాబ్‌కు అధికముగా నాలుగు సభ్యత్వములను, పశ్చిమబెంగాల్‌కు అదనముగా రెండు సభ్యత్వములను యిచ్చిరి. సంస్థానములు సంశ్లిష్టరాష్ట్రములతో కలసిపోవుట, సంస్థానకూటములుగా ఏర్పడుటవలన వాటి ప్రాతినిధ్యములో జరుగవలసిన మార్పులను గూర్చి కూడ ఈ సమావేశములో ఆలోచించారు.

## రాజ్యాంగచట్ట ముసాయిదా

రాజ్యాంగచట్ట రచన న్యాయశాస్త్ర మేధావుల పాండిత్య ప్రకర్షకు ప్రత్యేకింపబడిన రంగమని ఈ శతాబ్దారంభమువరకు భావిస్తుండేవారు. అందులోను ప్రజాస్వామ్యపద్ధతి ననుసరించు రాజ్యాంగచట్టరచన బ్రిటిష్ రాజ్యాంగము ననుసరించి జరుగవలెననే అప్పటివారి అభిప్రాయము. ఇప్పుడా అభిప్రాయాలు మారిపోయాయి. రాజ్యాంగ చట్టము గ్రుడ్డిగా బ్రిటిష్ నమూనా ననుసరించుటగాక దేశప్రజల సాంప్రదాయాలకు విజ్ఞానానికి అనుగుణంగా వుండవలెననీ, దాని మంచి చెడ్డలు కాలమే నిర్ణయించగలదనీ ఇప్పటి పెద్దలు భావిస్తున్నారు.

అంబేద్కర్ సంఘము రచించిన రాజ్యాంగము, భారతదేశములో ఏ విప్లవాత్మకమార్పులను తెచ్చుటకు ఉద్దేశింపబడలేదు. మనదేశములో జరగవలసిన విప్లవాత్మకమార్పులు ఇప్పటికే జరిగిపోయినవని భావించే వారికి ఈ ముసాయిదా సంతృప్తికరముగానే వుంటుంది. మనదేశంలో జరుగవలసిన విప్లవాత్మకమార్పులు కేవలము రాజకీయమార్పులే కాదనీ, మన విప్లవాత్మక కార్యక్రమం ఇంకా పూర్తికాలేదనీ భావించేవారికి ఈ ముసాయిదా సంతృప్తికరంగా వుండదు.

రాజ్యాంగచట్ట ముసాయిదాలో 315 నిబంధనలు, 18 భాగములలోకి విభజింపబడివున్నవి. దీనికి 8 షెడ్యూల్‌లు అనుబంధించారు. ఇదంతా మొత్తం 214 పేజీలలో ముద్రించి ప్రకటించారు.

ముసాయిదా ఉపక్రమణికలో రాజ్యాంగచట్ట ఆశయం ఈవిధంగా వివరించారు. "భారతదేశ ప్రజలమైన మేము భారతదేశాన్ని ఒక సర్వ స్వతంత్ర ప్రజాస్వామ్య రిపబ్లిక్ గా ఏర్పరచటానికీ; దానిలోని ప్రజలందరికీ సామాజిక, ఆర్థిక, రాజకీయన్యాయమును; భావనా, వక్తృత్వ, విశ్వాస, మతైక, ఆరాధనా స్వేచ్ఛను; హోదా, అభివృద్ధి అవకాశముల సమతను; వ్యక్తిత్వదర్జాను, జాతిఐక్యతను దృఢపరచు సౌభ్రాతృత్వమును పెంపొందించటానికి... ఈ మా రాజ్యాంగపరిషత్తులో ఈనాడు...... ఈ రాజ్యాంగచట్టమును ఏర్పరచి, ఆమోదించి అనువర్తింపజేసికొనుచున్నాము."

రాజ్యాంగపరిషత్తు ఆదిలో ఆమోదించిన లక్ష్యనిర్వచనతీర్మానము ననుసరించే ఈ ఉపక్రమణిక వ్రాశారు. సౌభ్రాతృత్వాన్ని గురించిన ప్రస్తావనమాత్రం ప్రస్తుత పరిస్థితులను దృష్టిలోపెట్టుకుని క్రొత్తగా జేర్చారు.

ముసాయిదా రాజ్యాంగచట్టం 18 భాగాలుగా విభజించారు. 1. యూనియన్, దానిభూభాగము, అధికారవిస్తరణ, 2. పౌరసత్వము, 3. ప్రాథమికహక్కులు, 4. ప్రభుత్వ విధాన నిర్వచనసూత్రములు, 5. యూనియన్ — యూనియన్ కార్యవర్గము, శాసనసభ, అధ్యక్షుని శాసనాధికారములు, కేంద్ర న్యాయ నిర్వహణ, ప్రభుత్వ లెక్కల తణిఖీ, 6. యూనియన్ రాష్ట్రములు (గవర్నర్ రాష్ట్రములు) వాని కార్యవర్గము, శాసనసభలు, గవర్నర్ శాసనాధికారములు, అత్యవసర పరిస్థితులలో విశేషాధికారాలు, వెనుకబడినజాతులు, న్యాయనిర్వహణ, లెక్కల తణిఖీ, 7. యూనియన్ రాష్ట్రములు (ఛీఫ్-కమీషనర్ రాష్ట్రాలు) వాటిపరిపాలన, స్థానిక శాసనసభల నిర్మాణము, 8. యూనియన్ ఇతరభూభాగాలు భారతసంస్థానాలు మొదలైనవి. 9. యూనియన్ రాష్ట్రాల సంబంధాలు, శాసనాధికారాలపంపిణీ, శాసనాధికారాల తణిఖీ, అంతర్ రాష్ట్రవ్యాపారము, రాష్ట్రసమన్వయము, 10. ఖజానా, ఆస్తులు, కంట్రాక్టులు, వ్యాజ్యములు, 11. అత్యవసరపరిస్థితు

లలో విశేషాధికారాలు, 12. సేవకులు, 13. ఎన్నికలు, 14. అల్ప సంఖ్యాకులకు ప్రత్యేకరక్షణలు, 15. తదితరములు, అధ్యక్షగవర్నలకు హామీ మొదలగునవి, 16. రాజ్యాంగ చట్టసవరణలు, 17 తాత్కాలిక సంధికాలపు నిబంధనలు, 18. రాజ్యాంగచట్టము అమలు, ప్రారంభము, రద్దు.

## పౌరసత్వము

భారతదేశ పౌరసత్వం ఎవరెవరికి లభించగలదో 5 వ నిబంధనలో వివరించారు. భారతదేశంలో జన్మించినవారికీ, భారతదేశంలో జన్మించకపోయినా తల్లిదండ్రులు, ఉభయపక్షములతాత, ముత్తవలలో ఏ ఒక్కరైనా భారతదేశంలో జన్మించినా అట్టివారికీ భారతదేశ పౌరసత్వం లభిస్తుంది. ఈమధ్యజరిగిన కల్లోలాలలో భారతదేశానికి శాశ్వతంగా వలసవచ్చివేసినవారు తాము ఈ దేశంలోనే వుండిపోదలచామని జిల్లాఅధికారికి ఈ రాజ్యాంగచట్టం అమలులోకి రాకపూర్వం తెలియపరిచివుంటే భారతదేశ పౌరసత్వం పొందుతారు.

## ప్రాథమిక హక్కులు ప్రభుత్వ లక్ష్యము

ఆయాకాలాలలో అధికారంలోవున్న ప్రభుత్వాల ఇష్టాయిష్టాలపై ఆధారపడి వుండకుండా, కొన్ని సాముదాయిక, వ్యక్తిగత హక్కులు ప్రజలకు ఎల్లప్పుడు లభింపజేయటం అవుసరమని అన్నిదేశాలు గుర్తించాయి. ప్రజాస్వామ్య పద్ధతిప్రకారం పరిపాలన జరుగుతున్న ఈ రోజులలో, శాసనసభలలో సంఖ్యాబలాన్ననుసరించి ఒక్కొక్క రాజకీయ పక్షం అధికారం హస్తగతం చేసుకుంటుంటుంది. ఏ రాజకీయపక్షం అధికారంలోవున్నా కొన్ని ప్రాథమిక హక్కులు ప్రజలందరికీ, చట్టరీత్యా, న్యాయశాస్త్రప్రకారం అమలు జరుపటానికి వీలైనట్లుగా, లభింపజేయకపోతే, నిరంకుశపరిపాలనకు దారితీసినట్లవుతుంది. అందువల్ల ప్రజాస్వామ్యపద్ధతి ననుసరించే అన్ని రాజ్యాంగ చట్టాలలోను కొన్ని ప్రాథమిక హక్కులు పేర్కుంటారు. మన రాజ్యాంగచట్ట ముసాయిదా

మూడవభాగంలో ఈ ప్రాథమిక హక్కులూ, నాలుగవభాగంలో ప్రభుత్వాలు పాటుపడవలసిన లక్ష్యాలు సూచించారు. సర్వప్రజల సమానత్వమునకు హక్కు, మత, సంస్కృతి, విద్యా హక్కులు, ఆస్థి హక్కు, న్యాయశాస్త్రప్రకారం న్యాయంపొందుటకు హక్కు మొదలైనవి ఈ భాగంలో పేర్కొన్నారు. జాతి, మత, కుల, లింగ విభేధాలవల్ల ఎట్టి అడ్డంకులు కల్పించకూడదనీ, అస్పృశ్యత పాటించకూడదనీ, ఇతరప్రభుత్వాల బిరుదులు అంగీకరించరాదనీ, నిర్బంధసేవ చేయించుకోకూడదనీ ఈ భాగంలో స్పష్టపరిచారు. ఏ ప్రాథమిక హక్కులకైనా ప్రభుత్వం భంగం కలిగిస్తే, న్యాయస్థానాలద్వారా ఆ హక్కులను కాపాడుకోవచ్చు.

భారతప్రభుత్వము ఏ లక్ష్య సిద్ధికి పాడుపడాలో వివరిస్తూ కొన్ని సూచనలు నాలుగవభాగంలో చేశారు. ఇవికూడా ప్రాథమిక హక్కులలాంటివే అయినా, న్యాయస్థానాలద్వారా వీటిని కాపాడుకొనే అధికారం లేదు, వీటి ఆచరణ, అనుసరణ, విపులీకరణ, అప్పుడు అధికారంలోవున్న రాజకీయపక్షు అభిప్రాయాలపై ఆధారపడి వుంటుంది.

అల్పసంఖ్యాకులగు ముస్లిములకు, ఆంగ్లో-ఇండియన్లకు, క్రైస్తవులకు కొన్ని ప్రత్యేక హక్కులిచ్చారు. భారతదేశ స్వాతంత్ర్యాన్ని నిరోధిస్తూను, న్యూనతపరుస్తూను ఈ వర్గాలు చేసిన, చేస్తున్న కృషి చూసినవారికి, వీరికి ప్రత్యేక హక్కులివ్వటం క్రోధకారణం కావచ్చును. కాని అది భారతప్రభుత్వ నిష్పాక్షికత, సహనశీలత, ఉదారతలకు నిదర్శనము మాత్రమే.

## కేంద్రము

సామాన్యంగా, చిన్నదేశాలలో సర్వాధికారాలు కేంద్రప్రభుత్వానికే వుంచి, స్థానికస్వపరిపాలన సంస్థలను దాదాపు నామమాత్రపు అధికారాలతో ఏర్పాటుచేస్తారు. పెద్దదేశాలలో ఇట్టి విధానం పనికిరాదు. దేశమును రాష్ట్రాలుగా విభజించి, వీటైనన్ని ఎక్కువ అధికారాలను రాష్ట్రప్రభుత్వాలకే ఇచ్చి, అన్నిరాష్ట్రములకు సంబంధించిన కొన్ని ముఖ్య అధికారాలనే కేంద్రప్రభుత్వానికిస్తారు. దీనినే

ఫెడరల్ విధానమంటారు. రాజ్యాంగచట్ట ముసాయిదా తయారు చేయుటకు మనదేశానికి కెనడా, ఆస్ట్రేలియాల ఫెడరల్ విధానాన్ని నమూనాగా తీసుకున్నారు. కాని దేశానికి సర్వాధికారిగా అధ్యక్షు డుండవలెనని సూచించి, పార్లమెంటరీ విధానముతో అతని అధికారాలను సమన్వయపరచుటకు కొంత తంటాలు పడవలసి వచ్చింది. అధ్యక్షుడు సర్వాధికార సంపూర్ణుడుగానైన వుండవచ్చును; కేవల నామమాత్రంగా నైనా వుండవచ్చును. సర్వాధికారాలు అధ్యక్షునకే వుంటే, పార్ల మెంటరీ విధానం సాగదు; మంత్రివర్గ బాధ్యతకు తావే వుండదు. ఇట్టి పద్ధతి అమెరికాలో ఆచరణలోవున్నది. కొన్నిదేశాలలో అధ్య క్షుడు నామమాత్రంగానే వుండి, వాస్తవ అధికారమంతా మంత్రి వర్గము చేతిలోవుండును.

భారతదేశ అధ్యక్షుడు కేంద్రరాష్ట్ర శాసనసభ లన్నింటిచే ఎన్నుకోబడుతాడు. ప్రతివిషయముపైనా వివరాలన్నీ అడిగి తెలుసు కోవటానికీ, ఒక్కొక్క మంత్రి చర్యలను మంత్రివర్గమంతా చర్చించి, ఆమోదించాలని కోరటానికీ, ఆర్డినెన్సులు జారీచేయటానికీ, శాసన సభలకు 'ఆదేశాలను' పంపటానికీ ఇతనికి అధికారంవుంది. 'ఆదేశాలను' పంపే పద్ధతి పార్లమెంటరీ విధానికి వ్యతిరేకము. బ్రిటన్ అమెరికన్ రాజ్యాంగాలలోని మంచి నంతను సంయుక్తపరచాలను ఆశతో తెచ్చి పెట్టుకున్న పొరపాటులలో ఇది ముఖ్యమైనది.

కేంద్రశాసనసభలు రెండుంటవి. ఒకటి ప్రజాప్రతినిధుల సభ; రెండు రాష్ట్రప్రతినిధులసభ. ప్రజాప్రతినిధుల సభలో, వయోజను లందరిచే, 5 నుండి 7½ లక్షల ప్రజల కొకరు చొప్పున ఎన్నుకొనబడిన దాదాపు 500 మంది ప్రతినిధు లుంటారు. రాష్ట్రప్రతినిధుల సభలో రాష్ట్రాల, సంస్థానాల ప్రతినిధులుంటారు. సభలో కొందరు నామినే టెడ్ సభ్యులుకూడా వుంటారు. ఈ సభలో రాష్ట్రాల ప్రతినిధులు, వివిధరాష్ట్రాల జనాభాను బట్టిగాని, అన్నిరాష్ట్రాలకు సమానంగా గాని, వుండరు.

ఫెడరల్ పద్ధతిలో అధికారం కేంద్ర, రాష్ట్రప్రభుత్వాలమధ్య పంచబడినప్పుడు, ఒడిదుడుకులు లేకుండా, సాఫీగా వ్యవహారాలు సాగిపోవటానికి తగాదాలు పరిష్కారంచేసే 'న్యాయనిర్వాహకవర్గం' వుండాలి. ఇందుకొరకు అన్ని ఫెడరల్ దేశాలలోను సుప్రీంకోర్టు ఏర్పరుస్తారు. మన రాజ్యాంగ చట్ట ముసాయిదా ప్రకారంకూడా ఒక సుప్రీంకోర్టు బహుశః అక్టోబరు నెలలో ఏర్పడుతుంది. దీనిలో న్యాయమూర్తులను భారత అధ్యక్షుడు నియమిస్తాడు. సుప్రీంకోర్టు మామూలు వ్యాజ్యాలనే గాక రాష్ట్రాల మధ్య పరస్పరంగాను, కేంద్రానికి రాష్ట్రాలమధ్య పరస్పరంగాను, కేంద్రానికి రాష్ట్రాలకు రాజ్యాంగాన్ని గురించి సంభవించే వివాదాలను పరిష్కరిస్తుంది.

## రాష్ట్ర రాజ్యాంగము

భారతసంస్థానాలను, రాష్ట్రాలను కలియగట్టుకురావటం కేంద్ర ప్రభుత్వానికి ఎప్పుడూ ఒక సమస్యగా వుంటుండేది. నూతన రాజ్యాంగంలో కూడా ఈ సమస్య వుండేదేగాని సంస్థానాలు సంశ్లిష్ట రాష్ట్రాలతో కలసిపోవటంవల్లనూ, సంస్థాన కూటములుగా ఏర్పడి ఎక్కువ అధికారాలను కేంద్రప్రభుత్వానికి దఖలు పరచటంవల్లనూ ఈ సమస్య చాలవరకు పరిష్కారమై పోయింది. కొన్ని పెద్ద సంస్థానాలకు తప్ప, ఇతర సంస్థానాలకు, రాష్ట్రాలకు కేంద్రప్రభుత్వ శాసనాలు ఒకే విధంగా వర్తిస్తవి.

రాజ్యాంగచట్ట ముసాయదాలో సూచించిన రాష్ట్రరాజ్యాంగముసాయదా ప్రకారం ప్రతిరాష్ట్రానికి ఒక గవర్నర్ వుంటాడు. ఇతడిని ప్రజలు ఎన్నుకోవాలో, అధ్యక్షుడు నియమించాలో ఇంకా నిర్ణయం కాలేదు; ఈ రెండువిధాలు గాక, రాష్ట్ర శాసనసభ ఎన్నుకుంటే బాగుంటుందేమో! అత్యవసర పరిస్థితులలో తప్ప ఇతడికి ఎక్కువ అధికారాలేమీ లేవు. అప్పుడయినా, రాజ్యాంగచట్టం తాత్కాలికంగా రద్దుపరచి, రాష్ట్రాన్ని కేంద్రప్రభుత్వ యజమాన్యాన పరిపాలించటమే ఇతడు చేయగల్గినది.

రాష్ట్ర శాసనసభలు ఒకటి వుండాలో రెండు వుండాలో ఏ రాష్ట్రాని కారాష్ట్రమే నిర్ణయించుకోవాలి. దిగువ శాసనసభలో వయోజనులచే ఎన్నుకోబడిన ప్రతినిధులుంటారు. ఎగువ శాసనసభవున్న రాష్ట్రాలలో ఆసభ వృత్తి ప్రాతిపదికపై ఎన్నుకోబడుతుంది. రాష్ట్ర పరిపాలన, మంత్రివర్గమే నిర్వహిస్తుంది.

## కేంద్ర రాష్ట్రాల సంబంధాలు

ఫెడరల్ పద్ధతిపై రాజ్యాంగ చట్టాన్ని తయారుచేసేటప్పుడు ఏ యే అధికారాలు కేంద్రానికి వుండాలో ఏ యే అధికారాలు రాష్ట్రానికి వుండాలో నిర్ణయించటం చాల గడ్డుపని. కేంద్రానికి వీలైనన్ని తక్కువ అధికారా లుండాలనేవారు కొందరుంటారు; వీలైనన్ని ఎక్కువ అధికారాలు కేంద్రానికే వుండాలనే వారూ వుంటారు. ఈ రెండువర్గాలను సంతృప్తిపరచటం అసాధ్యమైనపని. సూత్రప్రాయంగా ఎక్కువ అధికారాలను రాష్ట్రాలకు యిచ్చినా, 'ఎకనామిక్ ప్లానింగ్' లాంటి పెద్ద అధికారాన్ని కేంద్రం వుంచుకుని, దానిపేరుతో సర్వాధికారాలు చెలాయించి, రాష్ట్రాల అధికారాలను సంకుచితం చేయటానికి కూడా అవకాశం వుంటుంది. కాబట్టి రాష్ట్ర, కేంద్రప్రభుత్వాల అధికారాల విషయం జాగ్రత్తగా ఆలోచించవలసి వుంటుంది.

ప్రస్తుత ముసాయదాప్రకారం అధికారాలన్నీ కేంద్ర, రాష్ట్ర, ఉభయ అధికారాలుగా విభజించారు. 'ఉభయ' అధికారాలను, అవుసరాన్నిబట్టి కేంద్రము, రాష్ట్రముకూడా చెలాయించవచ్చును. ఈ మూడు విభాగాలలోను పేర్కొనబడని అధికారాలను 'శేషాధికారాలు' అంటారు. యునైటెడ్ స్టేట్స్, సోవియట్ యూనియన్, ఆస్ట్రేలియాలలో శేషాధికారాలు రాష్ట్రాలకే వుంటాయి. కాని మన దేశంలో శేషాధికారాలు కేంద్రానికే చెందాలన్నారు. ఇంతే గాక రాష్ట్ర అధికారాలలో పేర్కొనబడిన అధికారమైనా సరే, 'జాతీయ ప్రాముఖ్యత' ననుసరించి ఒకొక్కప్పుడు కేంద్రప్రభుత్వం చెలాయింప

వచ్చును. ఆ అధికారం 'జాతీయ ప్రాముఖ్యత' వహించిందని, రాష్ట్ర ప్రతినిధుల సభ తీర్మానిస్తేనే ఈ అధికారం కేంద్రానికి లభిస్తుంది. మొత్తంమీద, మనకు ఏర్పడబోయే కేంద్రం చాలబలిష్టముగాను, ఎక్కువ అధికారాలు కలది గాను వుంటుంది.

ఈ ముసాయిదాను పరిశీలించి, ఆమోదించటానికి రాజ్యాంగపరిషత్తు ఏప్రిల్ నెలలోనే సమావేశం కావలసింది. కాని ఆ సమావేశం ప్రస్తుత పరిస్థితులవల్ల అక్టోబరు నెలవరకు వాయిదాపడింది. అక్టోబరు నెలలో రాజ్యాంగపరిషత్తు సమావేశమై, స్వల్పమార్పులతో ఈ ముసాయిదాను ఆమోదిస్తుందని మనం ఆశించవచ్చును. ఈ సంవత్సరాంతంలోగానే ఆమోదింపబడినా క్రొత్తగా ఎన్నికలు జరిగి, రాజ్యాంగ చట్టం అమలులోకి రావటానికి మరి రెండుసంవత్సరాలైనా పట్టవచ్చును.



# ఇండియా - పాకిస్థాన్ సంబంధాలు

భారతదేశం ఇండియా, పాకిస్థాన్‌లుగా విభాగమైపోయినా ఈ రెండు దేశాలమధ్య సన్నిహిత సంబంధాలు వుండి, సౌభ్రాతృత్వంతో వ్యవహరించకపోతే స్వాతంత్ర్యం ఎంతోకాలం నిలవదనీ, అభ్యున్నతి అసంభవమనీ రెండుపక్షాల నాయకులు గుర్తించారు. భారతదేశంనుండి విడిపోయి, స్వతంత్ర దేశంగా ఏర్పడినా, ఇండియా యూనియన్‌తో అతి సన్నిహితంగా వ్యవహరించటమే తమ ఉద్దేశ్యమనీ, అల్పసంఖ్యాకులకు ఏవిధమైన కష్ట, నష్టములు కలుగకుండ కాపాడుతూ, అధిక సంఖ్యాకులైన ముస్లింల అభ్యున్నతికి పాటుపడటమే తమ ఆశయమని ముస్లింలీగ్ నాయకులు అనేక పర్యాయాలు ఉద్ఘాటించారు. తూర్పు పాకిస్థాన్, పశ్చిమ పాకిస్థాన్‌లమధ్య ఒక వెయ్యిమైళ్ళదూరం ఇండియా భూభాగం వుడటంవలన పాకిస్థాన్ రెండు భాగాలమధ్య రవాణా రాకపోకలు త్వరగా జరగాలంటే ఇండియా యూనియన్‌తో పాకిస్థాన్ సఖ్యంగా వుండక తప్పదు. కరాచీనుండి చిట్టగాంగ్‌కు నౌకాప్రయాణం చేసి ఇండియా భూభాగంపైన గాని, మీదుగా గాని వెళ్ళటం మాని వేద్దామని పాకిస్థాన్ నిర్ణయిస్తే, అసలు దాని పరిపాలనే అసంభవమై పోతుంది. తూర్పు పాకిస్థాన్ దాదాపు పూర్తిగా ఇండియా భూభాగంచే ఆవృతమై వున్నది. దాని ఆర్థిక వ్యవహారాలన్నీ కలకత్తానుండి నిర్వహింపబడుతున్నవి. ఇండియాతో ఏదైనా వివాదం పెట్టుకుంటే తూర్పు బెంగాల్‌ను త్వరలోనే పూర్తిగా కోల్పోవటానికే పాకిస్థాన్ సిద్ధపడి వుండాలి. పశ్చిమ పాకిస్థాన్ కూడా ఎక్కువ భాగం ఇండియాచే ఆవృతమై వున్నది. కాశ్మీర్ భారతదేశంలో చేరటంతో పశ్చిమ పంజాబ్, సరిహద్దు రాష్ట్రాల రక్షణ ఇండియా దయాదాక్షిణ్యాలపై ఆధారపడిపోయింది. కాశ్మీర్‌నుండి సేనలు బయలుదేరితే సరిహద్దు, పశ్చిమ పంజాబ్ రాష్ట్రాలను ఏకకాలంలో ఆక్రమించుకోగలవు. పైగా ఈ రెండురాష్ట్రాలు పీఠభూములై వుండటంవలన శత్రుదాడులను

నిరోధించటం చాలకష్టమై పోతుంది. ఒక్కరక్షణ దృష్ట్యానే గాక ఆర్థిక పరిస్థితుల దృష్ట్యాకూడా పాకిస్థాన్ ఇండియాపైననే ఆధారపడి వున్నది. పాకిస్థాన్‌కు కావలసిన బట్టలు, రాతిబొగ్గు పూర్తిగా ఇండియా నుంచే సప్లయి కావాలి. పాకిస్థాన్‌లో పండే జనపనార, ప్రత్తి, మిగులు ఆహారధాన్యాలు భారత యూనియన్‌లో అమ్ముకోవటం వారికే లాభకరం. కాబట్టి, పాకిస్థాన్ విడిపోయినా, ఆర్థికంగా ఇండియాతో సన్నిహిత సంబంధాలు ఏర్పరచుకోక, ఇండియాపై ఆధారపడి వుండక తప్పదని అందరూ గ్రహించారు.

దేశవిభజనకు ఉభయపక్షాలు జూన్ 3 వ తేదీ పథకంప్రకారం అంగీకరించినప్పుడు విభజన కార్యకలాపాన్ని నిర్వహించటానికి నాలుగు విభజన సంఘాలను రాజప్రతినిధిగా లార్డ్ మౌంట్ బాటన్ నియమించాడు. వీనిలో ఒకటి కేంద్రప్రభుత్వ ఆస్థి, అప్పులను ఇండియా, పాకిస్థాన్‌లకు, రెండవది పంజాబ్ రాష్ట్రి ఆస్థి, అప్పులను తూర్పు, పశ్చిమ పంజాబ్ రాష్ట్రాలకు, మూడవది బెంగాల్ రాష్ట్రి ఆస్థి అప్పులను తూర్పు పశ్చిమ బెంగాల్ రాష్ట్రాలకు, నాలుగవది సిల్హెట్ జిల్లా ఆస్థి, అప్పులను ఆస్సాం, తూర్పు బెంగాల్ రాష్ట్రాలకు పంచటానికి ఏర్పాటు చేశారు. కేంద్రప్రభుత్వ ఆస్థి అప్పులను పంచే విభజన సంఘంలో ఇండియా తరఫున సర్దార్ పటేల్, డా. రాజేంద్రప్రసాద్, సర్దార్ బలదేవ్ సింగ్‌లు, పాకిస్థాన్ తరఫున జిన్నా, లియాకతాలీఖాన్‌లు సభ్యులుగాను, లార్డ్ మౌంట్ బాటన్ అధ్యక్షుడుగాను వ్యవహరించారు. ఆయా ప్రత్యేక ఆస్థి, అప్పులను పంచటానికి ఈసంఘం అనేక ఉపసంఘాలను నియమించి వాటి కార్యకలాపాలను సమన్వయపరుస్తూ, సమీక్షిస్తూ వుండేది. విభజన సంఘం ఏ సందర్భంలోనైనా ఒక సమాధానానికి రాలేకపోతే, ఆ విషయాన్నిమధ్య వర్తి సంఘానికి దాఖలు చేయవచ్చును. ఇందుకొరకు ప్రత్యేకంగా ఒకమధ్య వర్తిసంఘాన్ని ఏర్పరచారు. ఈ సంఘంలో ఇండియా, పాకిస్థాన్‌లు ఒక్కొక్కటి ఇద్దరు ప్రతినిధులను నియమిస్తారు. అధ్యక్షుడిని వైస్రాయే నియమిస్తాడు. ఫెడరల్ కోర్టు

ప్రధాన న్యాయమూర్తిగావున్న సర్ పాట్రిక్ స్పెన్స్‌నుమధ్యవర్తి సంఘ అధ్యక్షుడుగా నియమించారు. విభజన సంఘాలు జూన్ 27 వ తేదీన, మధ్య వర్తిసంఘం ఆగస్టు 12 వ తేదీన లార్డ్ మౌంట్ బాటన్ చే నియమింపబడినాయి. కేంద్ర, పంజాబ్, బెంగాల్ రాష్ట్ర, సిల్హెట్ జిల్లా ఆస్థి అప్పులను చాలవరకు ఆగస్టు 15 వ తేదికి పూర్వమే ఉభయపక్షా లకు సంతృప్తికరంగా విభజనసంఘాలే పంచినవి. మిగిలివున్న వ్యవహా రాలను ఆగస్టు 15 వ తేదీ తర్వాతకూడా ఈ సంఘాలే పంచవచ్చునని నిర్ణయించుకున్నారు. అవిభక్త భారతదేశంలో అన్నిరాష్ట్రాలమధ్య రాకపోకలు, వర్తకము, న్యాయవిచారణ మొదలైన విషయాలపై ఎట్టి సంబంధాలుండేవో అట్టి సంబంధాలు ఇండియా, పాకిస్థాన్‌లమధ్య యధాతధంగా 1948 వ సం. మార్చి 31 వ తేదీవరకు కొనసాగనివ్వ వలెనని అంగీకరిస్తూ ఉభయపక్షాలు ఒక యధాతధపు ఒడంబడికను చేసుకున్నాయి.

సైన్యవిభజన సక్రమంగా పూర్తిచేసి, బ్రిటిష్ సేనలను ఉపసంహ రించి, కొంతకాలంవరకు ఉభయ అధినివేశ రక్షణ విధానాలను సమ న్వయపరచి, ఆ వ్యవహారాలలో నూతన అధినివేశాలకు కొంత అనుభవం వచ్చేటంతవరకు పనిచేస్తుండటానికి సంయుక్త రక్షణ సంఘాన్ని, ఒక సుప్రీంకమాండర్‌ను ఏర్పాటు చేసుకున్నారు. 1947 వ సం. ప్రారంభం నుండి పంజాబ్‌లో కొట్లాటలు జరుగుతునే వున్నవి కాబట్టిన్ని, ఆగస్టు 15 వ తేదీనాటికి సరిహద్దులు అనిశ్చితంగా వుండటంవలన ఉభయ పక్షాలలోను ఉద్రేకం హెచ్చిపోయి, సంక్షోభం ప్రారంభంగల అవ కాశం వుంది కాబట్టిన్ని, ఉభయ అధినివేశాలు పూర్తిగా స్థిరపడి, రక్షణభారం వహించేటంతవరకు సరిహద్దు ప్రాంతాలలో శాంతి కాపాడటానికి 'సరిహద్దు సైన్యము'ను ఏర్పాటుచేసి, జనరల్ రీస్‌ను దానికి నాయకుడుగా నియమించారు. ఈసైన్యం సుప్రీంకమాండర్ ఆధిపత్యాన పనిచేసింది. కాని సుప్రీంకమాండర్ ఆకిన్ లెక్, జనరల్ రీస్‌లు పాకిస్థాన్ పక్షపాతులు కావటంవలన, జిత్తులమారి ముస్లింలు

అనవుసర ప్రవాదాలు పుట్టించి, సరిహద్దు సైన్యంచేతనే అల్పసంఖ్యాకులను హత్య చేయించటంవలన, ఈ సరిహద్దు సైన్యం అనర్థదాయకంగా పరిణమించి, అప్పటికప్పుడే రద్దుచేయబడింది. సుప్రీంకమాండర్ ఫీల్డ్‌మార్షల్ ఆకిన్‌లెక్ పాకిస్థాన్ పక్షపాతియై పాకిస్థాన్‌కు వెళ్ళవలసిన సామగ్రిని త్వరత్వరగా జేరవేయించి, మనకు జేరవలసిన సామగ్రి జేరకుండా ఆపుచేయిస్తూ, అన్నివిధాల పాకిస్థాన్‌కు సుముఖంగా వ్యవహరిస్తుండటంవల్ల, మొదట్లో నిర్ణయించుకున్నట్లుగా 1948 ఏప్రిల్ 1 వ తేదీతో గాక, 1947 వ సం. నవంబరు 30 వ తేదీతోనే ఈ పదవిని రద్దుచేయాలని భారతప్రభుత్వం పట్టుపట్టింది. సైనిక విభజన, ఆయుధసామగ్రి రవాణా అప్పటికే చాలవరకు పూర్తికావటంవల్ల బ్రిటిష్ ప్రభుత్వము ఇందుకు అంగీకరించింది. పాకిస్థాన్ కూడా అంగీకరించక తప్పలేదు. సుప్రీం కమాండరు పదవి రద్దయిపోయినతర్వాత కూడా, మౌంట్‌బాటన్ అధ్యక్షతన వున్నసంయుక్త రక్షణ సంఘం నిలిచే వుండి, అప్పుడప్పుడు సమావేశమౌతూ, రక్షణకు సంబంధించిన విషయాలు ఆలోచిస్తుండేది. ఈ సంఘం మార్చి 19 వ తేదీన సమావేశమై, తనను రద్దుపరచుకోటానికి నిర్ణయించింది. ఇక ముందు అప్పుడప్పుడు ఉభయ అధినివేశాల రక్షణ శాఖ కార్యదర్శులు సమావేశమౌతూ ఉభయులకు సంబంధించిన విషయాలను ఆలోచిస్తుంటారు. అవుసరమైనప్పుడు, సాధారణంగా నెలకొకపర్యాయం ఉభయదేశాల ప్రధానులు సమావేశమై రక్షణ వ్యవహారాలను ఆలోచిస్తారు.

ఆగస్టు 15 వ తేదీ తర్వాత అకస్మాత్తుగా పంజాబ్ రాష్ట్రంలో సంక్షోభం పెద్దదైపోయినప్పుడు ఉభయదేశాలప్రధానులు, మంత్రులు సంయుక్తంగా అనేకపర్యాయాలు అన్నిప్రాంతాలలోను పర్యటించి, రెండురాష్ట్రాలలోను శాంతి కాపాడటానికి, కల్లోలాలను అణచివేయటానికి, అల్పసంఖ్యాకులను కాపాడటానికి తాము కృతనిశ్చయులమై వున్నామని పునరుద్ఘాటించారు. జనాభా మార్పిడి తప్పని సరియైనప్పుడు సంయుక్తరక్షణసంఘంలో ఉభయదేశాల ప్రతినిధులు సమావేశమై

అనేకవిషయాలపై ఏకగ్రీవంగా నిర్ణయాలు చేశారు. ఈ నిర్ణయాలను తు, చ తప్పకుండ పాకిస్థాన్ ఆచరింపకపోయినప్పటికీ దీనివిషయమై ఉభయఅధినివేశాలకు వివాదాలేమీ సంభవించలేదు. కాందిశీకులరక్షణ, వారి ఆస్థిరక్షణ, బలాత్కరింపబడిన స్త్రీలఉద్ధరణ, నేలమాళిగ కోశీలలో దాచుకున్న సొమ్ము వాపసు మొదలైన విషయములను ఉభయదేశాలు సంతృప్తికరంగా పరిష్కరించుకొన్నవి.

ఇండియా పాకిస్థాన్‌లకు విభేదాలు వాటి ఆంతరంగికసమస్యలపై గాక సంస్థానాలసమస్యపైననే ప్రారంభమైనవి. ఆగస్టు 15 వ తేదీతో సార్వభౌమత్వం రద్దుకాగానే సంస్థానాలు స్వతంత్రరాజ్యాలవుతవనీ, వాటి స్వతంత్రహోదాను తాము గుర్తిస్తామనీ పాకిస్థాన్‌నాయకులు మొదటినుండి చెపుతూనేవున్నారు. సంస్థానాధీశ్వరులపై ప్రేమచేత గాక, అత్యధికసంస్థానాలు ఇండియాలోనే వున్నవి, కాబట్టి తమ ప్రోత్సాహంతో అవేవైనా భారతదేశంలో జేరకుండావుంటే ఆదేశం బలహీనపడిపోతుందనే ఆశతో, దుర్బుద్ధితోనే వీరట్టివైఖరి అవలంబించారు. భౌగోళిక నిర్బంధాలను నిర్లక్ష్యంచేసి ఏ ఒకటిరెండు భారత ముస్లింసంస్థానాలైన పాకిస్థాన్‌లో జేరితే, భారతదేశం నడిబొడ్డులోనే తమకు స్థావరాలు చిక్కుతవని వీరు ఆశించారు. వీరి మాయలలో పడి పోయిన మొదటిసంస్థానం జునాగఢ్. జునాగఢ్ సంస్థానం సౌరాష్ట్రంలో బొంబాయిరాష్ట్రానికి ఉత్తరదిశలో సముద్రతీరాన వున్నది. ఇక్కడికి పాకిస్థాన్‌నుండి రాకపోకలు తేలికగా జరగవచ్చును. జునాగఢ్ సంస్థానం పాకిస్థాన్‌లోవుంటే, ముస్లింసైన్యాలు అక్కడ నుంచి ఒక్కదుముకుమీద ఇటు హైదరాద్‌గాని అటు ఢిల్లీగాని చేర వచ్చును. జునాగఢ్ పాకిస్థాన్‌లో జేరటాన్ని భారతదేశం సహించి, వూరుకుంటే ఇతరముస్లిం సంస్థానాలుకూడా హైదరాబాద్‌తోసహా పాకిస్థాన్‌లోజేరి ఏనాటికైనా ముస్లింసామ్రాజ్యస్థాపన సాధ్యపడుతుందని వీరు ఆశించారు. ఇంత దురాలోచనతో, దూరాలోచనతో జునాగఢ్ ఆగస్టు 18 వ తేదీన పాకిస్థాన్‌లో జేరింది. జునాగఢ్ ప్రజలందరు

హిందువులు. దానిచుట్టు అనేకహిందూసంస్థానా లున్నవి. జునాగఢ్ చర్యను నిర్లక్ష్యంచేసి వూరుకుంటే సౌరాష్ట్రంలో అశాంతి, భారత సంస్థానాధీశ్వరులలో ఇండియా వ్యతిరేకభావము వ్యాపించి పోగలవు. జునాగఢ్ నవాబు చర్యను సౌరాష్ట్ర సంస్థానాధీశ్వరులందరు నిరసించిరి. దాని సామంత సంస్థానాలైన మంగ్రోల్, బాబరియావాడ్, మనావదార్‌లు భారతదేశంలో జేరటానికి ముందుకురాగా భారత ప్రభుత్వం జేర్చుకున్నది. ఇందుకు వాటిని జునాగఢ్ ప్రభుత్వం హింసించటం ప్రారంభించింది. జునాగఢ్ చర్యలను నిరసిస్తూ భారత ప్రభుత్వం సెప్టెంబరు 25 వ తేదీన ఒక ప్రకటన చేసింది. జునాగఢ్ చర్యలను సమర్థిస్తూ పాకిస్థాన్ ప్రధాని లియాకతాలీ, జునాగఢ్ దివాన్ సర్‌షానవాజ్ భుట్టోలు ప్రకటనలు చేశారు. ఈలోపుగానే జునాగఢ్ ప్రజలు తమ స్వాతంత్ర్యాన్ని ప్రకటించి, శ్యామలదాస్ గాంధి ఆధ్వర్యాన తాత్కాలిక ప్రభుత్వాన్నేర్పరచి, జునాగఢ్ భూభాగం ఆక్రమించుకోవటం మొదలెట్టారు. సంస్థానంలో అనేక గ్రామములు వీరి వశమైపోయాయి. జునాగఢ్ నవాబు తన తెలివి తక్కువ చర్యను గుర్తించి, ఇకవుంటే తనప్రాణమే దక్కదనుభయంతో అక్టోబరు 24 వ తేదీన కరాచీ పారిపోయాడు. సింధునుంచి చుట్టం చూపుగా వచ్చిన సైనికులు మంగ్రోల్, బాబరియావాడ్‌ల ప్రజలను హింసిస్తుండటంవలన నవంబరు 1 వ తేదీన భారతసేనలు వాటిని ఆక్రమించుకున్నవి. జునాగఢ్ తాత్కాలిక ప్రభుత్వసైన్యం జునాగఢ్ పట్టణాన్ని సమీపించిన తర్వాత ఇక లాభంలేదని గ్రహించి, దివాన్ భారతప్రభుత్వరక్షణ అర్థించాడు. అందువలన నవంబరు 9 వ తేదీన భారతసేనలు జునాగఢ్ ఆక్రమించాయి. భారతసేనలను ఆహ్వానించి, తెచ్చుకుని దివాన్ కరాచీపోయి పాకిస్థాన్‌తో వరీకై భారతప్రభుత్వాన్ని నిందించాడు. జునాగఢ్ పట్టణాన్ని, పరిపాలనను తాత్కాలిక ప్రభుత్వమే ఆక్రమించుకునివుంటే భారతప్రభుత్వంపై నిందవుండేది కాదు. జునాగఢ్‌ను ఆక్రమించినా ఏ అధినివేశంలో జేరాలనేసమస్యపై

ప్లెబిసైట్ జరుపుతామని భారతప్రభుత్వం హామీనిచ్చింది. ఫిబ్రవరి 12-18 తేదీలమధ్య మంగ్రోల్, బాబరియావాద్‌లలో ప్లెబిసైట్ జరిగింది. పాకిస్థాన్‌లో జేరవలసినదన్నవారిసంఖ్య 10 కి మించలేదు. ఫిబ్రవరి 24 వ తేదీన జునాగఢ్ ప్లెబిసైట్ జరిగింది. ఇండియాలో జేరటానికి అనుకూలంగా 190,779 వోట్లు, పాకిస్థాన్‌లో జేరటానికి అనుకూలంగా 91 వోట్లు వచ్చాయి. అంతర్జాతీయ పర్యవేక్షణక్రింద తిరిగి ప్లెబిసైట్ జరపటానికి తాము సిద్ధమేనని భారతప్రభుత్వం ప్రకటించింది. భారతప్రభుత్వచర్యను నిరసించటము, ఆక్షేపించటము, భద్రతామండలిలో ఈ విషయాన్ని ప్రస్తావించటము తప్ప పాకిస్థాన్ ఏమీ చేయలేదు. ముస్లింలీగ్‌నాయకులు కంటున్న పగటికలలలో ఒకటి ఈవిధంగా సమాప్తమైంది. కాశ్మీర్‌సంస్థానం పగటికలగాథ వేరొకచోట వివరించాను. ఈరెండు వ్యవహారాలతోను పాకిస్థాన్‌నాయకులకు తల తిరిగి నోట్లోకివచ్చి, ఇండియాను ఇబ్బందిపెట్టటం తమకే నష్టమని గ్రహించారు. అప్పటినుండి ఇతర వ్యవహారాలలో వారి ధోరణి కొంత సౌమ్యంగా వుంటున్నది.

ఇండియా-పాకిస్థాన్‌ల యధాతథపు ఒడంబడికను మొదట భగ్నమొనర్చినది పాకిస్థాన్. యధాతథపు ఒడంబడిక ప్రకారం తూర్పుబెంగాల్ జనపనార స్వేచ్ఛగా సుంకంలేకుండా కలకత్తాకు ఎగుమతిచేయాలి; దానిని ఎగుమతిచేసేటప్పుడు కలకత్తా నౌకాశ్రయంలో సుంకం వసూలుచేసి దానిలో నూటికి 62 వంతులు తూర్పుబెంగాల్‌కు చెల్లించాలి. గత సంవత్సరం జనపనారపంట బాగా పండి, నవంబరునెలవరకు దాదాపు 20 లక్షల బేళ్లు ఎగుమతయి 1 కోటిరూపాయల సుంకం భారతప్రభుత్వం వసూలుచేసింది. ఈ జనపనార అంతా చిట్టగాంగ్‌నుంచి ఎగుమతిచేస్తే, భారతదేశానికి సుంకం లోభాగంలేకుండా చేయవచ్చునని ఆశతో పాకిస్థాన్ ప్రభుత్వం తూర్పుబెంగాల్‌నుంచి కలకత్తావచ్చే జనపనారపై ఎగుమతి సమయాన విధించే సుంకం విధించింది. దీనివల్ల జనపనార కలకత్తా మిల్లులకు రావటానికి ముందే సుంకం చెల్లించవలసి

వచ్చి, ఇండియాకు ఒకమారు, పాకిస్థాన్‌కు ఒకమారు సుంకం చెల్లించవలసివచ్చింది. కలకత్తా జనపనార మిల్లుల వ్యాపారాన్ని పడగొట్టి, తూర్పుబెంగాల్‌లోనే మిల్లులను స్థాపించి, వాని ఉత్పత్తిని చిట్టగాంగ్ గుండా ఎగుమతి చేయించాలని పాకిస్థాన్ అభిప్రాయం. అయితే ఈ చర్యకు ప్రతీకారచర్యలు భారతప్రభుత్వం తీసుకుంటుందని తెలియగానే పాకిస్థాన్ లొంగిరావలసివచ్చింది.

ఆగస్టు 15 వ తేదీనాటికి మిగిలివున్న విభజనసమస్యల నన్నిటిని పరిష్కరించుకోటానికి ఉభయదేశాల ప్రతినిధులు సమావేశమై తీవ్రంగా కృషిచేశారు. తాము సంతృప్తికరమైన ఒడంబడిక మంచిగా చేసుకొనలేకపోతే, ఈ విషయాలన్నీ మధ్యవర్తిసంఘానికిపోయి దేశవిభజనవలెనే ఇరుపక్షాలకు అసంతృప్తికరంగా పరిష్కరింపబడవచ్చునని ఇరుపక్షాలు భయపడి, సంప్రదింపులు చాల సమాధానధోరణిలో జరిపారు. అందువలన ఒడంబడిక తేలికగానే, ఉభయపక్షాలకు సంతృప్తికరంగానే కుదిరింది. డిశెంబరు రెండవవారంలో న్యూఢిల్లీలో ఈ ఒడంబడికపై సంతకాలు జరిగాయి. ఈ ఒడంబడికలో ఐదుసమస్యలను పరిష్కరించారు. 1. అవిభక్త భారతదేశ డబ్బునిలువలు రూ. 400 కోట్లలో రూ. 75 కోట్లు పాకిస్థాన్‌కు వచ్చాయి. మొదట్లో పాకిస్థాన్‌కు ఇచ్చిన రూ. 20 కోట్లు పోను తక్కిన రూ. 55 కోట్లు వెంటనే యివ్వాలని భారతప్రభుత్వం అనుకున్నదిగాని ఆసొమ్ము కాశ్మీర్ సంఘటన సమాప్తమైనతర్వాత యివ్వవచ్చునని తరువాత నిర్ణయించారు. గాంధీజీ నిరశనవ్రతసమయంలో పాకిస్థాన్‌పట్ల సౌహార్ద్రత ప్రదర్శనగా ఈ సొమ్మును వెంటనే చెల్లించివేశారు. 2. అవిభక్త భారతదేశ ఆస్తులతో సరిపెట్టగా మిగిలిన అప్పులు—రక్షణకార్యాలకు, రాష్ట్రాలకు సహాయం చెయ్యటానికి ఈ అప్పుచేసి వుండవచ్చు—నూటికి $17\frac{1}{2}$ వంతులు పాకిస్థాన్ బాధ్యతగా అంగీకరించారు. ఈమొత్తం వడ్డీతోసహా 50 సంవత్సర వాయిదాలలో 1952 వ సం. నుండి మొదలుపెట్టి పాకిస్థాన్ ఇండియాకు చెల్లించేటట్లు, మొత్తం అప్పుకంతకు, ఋణస్థులకు, ఇండి

యూరే బాధ్యతవహించేటట్లు ఒడంబడిక కుదిరింది. ఇది పాకిస్థాన్‌కు చాల లాభం. వారు 4 ఏండ్లవరకు ఏమీ చెల్లించకుండా ఆతరువాత 50 ఏండ్లలో చెల్లించుకోవచ్చును. కాని ఆ సొమ్ముపైన ఏటేటా వడ్డీ, తరుణం వచ్చినప్పుడు అసలు మొత్తం ఇండియా చెల్లించుకోవలసి వుంటుంది. ఒకరి ఋణబాధ ఇంకొకరు వహిస్తే, మొదటివారికి ఎంత లాభమో వేరే చెప్పనక్కరలేదు. 3. స్టర్లింగు నిలువల పంపకం. స్టర్లింగు నిలువలు రిజర్వుబ్యాంకు సొమ్ము కాబట్టి ఏ అధినివేశంలో ఎంత మొత్తం నోట్లు చలామణిలో వుంటవో పరీక్షించి, వాటి దామాషాప్రకారం స్టర్లింగు నిలువలు పంచుకోవాలనీ, ఇంకా ఎక్కువ స్టర్లింగు కావలిస్తే పాకిస్థాన్ ఇండియాదగ్గర కొనుక్కోవచ్చునని అంగీకరించారు. 4. ఆర్డినెన్స్ ఫ్యాక్టరీలు అన్నీ భారతదేశంలోనే వున్నవి. వాటిని భారతప్రభుత్వమే వశపరుచుకుని, పాకిస్థాన్ ప్రభుత్వం ఆర్డినెన్స్ ఫ్యాక్టరీలను స్థాపించుకోటానికి రూ. 6 కోట్లు అప్పిస్తుంది. ఇది అనవుసరఔదార్యం. పాకిస్థాన్ ఇవ్వవలసిన ఋణం వసూలు 50 ఏండ్లు వాయిదావేసి, పైగా రూ. 6 కోట్లు అప్పు ఇవ్వటం ఇండియా ప్రభుత్వ బలహీన వైఖరికి నిదర్శనం. 5. ఇండియా, పాకిస్థాన్‌లలో వున్న సైనిక, ఆయుధసామగ్రిలో మూడవవంతు పాకిస్థాన్‌కు యివ్వాలి. అధినివేశాలసైన్యం సంఖ్య దామాషానుబట్టి చూస్తే ఇది సమంజసంగానే వున్నది. మొత్తంమీద ఈ ఆర్థిక ఒడంబడిక పాకిస్థాన్‌కు చాల లాభదాయకంగా వుంది. పాకిస్థాన్‌పట్ల ఔదార్యము, సౌహార్దత ప్రదర్శించటానికి కొంచెం వారికి అనుకూలంగానే పరిష్కారం చేయాలని భారత ప్రభుత్వం ఇట్లా వప్పుకుంది. దానిని పాకిస్థాన్ అపార్థంచేసుకుని ఇంకా ఎక్కువ ఇబ్బందులు కలిగించాలని ఎప్పటికప్పుడు ప్రయత్నిస్తున్నది. అయినా భౌగోళిక నిర్బంధాలవల్ల తప్పనిసరిగా పాకిస్థాన్ భారత దేశంతో అనేకఒడంబడికలు చేసుకొనక తప్పటంలేదు.

పాకిస్థాన్‌కు కావలసిన గోధుమ, బార్లీ, పంచదార. సప్లయిచేసి బియ్యము, ఉప్పు, ప్రత్తిగింజలు తెప్పించుకోటానికి ఫిబ్రవరి నెలారంభంలో

భారతప్రభుత్వం పాకిస్తాన్‌తో ఒక ఒడంబడిక చేసుకున్నది. దీనిప్రకారం ఉభయదేశాలు సరుకులు మార్చి నెలాఖరులోగానే సప్లయిచేసి వేసుకున్నవి. ఒడంబడిక జయప్రదంగా అమలుజరిగి, రద్దయిపోయింది.

దేశవిభజనసమయంలో ఏర్పాటుచేసుకున్న యథాతథపు ఒడంబడికలన్నీ మార్చి 31 వ తేదీతో అంతమైపోవటంవలన, అప్పటినుండి ఇండియా, పాకిస్థాన్‌లు వ్యాపారవిషయాలలో విదేశాలుగా వ్యవహరించుకోవలసి వచ్చింది. ఉభయదేశాల ప్రయోజనాలను రక్షించుకోవటంకొరకు ఈ సంబంధాలు అనేక ప్రత్యేక ఒడంబడికల రూపేణా సాగించవలసి వుంటుందని రెండు ప్రభుత్వాలు గుర్తించి, అనేక ఒడంబడికలు చేసుకున్నవి.

1948 వ సం. ఏప్రిల్ 1 వ తేదీనుండి పాకిస్థాన్ నోట్లు చలామణిలోనికి వచ్చాయి. ఆ నాటినుండే చలామణి సర్వవ్యవహారాలు స్వయంగా నిర్వహించుకోవాలని, అందుకు ఒక రిజర్వుబ్యాంకు ఏర్పాటు చేసుకోవాలని పాకిస్థాన్ ఆశించింది కాని అది సాగలేదు. జూన్ 30 వ తేదీవరకు పాకిస్థాన్ చలామణి వ్యవహారాలు నిర్వహించేటందుకు రిజర్వుబ్యాంకు అంగీకరించింది. జూలై నెలారంభంలో పాకిస్థాన్ రిజర్వుబ్యాంకు ఏర్పడి, వ్యవహారాలను వప్పగింతపెట్టుకున్నది. పాకిస్థాన్‌లో చలామణిలోనున్న భారత రిజర్వుబ్యాంకు నోట్లు ఉపసంహరించి, వప్పజెప్పి, రిజర్వుబ్యాంకు బంగారం, స్టర్లింగు నిలువలలో తమవంతు పంచుకుపోవలసిన పని ఇంకా మిగిలివున్నది.

పాకిస్తాన్ ముడిప్రత్తి పుచ్చుకుని, దానికి ప్రత్యామ్నాయంగా బట్టను—20 బేళ్ళ ప్రత్తికి 12 బేళ్ళ గుడ్డచొప్పున— ఇవ్వటానికి అంగీకరిస్తూ మార్చి 13 వ తేదీన భారతప్రభుత్వం ఒక ఒడంబడిక చేసుకున్నది. జర్మనీనుంచి అవిభక్త భారతదేశానికి వచ్చే 'రిపరేషన్స్'లో నాటికి $17\frac{1}{2}$ వంతులు పాకిస్థాన్‌వంతని మార్చి 16 వ తేదీన ఉభయవర్గాలు అంగీకారానికి వచ్చారు. సిల్హెట్, తూర్పుబెంగాల్ సరిహద్దుల విషయంలో మాటిమాటికి వస్తున్న వివాదాలను, ఉభయులకు సంతృప్తి

కరంగా పరిష్కరించటానికి 'సంయుక్త సరిహద్దు సంఘా'న్ని మార్చి 15 వ తేదీన ఏర్పాటుచేశారు. ఆ సంఘం ఇంకా తనపని పూర్తిచేయలేదు.

మార్చి 31 వ తేదీతో యధాతథపు ఒడంబడిక రద్దయిపోయి, ఇండియా, పాకిస్థాన్‌లు ఒకదానికొకటి విదేశాలుగా పరిగణించుకోనవలసి వచ్చినప్పుడు, పశ్చిమ పాకిస్థాన్‌కన్నా తూర్పు పాకిస్థాన్‌కు ఎక్కువ సంకటం వచ్చిపడింది. తూర్పు బెంగాల్ కేవలం భారత యూనియన్ దయాదాక్షిణ్యాలపై ఆధారపడి వుండవలసిన రాష్ట్రం. అందువల్ల తూర్పు, పశ్చిమ బెంగాల్‌ల ప్రతినిధులు, పాకిస్థాన్, ఇండియా ప్రతినిధులు సమావేశమై తూర్పు పాకిస్థాన్‌తో సంబంధాలను గురించి సంప్రదింపులు జరిపి, ఏప్రిల్ మూడవవారంలో ఒడంబడిక కుదుర్చుకున్నారు. రెండు అధినివేశాలలోను అల్పసంఖ్యాకులకు పూర్తి రక్షణ, సమానహక్కులు హామీ యిస్తామనీ, కాందిశీకుల ఆస్థి సంరక్షణకు ప్రత్యేకంగా బోర్డులను ఏర్పరచి, వారి రక్షణబాధ్యత అధిక సంఖ్యాకులపైన వేస్తామనీ, మైనారిటీలను హింసించే ఉద్యోగులను నిర్దాక్షిణ్యంగా శిక్షిస్తామనీ, రెండు ప్రభుత్వాలు సంయుక్తంగా ప్రకటించాయి. తూర్పు, పశ్చిమ బెంగాల్ సరిహద్దులకు రెండువైపుల ఆయాదేశాల సుంకపు అధికారులు ప్రయాణీకులను అధికంగా బాధపెడుతున్నారని ఫిర్యాదులు వచ్చినవి. కస్టమ్స్ తణిఖీ చాలకొద్దిగా వుండాలని, సుంకం కొన్ని సరుకులపైననే వుంచి, ప్రయాణీకుల సరుకును వారికేనే తీసుకుపోనివ్వాలని, పోస్టల్ మొదలగు సౌకర్యాలలో ఇబ్బందులు తొలగించాలని ఉభయదేశాల ప్రతినిధులు అంగీకరించారు. ఈ ఒడంబడిక సక్రమంగా అమలు జరిగితే, తూర్పు బెంగాల్ హిందువులకు కొంతసౌకర్యం ఏర్పడినా, పాకిస్థాన్ ముస్లింరాజ్యంగా వుంటుందని చెపుతున్నంతకాలం, అధిక సంఖ్యాకులైన ముస్లింలు తమ మూర్ఖతను విడువనంతకాలం వారక్కడ నిర్భయంగా జీవించలేరు.

ఇండియా, పాకిస్థాన్‌లమధ్య అనేక వస్తువుల వ్యాపారానికి సంబంధించిన వ్యాపార ఒడంబడిక మే 26 వ తేదీన కరాచీలో జరిగింది.

తనకు భారతదేశంనుండి కావలసిన బొగ్గు, గుడ్డ, నూలు, ఇనుపసామాను, కాగితం, కెమికల్స్, రబ్బరుసామగ్రి, సబ్బు, పొగాకు, తోలుసామగ్రి మొదలైన 22 సామానులు ఎంతెంత కావలసిందీ పాకిస్థాన్ సూచించినది. వాటిలో భారతదేశం ఎంతెంత మొత్తం ఇవ్వగలదో పరిశీలించి, అంతంత మొత్తం సప్లయి చేయటానికి భారతదేశం అంగీకరించింది. పాకిస్థాన్‌నుంచి మనకు కావలసిన జనపనార, ప్రత్తి, ఆహారధాన్యాలు, తోళ్లు మొదలైన 10 సామానులు ఎంతెంత కావలసినది భారతప్రభుత్వం సూచింపగా, తాము ఎంతెంత సప్లయి చేయగల్గినది పాకిస్థాన్ వివరించి చెప్పి, ఒడంబడిక కుదుర్చుకున్నది. ఈ ఒడంబడిక 1948 వ సం. జూలై 1 వ తేదీనుండి సంవత్సరకాలం అమలులో వుంటుంది.

ఇండియా, పాకిస్థాన్‌లకు అనేక ఒడంబడికలు జరుగుతూనే వుంటవి. ఒకరి సమస్యలను, అవుసరాలను ఒకరు అర్థంచేసుకుని, సౌమ్యంగా సంప్రదింపులు జరుపుకుంటే, సమంజసమైన ఒడంబడిక కుదరకపోదు. ఒకొక్కప్పుడు ఒకొక్కరికి కొంచెం ఎక్కువ ప్రయోజనాలు లభించవచ్చును. వాటిని పట్టించుకోకుండా, ఉభయ రాజ్యాలు సన్నిహితంగా వ్యవహరించటం రెండిటికీ మంచిది.



# హైదరాబాద్

భారతసంస్థానాలలోకల్లా పెద్దవైనందుకు హైదరాబాద్, కాశ్మీర్‌లు భారతప్రభుత్వానికి చీకాకు, తలనొప్పి పుటిస్తూ, ఇండియా పాకిస్తాన్‌ల సంబంధాలను శాశ్వతంగా విషమింపజేస్తున్నవి. హైదరాబాద్ సంస్థానం దక్షిణ భారతదేశంలో, నాలుగువైపులా ఇండియా భూభాగంచే ఆవృతమై వుండటమే గాక ప్రజలు నూటికి 90 మంది హిందువులవటంవలన భారతదేశంలో జేరటంకన్న దానికి గత్యంతరంలేదు. కాని పాలకుడు ముస్లిమై, అల్పసంఖ్యాకులు దౌర్జన్యవాద - మూర్ఖులై, భారతదేశంలో జేరకుండా వేరేస్వతంత్ర ముస్లింరాజ్యం స్థాపించాలని కలలు గంటున్నారు. హైదరాబాద్ నవాబు ప్రపంచంలోనెల్ల ధనవంతుడు; అతని ప్రజలు ప్రపంచంలోనెల్ల బీదవారు; నిరక్షరాస్యులు; వెనుకబడి వున్నవారు; అతని ప్రభుత్వము 20 వ శతాబ్దపు నాగరికతకు సిగ్గుచేటు. దక్షిణాపథంలో ముస్లిం పరిపాలన స్థిరపరచాలని నిజాం చేస్తున్న మొండిప్రయత్నాలన్నీ అతని వినాశనానికే దారి తీస్తున్నవి.

అమాత్యత్రయ పథకం ప్రకారం ఇండియా అవిభక్తంగా వుంటే నిజాం ఇండియాలో చేరేవాడేనట! జూన్ 3 వ తేదీ పథకం ప్రకారం భారతదేశం ఇండియా, పాకిస్థాన్‌లుగా విభాగం కావటంతో నిజాం తన అభిప్రాయాన్ని మార్చుకుని, సర్వస్వతంత్ర రాజానౌతానని జూన్ 12 వ తేదీన ప్రకటించాడు. 1947 వ సం. జూలై 25 వ తేదీన సంస్థానాధీశ్వరులనందరినీ మౌంట్‌బాటన్ సమావేశపరచినప్పుడు నిజాం ప్రధాని ఆ సమావేశంలో పాల్గొన్నా, భారతదేశంలో జేరటానికి అంగీకరించలేదు. ఇండియా - పాకిస్థాన్‌ల సంబంధాలు సమగ్రంగా తేలేవరకు తాను ఏ అధినివేశంలోను జేరనని ఆగస్టు 13 వ తేదీన, బ్రిటిష్‌సామ్రాజ్య కూటమితో మైత్రిసాగిస్తూ, ఇరుగుపొరుగు రాజ్యాలతో సఖ్యంగా వుండటమే తన ఉద్దేశ్యమని, బ్రిటిష్ రెసిడెంట్‌కు వీడ్కోలు యిస్తూ ఆగస్టు 14 వ తేదీన నిజాం ప్రకటించాడు. 1947 వ

సం. ఆగస్టు 15 వ తేదీనాటికి హైదరాబాద్ ఏ అధినివేశంలోను జేరలేదు సరి కదా యధాతథపు ఒడంబడికలైనా చేసుకోలేదు. భారత స్వాతంత్ర్యచట్టంలోని ఒక నిబంధనప్రకారం ఇండియా - హైదరాబాద్‌ల సంబంధాలుమాత్రం యధాతథంగానే జరిగిపోతుండెను.

రెండు శతాబ్దాలనుంచి పాలిస్తుండటంవలన, హైదరాబాద్ సంస్థానంలో ముస్లింలు, సంఖ్యాబలం లేకపోయినా, కొంత ప్రత్యేకత సాధించుకున్నారు ; ప్రభుత్వోద్యోగులు, పోలీసులు, సైనికులు అందరు ముస్లింలే. బ్రిటిష్ భారతదేశంలో అధికారం ప్రజల పరమవటం ప్రారంభమైనకొద్దీ, హైదరాబాద్ ముస్లింలు తమ ప్రత్యేక సౌకర్యాలు, అధికారాలు వదలుకోవలసి వస్తుందేమోనని భయపడుతూ, ఇత్తేహాద్ - ఉల్-ముసల్మీన్ సంస్థను ఏర్పరచుకుని, సుసంఘటితులై, వాటిని రక్షించుకోటానికి సన్నద్ధులైనారు. తన నిరంకుశాధికారాన్ని బలపరచేటందుకు ఈ సంస్థ బాగా పనికివస్తుందని గ్రహించి, నిజాంకూడా దానిని ప్రోత్సహించాడు. సంస్థానంలో బాధ్యతాయుత ప్రజాప్రభుత్వమేర్పరిస్తే, అధికారం హిందువుల హస్తగతమైపోతుంది కాబట్టి బాధ్యతాయుత ప్రభుత్వమేర్పరచకూడదనీ, సార్వభౌమత్వాధికారం రద్దయిపోగానే నిజాం సర్వస్వతంత్రత ప్రకటించుకుని పాకిస్థాన్‌కు అన్నివిధాల సహాయపడుతూ, ఏనాటికైనా భారతదేశంలో ముస్లిం సామ్రాజ్యాన్ని తిరిగి స్థాపించటానికి కృషిచేయాలని ఇత్తేహాద్‌సంస్థ అభిప్రాయము. సంస్థానకాంగ్రెస్ ఉద్యమం ఇచ్చట చాల బలహీనంగా వున్నది. నిజాం వ్యవహారాలపై కాంగ్రెస్ ఏమాత్రం వత్తిడిచేసినా, ముస్లింలీగ్, బ్రిటిష్‌పాలకులుకూడా దానికి మతరూపమిచ్చి విషప్రచారం చేస్తారనే భయంతో కాంగ్రెస్ హైదరాబాద్ వ్యవహారాలలో ఏమంత పట్టించుకోలేదు. సంస్థాన కాంగ్రెస్‌లో దాదాపు 2 లక్షల మంది సభ్యులున్నారు; సంస్థానంలో బాధ్యతాయుత ప్రజాప్రభుత్వమేర్పరచి, భారత యూనియన్‌లో జేరవలెనని వీరు మొదటినుండి నిజాంను కోరుతూనేవున్నారు. 1947 ఆగస్టునెలారంభములో ఇందుకు

సత్యాగ్రహము ప్రారంభించి, కాంగ్రెస్ వాదు లనేకులు జెయిళ్లకు వెళ్లినారు.

ఏ అధినివేశంలో జేరటమో, జేరకపోవటమో ఆగస్టు 15 వ తేదీనాటికి నిజాం తేల్చుకొనలేకపోయాడు. భారతప్రభుత్వం కూడా అతనిని వత్తిడిపెట్టదలచుకోలేదు. అందువలన, నిజాం కోరినట్లు రెండు నెలల వ్యవధియిచ్చి, ఈలోపల ఆంతరంగిక పరిస్థితులు చక్కబెట్టుకోటానికీ, భారతప్రభుత్వంతో సంప్రదింపులు జరపటానికీ అతనికి అవకాశమివ్వటానికి భారతప్రభుత్వం అంగీకరించింది. తన ప్రధాని ఛత్తారీ నవాబ్ ఆధ్వర్యాన, సుల్తాన్ అహమ్మద్- సర్ వాల్టర్ మాంక్టన్‌లను ప్రతినిధులుగా ఒక ప్రతినిధి వర్గాన్నేర్పరచి, సంప్రదింపులకై నిజాం ఢిల్లీపంపించాడు. వీరు భారతప్రభుత్వంతో సంప్రదింపులు జరిపి, హైదరాబాద్ తిరిగివచ్చి, నిజాం ఆజ్ఞలుపొంది, తిరిగి ఢిల్లీ వెళ్ళి సంప్రదింపులు జరుపుతూ రెండు నెలల కాలము గడిపివేశారుగాని, ఒడంబడికమాత్రం కుదరలేదు. ఇతర సంస్థానాధీశ్వరుల వలెగాక తాను సర్వస్వతంత్రుడననీ, భారతదేశంతో సమాన హోదా తనకు వున్నదనీ బుజువుపరచటము, తన సర్వస్వతంత్రత విషయమై భారత అదినివేశంతో ఏనాటికైనా తప్పనిసరియగు సంఘర్షణకు ఇప్పుడే సన్నద్ధమైయుండుటకు సంస్థాన సైన్యమును వృద్ధిపరచటము, ముస్లింలను సంఘటితపరచటము, హిందువులను బెదరగొట్టటము, దొంగచాటుగా ఆయుధ సామగ్రి జేరవేసికోవటము మొదలగు పనులకు వ్యవధి సంపాదించటము ఈ సంప్రదింపులద్వారా నిజాం సాధించదలచిన ప్రయోజనములు. అందువలన రాయబారులను అనేక పర్యాయములు హైదరాబాద్ - ఢిల్లీల మధ్య త్రిప్పి, భారతప్రభుత్వము వద్దనుండి వీలైనన్ని ప్రయోజనాలు సంపాదించుటకు నిజాం ప్రయత్నించాడు. భారతప్రభుత్వం ఇంతకన్న దిగిరాదని తేలిపోయిన తర్వాత అక్టోబరు 28 వ తేదీన ఒక ముసాయిదాను నిజాం అంగీకరించి, అయినా ప్రయత్నించి చూద్దామని దురభిలాషతో మజ్లిస్ చేత ఒక వ్యతిరేక ప్రదర్శనం

జరిపించి, అప్పటికి సంప్రదింపులు వాయిదా వేశాడు. హైదరాబాద్ ముస్లింలను తృప్తిపరచటానికి ఇంతకన్నా దిగిరావటానికి భారత ప్రభుత్వం అంగీకరించలేదు. ఛత్తారీనవాబు నిజాం ప్రధానిత్వమునకు రాజీనామా నిచ్చాడు. సంస్థానంలో ఆనాటి కొనాడు శాంతి మరీ భగ్నమైపోతూ, అధికసంఖ్యాకులకు జీవితం దుర్భరమైపోతుండెను. వెంటనే సంస్థానంలో ప్రశాంతత నెలకొల్పవలసిందని ఆదేశిస్తూ, భారత ప్రభుత్వం నిజాంకు 1947 వ సం. నవంబరు 21 వ తేదీన శ్రీముఖం పంపింది. అందుపై, నవాబ్ మెయిన్ నవాజ్ జంగ్, అబ్దుర్ రవూఫ్, పింగలి వెంకటరామరెడ్డిగారలతో ఒక ప్రతినిధి వర్గమేర్పరచి, సంప్రదింపులకు ఢిల్లీపంపించి, ఇదివరకు ఛత్తారీ నవాబు అంగీకరించిన ఒడంబడికనే తిరిగి నిజాం అంగీకరించెను. ఈ 'యధాతధపు' ఒడంబడిక నవంబరు 29 వ తేదీన అమలులోనికి వచ్చెను. రక్షణ, రాకపోకలు, విదేశవ్యవహారాలపై సర్వాధికారాన్ని భారతప్రభుత్వానికి దఖలు పరచటానికి నిజాం ఈ ఒడంబడికలో అంగీకరించాడు. సంస్థానంలో వున్న భారతసేనలను ఉపసంహరించటానికీ, సార్వభౌమత్వం రద్దు చేయటానికీ, సంస్థాన తంతి, తపాలా, ఖజానా వ్యవహారాలపై నిజాంకు ఇప్పుడున్న అధికారాలు రక్షించటానికి భారతప్రభుత్వం అంగీకరించింది. ఈ ఒడంబడిక ఒకసంవత్సరకాలం అమలులోవుంటుంది. దీనిప్రకారం నిజాం సాధించిన సర్వస్వతంత్రత ఏమీ లేకపోయినా, సంస్థానంలో ప్రజా ఉద్యమం అణచివేయటానికీ, ముస్లింలను సంఘటితపరచుకుని ఆయుధ సామగ్రి దిగుమతిచేసుకుని తన ప్రతిఘటనా-శక్తి వృద్ధిపరచుకోటానికి నిజాంకు అవకాశం లభించింది. ఇట్టి అవకాశం నిజాంకు ఇవ్వకుండవలసిందని తరువాత సంఘటనలు రుజువుచేసినవి. హైదరాబాద్ సమస్యను శాశ్వతంగా పరిష్కరించక, ప్రజా ఉద్యమానికి విఘాతం కల్పించే ఈ ఒడంబడిక చేసుకున్నందుకు భారతప్రజలు తమ ప్రభుత్వాన్ని విమర్శించారు. నిజాం విషయంలో తమ మంచి తనాన్ని రుజువుచేయటానికే భారతప్రభుత్వం ఈ ఒడంబడికను అంగీకరించింది.

నవంబరు 28 వ తేదీన నిజాంనవాబు తనప్రధానిగా మీర్‌లాయక్ ఆలీని నియమిస్తూ, ఆగస్టు 21 వ తేదీ ఫర్మానాలో తాను వాగ్దానం చేసిన రాజ్యాంగసంస్కరణలు అమలుజరపటానికి సూచనలు చేయ వలసిందని ఆదేశించాడు. అన్నిపక్షముల ప్రతినిధులతో తాత్కాలిక మంత్రివర్గ మేర్పరచి, రాజ్యాంగసంస్కరణలు సూచించటానికి పరిషత్తు ఏర్పాటుచేస్తానని లాయక్‌ఆలీ ప్రకటించి, కాంగ్రెస్ నాయకులనందరిని విడుదలచేయించాడు. తాత్కాలికప్రభుత్వములో కాంగ్రెస్ పాల్గొనే విషయమై రెండుపర్యాయాలు సంప్రదింపులు జరిగాయిగాని సంపూర్ణ బాధ్యతాయుత ప్రజాప్రభుత్వము ఏర్పరచటము, భారతదేశంలో చేర టము అనే రెండువిషయాలపైన రాజీకి సంస్థాన కాంగ్రెస్ ఆమోదించ లేదు. డిశెంబరు 4 వ తేదీన ఎవరో వ్యక్తి నిజాంపై బాంబువిసరెనుగాని ప్రమాదమేమీ జరుగలేదు. డిశెంబరు 16 వ తేదీన లాయక్‌ఆలీ తన మంత్రివర్గము నేర్పాటుచేసెను. ఇందులో సంస్థానకాంగ్రెస్, స్వతంత్ర అభ్యుదయపక్షములు పాల్గొనలేదు.

యధాతథపు ఒడంబడికకు విరుద్ధముగా ద్రవ్యమానపు ఆర్డినెన్సు ఒకటి జారీచేసి, సంస్థానములో భారతద్రవ్యమానము చలామణి కాకుండా నిజాం నిషేధించెను. దీనివలన అతడు సాధించిన ముఖ్యప్రయోజనములు రెండు: తాను సర్వస్వతంత్రుడనని భారతప్రభుత్వమునకు, తన ప్రజలకు రుజువుచేయుట; భారతదేశముతో జరుగు వర్తకవ్యాపారాలపై అజమాయిషీచేయుట. ఈ ఆర్డినెన్సుప్రకారం వర్తకులు భారతద్రవ్య మానంకొరకు బ్యాంకులవద్దకు పరుగెత్తవలెను. కాబట్టి వారే వస్తువులు కొంటున్నారో గమనించి, అవి సంస్థానంలోనికి రాగానే లాక్కొని నిలువచేసుకోవటానికి నిజాంకు అవకాశం లభించింది. అప్పటినుంచి నిజాంప్రజలకు అన్నివస్తువులు కరువైపోయినవి. యధాతథపు ఒడం బడికకు విరుద్ధముగా పాకిస్థాన్‌కు 20 కోట్ల రూపాయలు అప్పిచ్చి, భారతప్రభుత్వం ఆక్షేపణ తెలుపగా ఆ ఋణపత్రములు అమ్మవద్దని పాకిస్థాన్‌ను నిజాం కోరెను.

యథాతథపు ఒడంబడిక నాటికి వివాదగ్రస్తాలైవున్న విషయాలను గురించి, ఆ ఒడంబడికను భగ్నంచేస్తున్నారని పరస్పరం జరుపుకొంటున్న ఆరోపణలనుగురించి ఆలోచించటానికి నిజాంప్రధాని మీర్ లాయక్ అలీ జనవరి నెలాఖరున ఢిల్లీ వెళ్ళి, భారతప్రభుత్వంతోను, గాంధీజీతోను సంప్రదింపులు జరిపెను. హైదరాబాద్ లో భారతప్రతినిధి మున్షీ కూడ అదేసమయమున ఢిల్లీలో వుండెను. గాంధీజీ అంతిమఆలోచనలు హైదరాబాద్ సమస్యను గురించియే! ఫిబ్రవరి నెలాఖరులోగా భారత సేనలన్నియు సంస్థానమునుండి ఉపసంహరింపబడెను. ఆరోపణలు ప్రతి ఆరోపణలతో ప్రారంభమై చివరకు శాశ్వత ఒడంబడికకొరకు సంప్రదింపులు జరిగెను. ఈలోగానే, జనవరిలోనే సంస్థాన కాంగ్రెస్ నాయకులు తిరిగి అరెస్టుచేయబడిరి. శాశ్వత ఒడంబడికకు ప్రాతిపదికగా బాధ్యతాయుత ప్రజాప్రభుత్వము నేర్పరచవలసిందని భారతప్రభుత్వము కోరెను. కాని ఇది సంస్థాన ఆంతరంగికసమస్య కాబట్టి భారతప్రభుత్వం జోక్యం కలిగించుకోరాదనీ, అయినా హిందూ-ముస్లిం సమప్రాతినిధ్యముపై బాధ్యతాయుతప్రభుత్వము నేర్పరచెదమనీ నిజాం ప్రతినిధులు వాదించిరి. భారతప్రభుత్వమున కిది ఇష్టములేకపోయినా, మంచిగా ఒడంబడికచేసికొనుటకు, హిందువులకు 60, ముస్లింలకు 40 వంతుల ప్రాతినిధ్యంతో ప్రజాప్రభుత్వము నేర్పరచవలసిందని ఆదేశించెను. దీనికి సమ్మతించక, భారతయూనియన్ లో జేరువిషయమై ప్లెబిసైట్ జరిపెదమని నిజాంప్రతినిధులు క్రొత్తపన్నాగము పన్నిరి. సంస్థానములో నిరంకుశపరిపాలన, రజాకార్లు, అకృత్యములు అవిఘ్నముగా సాగుచున్నంతకాలము నిష్పాక్షికముగా ప్లెబిసైట్ జరుగుటకల్ల. బాధ్యతాయుత ప్రజాప్రభుత్వ మేర్పడనిదే ఎట్టి ప్లెబిసైట్ ను అంగీకరింపజాలనని భారతప్రభుత్వం స్పష్టపరచింది. ఇది లాభం లేకపోయినందువలన నిజాంప్రతినిధులు వేరొక క్రొత్తమార్గము త్రొక్కినారు. రక్షణ, రాకపోకలు, విదేశవ్యవహారములపై అధికారమును భారతప్రభుత్వమునకు దఖలుపరచుటకు నిజాం అంగీకరించునుగాని ఈ వ్యవహారములపై

భారతప్రభుత్వము చేసిన శాసనములన్నీ తిరిగి హైదరాబాద్ శాసనసభ ఆమోదించాలని వీరు సూచించారు. ఒకవేళ హైదరాబాద్ శాసనసభ వాటిని యథాతథంగా ఆమోదించకపోతే, ప్రత్యేక ఆర్డినెన్సుద్వారా నిజాం వాటిని ఆమోదిస్తాడని అన్నారు. కాని ఇది అధికారదాఖలుకు విరుద్ధము. భారతశాసనములు తిరిగి హైదరాబాద్ శాసనసభ అంగీకరించవలసివస్తే ఇంక అధికారదత్తత ఏమున్నది? భారతప్రభుత్వం ఈ సూచనలను త్రోసిపుచ్చింది.

సంస్థాన సరిహద్దులోని భారతగ్రామాలపై దాడులు విపరీతంకా జొచ్చినవి. దక్షిణ భారతదేశంలో శాంతికి భగ్నం కలిగించటానికి నిజాం కొత్తఎత్తు ఎత్తాడు. సంస్థానప్రభుత్వంలో అన్నివర్గాల సహకారాన్ని పొందటానికంటూ ఒకఫర్మానా జారీచేసి, కమ్యూనిస్టులపై ఆంక్ష తొలిగించారు. అప్పటినుండి కమ్యూనిస్టులు, సంస్థానం భారతదేశంలో జేరకూడదనీ, వెంటనే బాధ్యతాయుత ప్రజాప్రభుత్వం స్థాపించకూడదనీ ప్రచారం చేస్తున్నారు. అంతటితో ఆగక భారత గ్రామాలపై దాడులు జరపటము, సంస్థాన కాంగ్రెస్‌వాదులను హింసించటము, సాగిస్తున్నారు. ఒక వంకరజాకార్లు, వేరొకవంక కమ్యూనిస్టులు ప్రజలను పీడించటం ప్రారంభించటంతో, సంస్థానంలో శాంతి, భద్రతలు మృగ్యమైపోయి; దక్షిణ భారతదేశ శాంతి, భద్రతలకు ప్రమాదం వాటిల్లుతున్నది.

భారతప్రభుత్వం సూచించిన కనీసషరతులను నిజాం నిరాకరించాడు. త్వరలోనే కాశ్మీర్ కమిషన్‌సభ్యులు భారతదేశానికి వచ్చినప్పుడు తిరిగి సంప్రదింపులు ప్రారంభిస్తే, వారిఎదుట మంచిగా కనపడటానికైనా తనకు ఒకటి, రెండు సౌకర్యాలు భారతప్రభుత్వం ఇవ్వకపోదనే ధీమాతోనే అతడట్లు చేశాడు. నిజాంను దారికి తేవటానికి మౌంట్‌బాటన్ చేసిన రెండు ప్రయత్నాలు, భారతముస్లిం ప్రముఖుల విజ్ఞాపనలు విఫలములై పోయినవి. నిజాంతో ఇక సంప్రదింపులు జరపబోవటంలేదని పండిట్ నెహ్రూ జూన్ 17 వ తేదీన ప్రకటించాడు.

మౌంట్‌బాటన్ నిజాంకిచ్చిన ప్రత్యేక షరతులు అతనితోనే పోయిన వనీ, ఇప్పుడు నిజాం ఇతర సంస్థానాధీశ్వరులవలెనే ఒడంబడిక చేసుకో వాలనీ సర్దార్‌పటేల్ జూలై 15 న ప్రకటించాడు.

కరాచీనుండి దొంగతనంగా ఆయుధాలు హైదరాబాద్‌కు రవాణా అవుతున్నట్లు సిడ్నీకాటన్ సంఘటనతో రుజువైంది. ఇందు వల్ల నిజాం - భారతప్రభుత్వాల సంప్రదింపులు మరీ చెడిపోయినవి. సంస్థానంపై మిలిటరీ చర్యలు జరపటానికి భారతప్రభుత్వం సిద్ధమేనని పండిట్‌నెహ్రూ మద్రాసులో ప్రకటించాడు. ఇన్ని జరిగినతర్వాత నిజాం మాజీప్రధాని మీర్జాఇస్మాయిల్, ఇండో - హైదరాబాద్ సంబంధాలను చక్కబరచటానికి మరొక్క ప్రయత్నంచేసి, విఫలు డైనాడు. ఈ సంఘటనతో, నిజాం ఇప్పుడు రజాకార్ల చేతి కీలుబొమ్మ అయిపోయినాడని, ప్రభుత్వాధికారం అతని చేతులనుండి జారిపోయిం దనీ రుజువైంది. సంస్థాన శాంతిని, దక్షిణ భారతప్రశాంతతను కాపాడటానికి భారతప్రభుత్వం సైనిక చర్యలు జరపటంకన్న ఇప్పుడు గత్యంతరమేమీలేదు. సంస్థానానికి భారతప్రభుత్వ ద్రవ్యమానము, ఇతర వస్తువులు దొరకకుండా కట్టుదిట్టాలు చేయబడినవి. ఇందువలన నిజాం ప్రయత్నాలకు కొంతవరకు విఘాతంకలిగింది. అయితే, దీనిని పురస్కరించుకుని, ఐక్యరాజ్యసమితికి భారతప్రభుత్వంపై ఫిర్యాదుచేసి, పాకిస్థాన్, సిరియాల సహాయముతో అంతర్జాతీయ హోదాపొందవలెనని నిజాం ప్రయత్నిస్తున్నాడు. నిజాం ఫిర్యాదును అంగీకరించటానికి భద్రతామండలి బహుశః ఒప్పుకోదు. నిజాంకు ఈ విషయములో సహా యముచేసిన రాజ్యాలతో, భారతప్రభుత్వం తెగతెంపులు చేసుకోవాలి. భారతసేనలు ఇప్పటికే సంస్థానం చుట్టూవున్నవి. ఏక్షణంలోనైనా సాయుధసంఘర్షణ ప్రారంభం కావచ్చును. ఈ సంఘర్షణే జరిగితే, అమాయిక హిందువులు కొన్నిలక్షలమంది మరణించవచ్చును. కాని భారతదేశానికి ముస్లింపీడ శాశ్వతంగా విరగడైపోతుంది.



# కాశ్మీర్

కాశ్మీర్ సంస్థానం ఇండియా, పాకిస్థాన్, ఆఫ్ఘనిస్తాన్, టిబెట్, చైనా, రష్యాలకు సరిహద్దునవున్నది. ఇన్ని ముఖ్యదేశాలకు సరిహద్దున వున్న దేశం ఇంకేదీలేదు. కాశ్మీర్ ఏదేశ అధికారంలోవుంటే ఆ దేశం అంతర్జాతీయంగా బలపడుతుంది. కాశ్మీర్ సంస్థానాన్ని పాలిస్తున్న వారు ఆఫ్ఘనిస్థాన్, పాకిస్థాన్ రాజ్యాలను అదుపులో పెట్టుకో గలుగుతారు. టిబెట్‌పై పెత్తనం చేయగలుగుతారు. పాకిస్థాన్ స్వతంత్ర రాజ్యంగా ఎంత బలపడినా, దానికి సముద్రతీరంవున్నా, దాని ఉత్తరభాగమంతా కాశ్మీర్ భూభాగంచే ఆవృతమైవుండి, కాశ్మీరు నుండి పశ్చిమపంజాబ్, సరిహద్దురాష్ట్రాలకు అనేక చక్కని రహదారులు వుండటంవలననూ, పాకిస్థాన్‌గుండా ప్రవహించే నదులన్నీ కాశ్మీర్‌నుండి ప్రవహిస్తుండటం వలననూ పాకిస్థాన్ భద్రతయేగాక, అభివృద్ధికూడా కాశ్మీర్ పాలకుల దయాదాక్షిణ్యాలపై ఆధారపడివుండును. ఇంతకీలక ప్రాముఖ్యం వుండటంవలననే కాశ్మీర్ సమస్యపై అగ్రరాజ్యాల విభేదాలుకూడా కొంతవరకు ప్రతిఫలించినవి.

భారతదేశంలో జేరటమో, పాకిస్థాన్‌లో జేరటమో తేల్చుకోలేక ఆగస్టు 15-వ తేదీ నాటికి సందిగ్ధావస్థలో ఉండిపోయిన సంస్థానాలలో కాశ్మీర్ ఒకటి. రెండు అధినివేశాలతోను యథాతథపు ఒడంబడికలు చేసుకుని, వీలైతే స్వతంత్రంగానే వుండిపోవచ్చునని కాశ్మీర్ మహారాజా ఆశించి వుండవచ్చును.

తనతో యథాతథపు ఒడంబడికలు చేసుకొనవలసిందని కాశ్మీర్ మహారాజా ఇండియా, పాకిస్థాన్ మంత్రివర్గాలను 1947వ సం॥ ఆగస్టు 12 వ తేదిననే అర్థించాడు. ఇండియాకు ఈ విషయమై పంపిన తంతి, కాశ్మీర్ తంతి ఉద్యోగులు 27 వ తేదీవరకు త్రొక్కిపట్టి వుంచినారట! అయినను, కాశ్మీర్‌తో యథాతథపు ఒడంబడిక చేసికొనుటకు భారత

ప్రభుత్వము అంగీకరించలేదు. మహారాజా తంతి అందగానే, పాకిస్థాన్ మాత్రం అందుకు అంగీకరించి, యథాతథపు ఒడంబడిక చేసుకుని, దానిప్రకారం కాశ్మీర్‌లోని తంతి తపాలాలు, రైళ్ళ రాకపోకల నిర్వహణ వప్పగించుకున్నది. ముఖ్యమైన రవాణా, రాకపోకలు తమ చేతిలో వున్నవి కాబట్టి ఎప్పటికైనా కాశ్మీర్ తమలో జేరిపోతుందని పాకిస్థాన్ అధికారులు భావించారు; అయినా సంతృప్తిజెందక కొంచెం ఒత్తిడిచేసి వీలైనంతత్వరలో కాశ్మీరును చేర్చుకోవాలని వారు ఆతృత పడుతూ, కాశ్మీర్ ప్రభుత్వాన్ని అనేకవిధాల ఇబ్బందులు పెట్టటం ప్రారంభించారు.

పశ్చిమ పంజాబ్‌నుండి, సరిహద్దు రాష్ట్రంనుడి దుండగులు ముఠాలు ముఠాలుగా కాశ్మీర్‌లో ప్రవేశించి, మహారాజాకు వ్యతిరేకంగా ప్రచారం చేయుటము, ముస్లిమేతరులను హింసించుటము, ముస్లిము లెవరైనా అడ్డంవస్తే, వారినీ, ఆ గ్రామములనూకూడా ధ్వంసం చేసి వెంటనే పాకిస్థాన్‌లోకి పారిపోవటం ప్రారంభించారు. సెప్టెంబరు నెలలో ఈ దాడులు మరీ ఉధృతమయిపోయినవి. ఇట్టి దోపిడీముఠాలను గూర్చి పాకిస్థాన్ అధికారులకు, సైనికాధికారులకు ఫిర్యాదులు చేస్తే, అటువంటి దాడులు జరగటంలేదని, ఒకవేళ జరిగితే ఆ ముఠాలను అణచివేస్తామని జవాబుచెప్పారు. పైగా, జమ్మూరాష్ట్రంలో ముస్లిములనే హత్యచేస్తున్నారనీ జమ్మూనుంచి పశ్చిమ పాకిస్థాన్‌లోనికి దుండగులు ప్రవేశించి అల్లకల్లోలం చేస్తున్నారనీ పాకిస్థాన్ ప్రభుత్వం అక్టోబరు 12 వ తేదీన మహారాజాకు ఆక్షేపణ పంపింది. ఆ ఆరోపణలు కేవలం అసత్యమనీ, ఏదో ఒక సాకుతో కాశ్మీర్‌ను వత్తిడిచేయుటానికి ఇదొక పన్నాగమనీ, కాశ్మీర్ రావలసిన పెట్రోల్, ఆహారపదార్థాలు, ఉప్పు పంచదార, బట్ట మొదలగు అత్యవసర సరుకులు రానుండా నిలిపి వేస్తున్నారనీ, సంస్థాన తంతి, తపాలాలు సరిగా నిర్వహించటంలేదనీ ఎదురు ఆరోపణలుచేస్తూ, అక్టోబరు 18 వ తేదీన కాశ్మీర్ మహారాజా సమాధానం పంపాడు. రవాణాను నిలిపివేసిన సరుకుల వివరాలుకూడా

ప్రకటించారు. ఇంతేగాక, జిన్నా, లియాకతాలీఖాన్‌లు కలిపించుకుని, పరిస్థితి చక్కబరచకపోతే ఇతర మిత్రుల సహాయం అర్థించవలసి వస్తుందనికూడా ఈ సమాధానంలో మహారాజా హెచ్చరిక చేశాడు.

కాశ్మీర్ ప్రధానిని కరాచీ పంపి, వివాదం పరిష్కరించుకోవలసిందని పాకిస్తాను గవర్నర్‌జనరల్ అక్టోబరు 25 న మహారాజాకు తంతి నిచ్చెను. కాని అప్పటికే యుద్ధం ప్రబలంగా ప్రారంభమైంది. అక్టోబరు 24 వ తేదీననే దుండగులు జీలం నదిదాటి, పూంచ్ జిల్లాలో ప్రవేశించి, శ్రీనగర్ - రావల్పిండిరోడ్డును ఆటకాయించారు. సంస్థాన సేనలు పూంచ్ పట్టణంలో తలదాచుకోవలసివచ్చింది.

కాశ్మీర్ పైకి దుండగులు ఎత్తిరాకుండా ఆటకాయించే వుద్దేశ్యం పాకిస్థాన్ ప్రభుత్వానికి లేదని తెలిపోయిన తర్వాత కాశ్మీర్ ప్రభుత్వం భారతప్రభుత్వ సహాయాన్నర్థించింది. అక్టోబరు 24 వ తేదీన ఆయుధ సామగ్రి సరఫరా చేయవలసిందని అర్థిస్తూ కాశ్మీర్ ప్రభుత్వం భారత ప్రభుత్వానికి వర్తమానం పంపింది. అక్టోబరు 25 వ తేదీన సంస్థాన శాఖ కార్యదర్శి వి. పి. మీనన్ శ్రీనగర్ వెళ్ళి, వచ్చాడు.

అక్టోబరు 26 వ తేదీ ఆదివారంనాడు భారతమంత్రులు విరామం లేకుండా సంప్రదింపులలో పాల్గొనవలసి వచ్చినది. వి. పి. మీనన్ తెచ్చిన వర్తమానాలను సర్దార్‌పటేల్ మంత్రివర్గానికి తెలియజేశాడు. మీనన్‌తోపాటు న్యూఢిల్లీవచ్చిన షేక్ అబ్దుల్లాతో తాను జరిపిన సంప్రదింపులపైనం పండిట్ నెహ్రూ మంత్రిమండలికి నివేదించాడు. కాశ్మీర్ ప్రధాని మహాజన్ న్యూఢిల్లీవచ్చి భారతప్రభుత్వ సహాయాన్నర్థించాడు. శ్రీనగర్‌కు 30 మైళ్ళదూరములోనే దుండగులు దుష్కృత్యాలు జరుపుతున్నట్టుకూడా ఆనాడే వర్తమానం వచ్చింది. అయినా కాశ్మీర్‌ను చేర్చుకొనుటకు భారతప్రభుత్వం అంగీకరించలేదు. సంస్థానంలో వెంటనే ప్రజాప్రభుత్వమేర్పరచవలెననీ, శాంతియుత పరిస్థితులేర్పడిన తర్వాత ఏ అధినివేశంలో జేరాలనే ప్రశ్నపై "ప్లెబిసైట్" జరపాలనీ, ఈ షరతులకు కాశ్మీర్ ప్రభుత్వం ఆమోదిస్తే, భారత యూనియన్‌లో తాత్కాలి

కంగా జేర్చుకుంటామనీ భారతప్రభుత్వం స్పష్టపరచింది. భారతప్రభుత్వం విధించిన షరతులకు అంగీకరిస్తూ, తన సంస్థానాన్ని రక్షించవలసిందని మహారాజా అక్టోబరు 26 వ తేదీ భారత గవర్నర్ జనరల్‌కు ఒక లేఖ వ్రాసి వి. పి. మీనన్ ద్వారా అందజేశాడు. అక్టోబరు 27 వ తేదీ భారతప్రభుత్వం దానిని అంగీకరించింది. షేక్ అబ్దుల్లాను తన ప్రభుత్వాధిపతిగా నియమిస్తున్నానని కూడా మహారాజా తన లేఖలో తెలియజేశాడు.

అక్టోబరు 26 వ తేదీ రాత్రంతా పనిచేసి, 27 వ తేదీ సూర్యోదయంతోపాటు భారత సేనలుకూడా ప్రత్యక్షమై శ్రీనగర్ ప్రజలకు ధైర్య, ఉత్తేజాలు కలిగించినవి. షేక్ అబ్దుల్లా నాయకత్వాన, కాశ్మీర్ జాతీయమహాసభ స్వచ్ఛంద సైనికులు నిరాయుధులై కూడా దేశరక్షణకు పూనుకొన్నారు. మొదట్లో భారత సేనలు కొద్దిగా వెళ్లెను. తర్వాత ఎక్కువమందిని, ఎక్కువసామగ్రిని భూమార్గంగాను, వాయుమార్గంగాను పంపగలిగారు. అంతటితో దుండగుల పురోగమనం ఆగిపోయింది.

కాశ్మీర్‌లో దుండగులు ప్రవేశించినప్పటినుండి సరిహద్దు ప్రధాని కయూంఖాన్ వారికి అన్నివిధముల సహాయము చేయటమేగాక, కాశ్మీర్‌పై దండెత్తివలసిందని పఠాన్‌లను ప్రోత్సహిస్తూ, కాశ్మీర్ భారతదేశంలో జేరటం నిరసిస్తూ అనేక ఉపన్యాసాలుకూడా చేశాడు. పాకిస్థాన్ ప్రోద్బలంపై, పాకిస్థాన్ సహాయంతో అజాద్ కాశ్మీర్ ప్రభుత్వ మను పేరుతో ఒక కీలుబొమ్మ ప్రభుత్వాన్నేర్పరచి, సర్దార్ ఇబ్రహీంఖాన్ అను అనామకుని దానికి అధిపతినిజేసి, వీరు దానిచాటున ఆటలాడుతున్నారు. నవంబరు 16 వ తేదీన లియాకతాలీఖాన్ రేడియోలో ప్రసంగిస్తూ, కాశ్మీర్‌సమస్యను భద్రతామండలికి నివేదించి, పరిష్కారంచేసుకోవాలని సూచించాడు. కాశ్మీర్ సమస్యను మంచిగా పరిష్కారం చేసుకోవటానికి ఉభయ అధినివేశాల గవర్నర్ - జనరల్‌లు, ప్రధానులు సమావేశం కావాలని తాము రెండు పర్యాయాలు సూచించామనీ, కాని పండిట్ నెహ్రూ అస్వస్థతగావున్నాడని సాకు

చెప్పి ఈ సమావేశాలు జరుగనివ్వలేదనీ, నవంబరు 1 వ తేదీన జిన్నా మౌంట్ బాటన్‌కు కొన్ని సూచనలు అందజేస్తే వాటికి ఇంకా సమాధానాలే ఇవ్వలేదనీ ఆరోపించాడు. జిన్నా ప్రతిపాదనలను మౌంట్ బాటన్ తిరస్కరించెను. దుండగులను కాశ్మీర్‌లోనికి రానివ్వవద్దనీ, వారికి ఆయుధాలు, ఇతరసామగ్రి సరఫరా చేయవద్దనీ పండిట్ నెహ్రూ అనేకపర్యాయాలు లియాకతాలీఖాన్‌కు తంతివార్తలు పంపారు. వీటికి కొన్నింటికి జవాబులేదు; కొన్నింటికి పెడసర జవాబులు, దుండగులు రావటంలేదని, కాశ్మీర్‌లో ముస్లింలనే హింసిస్తున్నారనే ఆరోపణలు వచ్చాయి. ఆఖరుకు డిశెంబరు 22 వ తేదిన జరిగిన ఉభయ అధినివేశ ప్రతినిధుల సమావేశములో పండిట్ నెహ్రూ లియాకతాలిఖాన్‌కు ఒకలేఖయిస్తూ, బుధవారంలోగా దానికి సమాధానం రాకపోతే కాశ్మీర్ సమస్య భద్రతామండలికి నివేదించబడునని తెలియజేశాడు. ఈ లేఖ లియాకతాలీకి స్వయంగా ఇచ్చినా సమాధానమురాలేదు. చిట్టచివరకు డిసెంబరు 31 వ తేదీన పాకిస్థాన్‌పై భారతప్రభుత్వం భద్రతామండలికి ఫిర్యాదు చేసింది.

భద్రతామండలికి భారతప్రభుత్వం చేసిన ఫిర్యాదులో పాకిస్థాన్ దుండగులకు సహాయపడుతున్నదనీ, దానిని ఆపించవలెనని కోరబడినది. దీనికి సమాధానముగా జఫ్రుల్లాఖాన్ పాకిస్థాన్ దుండగులకు సహాయం చెయ్యడం లేదనీ, కాశ్మీర్ ప్రజలు వారి బంధువులు మాత్రమే కాశ్మీర్‌లో తిరుగుబాటు జరుపుతున్నారనీ, భారతసేనలు కాశ్మీర్‌లోనే గాక భారతదేశమంతటా ముస్లింజాతి నిర్మూలనకు ప్రయత్నం చేస్తున్నాయనీ, జునాగడ్‌ను అన్యాయంగా ఆక్రమించుకున్నారనీ, ఒడంబడికలను ఆమోదించి కూడా ఆదరించటంలేదనీ, అందువలననే సరిహద్దు జాతులకు భారతదేశంపై కోపంవచ్చి కాశ్మీర్‌లో విప్లవం లేవదీశారనీ, వారి నాపుట పాకిస్థాన్‌కు శక్యంగాదనీ, కాశ్మీర్‌నుండి భారతసేనలు వైదొలగితే దుండగులు తమంతతామే వెళ్లిపోతారనీ ఎదురు వాదించాడు. భారతదేశ పరిస్థితులను సరిగా అవగాహన

చేసుకోని భద్రతామండలికి ఇదంతా నిజంగానే కనిపించింది. జనవరి 20 వ తేదీన భద్రతామండలి ఒక తీర్మానంలో, ఒక ఉప సంఘాన్ని కాశ్మీర్ పంపించి, రెండు అధినివేశాలకు సామరస్యం కుదిర్చే టందుకు పని చేయించాలని నిర్ణయించింది. ఇప్పటివరకు కాశ్మీర్ వివాద మని పేరుతోవున్న ఈ ఫిర్యాదును ఇండియా పాకిస్థాన్‌ల వివాదంగా మార్పించి, తాను సూచించిన అన్ని విషయాలు అతిత్వరగా విచారించే టట్లు చేయవలసిందని జఫ్రుల్లాఖాన్ అప్పుడు భద్రతామండలి అధ్యక్షుడు గానున్న లాంగెస్ హూవ్‌నుకోరి, ఒప్పించాడు. భారత ప్రతినిధులు ఎంతకాదన్నా వినక, ఈ ఫిర్యాదు స్వరూపం మార్చివేశారు. దుండగు లను ఉపసంహరింప జేయవలసిందని పాకిస్థాన్‌కు ఆదేశింపవలసిందనీ: దుండగులు తొలగిపోయిన తర్వాత భద్రతామండలి పర్యవేక్షణక్రింద ప్లెబిసైట్ జరిపించవచ్చుననీ సూచిస్తూ భారత ప్రతినిధి ఒక తీర్మా నము ప్రవేశపెట్టగా భారతసేనలు, దుండగులు, ఒకేపర్యాయం వైదొలగాలనీ, షేక్ అబ్దుల్లా ప్రభుత్వాన్ని తొలగించి ఒక 'తటస్థప్రభుత్వా' న్నేర్పరచ వలసిందనీ కోరుతూ పాకిస్థాన్ ప్రతినిధి ఒక తీర్మానాన్ని, దాదాపు పాకిస్థాన్ సూచనలనే అంగీకరిస్తూ, అస్పష్టంగావున్న ఒక తీర్మానాన్ని భద్రతా మండలి అధ్యక్షుడు ప్రవేశపెట్టారు. ఈరెండు తీర్మానాలను భారత ప్రతినిధులు తీవ్రంగా ప్రతిఘటించారు, ఇదంతా జనవరినెల ఆఖరు వారంలో జరిగింది. ఫిబ్రవరినెల ప్రారంభం కాగానే, కెనడాప్రతినిధి భద్రతామండలి అధ్యక్షుడయ్యెను. అయినను ఈ తీర్మానాలపై చర్చలు జరిగెను. బ్రిటిషు, అమెరికన్ ప్రతినిధులు పాకిస్థాన్‌పట్లనే సుముఖత వహించిరి. ఇందుకు భారత ప్రభుత్వ ఫిర్యాదు మంచిచెడ్డలుగాక అగ్రరాజ్యముల విభేదాలే కారణము. ఒకవేళ రష్యాతో యుద్ధము సంభవిస్తే, భారత దేశం తటస్థంగా వుండిపోవచ్చును కాబట్టి ఇప్పుడు కాశ్మీర్‌ను పాకిస్థాన్‌కు కట్టబెడితే అక్కడ తాము స్థావరాలు ఏర్పరచుకుని రష్యాపై దాడి చేయవచ్చునను అభిలాషతో వీరు పాకిస్థాన్‌కు మద్దతుచేసిరి.

భద్రతామండలి వైఖరిపట్ల తీవ్రంగా అసంతృప్తిజెంది, సమావేశాలు కొన్నాళ్ళు వాయిదావేసి, తాము తిరిగివెళ్ళి తమ ప్రభుత్వంతో సంప్రదింపులు జరుపుకోటానికి అవకాశం యివ్వవలసిందని భారతప్రతినిధి కోరాడు. పాకిస్థాన్ ప్రతినిధి వద్దంటున్నా, భద్రతామండలి ఇందుకు ఆమోదించింది. భద్రతామండలి సమావేశం మార్చి 10 వ తేదీవరకు అప్పుడు వాయిదావేశారు.

మార్చి 1 వ తేదీన కాశ్మీర్ మహారాజా తన సంస్థానములో సంపూర్ణబాధ్యతాయుత ప్రత్వము నేర్పరుస్తూ ఒక ప్రకటన చేసెను. ఆనాటినుండి షేక్ అబ్దుల్లా ప్రధానిగా ప్రభుత్వ మేర్పడెను.

భద్రతామండలి తిరిగి మార్చి 10 వ తేదీన సమావేశమైనప్పుడు చైనా ప్రతినిధి అధ్యక్షత వహించెను. ఈయన యితరదేశముల ప్రతినిధులతోను, వార్థ తిరిగి వచ్చిన తరువాత ఇండియా, పాకిస్థాన్ల ప్రతినిధులతోను సంప్రదింపులు జరిపి ఒక తీర్మానమును తయారుచేసెను. ఈ తీర్మానము భారతప్రక వ్యమునకు చాలవరకు అంగీకారయోగ్యమేగాని పాకిస్థాన్ ప్రతినిధి అంగీకరింపలేదు. ఇంతలో చైనా ప్రతినిధి మారి కొలంబియా ప్రతినిధి అధ్యక్షుడగుటతో ఈ తీర్మానము అడుగున పడి పోయినది.

భద్రతామండలిద్వారా పాకిస్థాన్ సాధింపదలచినవి రెండు ప్రయోజనములు: 1. భారతసేనలను కాశ్మీర్నుండి ఉపసంహరింపజేయుట, 2. షేక్ అబ్దుల్లాను ప్రభుత్వమునుండి తొలగించుట. ఈ రెండువిషయములకు భారతప్రభుత్వము సుతరాము అంగీకరించదు. కొలంబియా ప్రతినిధి ప్రవేశపెట్టిన మధ్యవర్తి తీర్మానము మొత్తముమీద పాకిస్థాన్కే అనుకూలముగా నున్నది. కాశ్మీర్కు వెంటనే ఒక 'సౌహార్దసంఘమును' పంపవలెననీ, కాశ్మీర్నుండి పాకిస్థాన్ దుండగులను, భారతప్రభుత్వము తన సేనలను కొంతవరకు ఉపసంహరించునట్లు ఈ సంఘము చేయవలెననీ, షేక్ అబ్దుల్లా ప్రభుత్వములో అందరికీ స్థానము లివ్వవలెననీ, అటుపైన ప్లెబిసైట్ జరుపవలెననీ ఈ తీర్మాన సారాంశము. ఇందు కొన్నిభాగ

ములకు భారతప్రభుత్వము తీవ్రఅసమ్మతిని తెలియజేసి వాటిని అంగీక రింపజాలమని చెప్పినది. సౌహార్ద్రసంఘ కార్యకలాపములనుగురించి సూచన లిచ్చుచు ఇండియాపై పాకిస్థాన్ చేసిన ఫిర్యాదులన్నియు విచారించవలెనని ఆదేశ మివ్వబడెను. ఇందుకు భారతప్రభుత్వము అస మ్మతి తెలియజేసి, సౌహార్ద్రసంఘము ఏయే విషయములలో తమతో సంప్రదించునో ముందు తెలియజేయవలసిందని కోరెను. సౌహార్ద్రసంఘము జమ్మూ, కాశ్మీర్ సమస్యనే ఆలోచించునని వీలైనప్పుడే ఇతరవిషయ ములనుగురించి వివరములుమాత్రమే సేకరించుననీ భద్రతామండలి అధ్యక్షుడు, సిరియా ప్రతినిధి మేనెలలో సమాధాన మిచ్చెను. భద్రతా మండలి ఆదేశము ప్రకారము దుండగులను ఉపసంహరించుట తన వశము కాదని పాకిస్థాన్ తెలియజేసెను. ఇట్టి పరిస్థితులలో, సౌహార్ద్రసంఘము జూన్ 15 వ తేదీన జినీవాలో సమావేశమై, ఒకవారంరోజులపాటు కార్యాచరణ విధానాన్నిగూర్చి చర్చలు జరిపి, జూలై నెలలో భారత దేశానికి వచ్చి, కరాచీలో కొందరు, న్యూఢిల్లీలో కొందరు మకాం వేసివుండి ఉభయ ప్రభుత్వములతోను సంప్రదింపులు జరిపిరి. కాని ఉభయ ప్రభుత్వములమధ్య సామరస్యము కుదురుసూచన లేమియు కనిపించుట లేదు.

వేసవిప్రవేశించినకొలదీ, కాశ్మీర్ యుద్ధరంగములో, భారత సేనల పురోగమనము చురుకయ్యెను. పాకిస్థాన్ నడిపిస్తున్న 'అజాద్ కాశ్మీర్' ప్రభుత్వం కూలిపోయే పరిస్థితి ఏర్పడింది. అందువలన పాకిస్థాన్ నాయకులు పాకిస్థాన్‌లో తీవ్రప్రచారంచేసి ఆజాద్ కాశ్మీర్ ప్రభు త్వానికి ధనము పోగుపోగుచేస్తూనూ, పాకిస్థాన్ సేనలనే ప్రత్యక్షముగా రణరంగాలలోనికి పంపిస్తూనూ తోడ్పడుతున్నారు.

భద్రతామండలి కాశ్మీర్ సంఘసభ్యులు ఇండియా, పాకిస్థాన్ ప్రభుత్వాల దృక్పథాలను తెలుసుకున్నారు. కాశ్మీర్ యుద్ధంలో పాకి స్థాన్ సేనలు పాల్గొంటున్నట్లు భారతప్రభుత్వం వీరికి రుజువుచేసింది.

అందువలన విధిలేక పాకిస్థాన్ ప్రభుత్వంకూడా తన సేనలు యుద్ధంలో పాల్గొంటున్నవని ఒప్పుకున్నది. పాకిస్థాన్‌లో ప్రవహిస్తున్న నదులన్నీ కాశ్మీర్‌నుంచే రావలసివున్నందునా, పాకిస్థాన్ శాంతిభద్రతలకు కాశ్మీర్‌పై తమ ఆధిపత్యం అవసరమైనందున తమ సేనలు యుద్ధంలో పాల్గొనక తప్పటంలేదని వారు వాదిస్తున్నారట! ఈ సంగతి భద్రతా మండలి చర్చలలో పాకిస్థాన్ ప్రతినిధి ఎందుకు తెలియజేయలేదో!

ఇప్పుడు రెండు అధినివేశాలమధ్య యుద్ధం జరుగుతున్నది. కాబట్టి యుద్ధవిరమణ చేయవలసిందని భద్రతామండలి ఆదేశించవచ్చునని, తద్వారానైనా తాము ఆక్రమించియున్న ప్రదేశాలు శాశ్వతంగా తమ ఆక్రమణలో వుండిపోగలవనీ వారు ఆశించి వుండవచ్చును. కాశ్మీరును పూర్తిగా శత్రు వినిర్ముక్తంచేసేవరకు యుద్ధవిరమణ జరగటం అసంభవమని భారతప్రభుత్వం స్పష్టపరుస్తున్నది. కాబట్టి రెండు అధినివేశాలమధ్య బాహాటంగా యుద్ధం జరుగవలసివచ్చును. బ్రిటన్, భద్రతామండలి దీనిని ఎట్లా అరికట్టగలుగునో దురూహ్యము.

కాశ్మీర్‌లో అన్నిరంగాలలోను శత్రుసేనలు ఉధృతంగా దాడి జరుపుచునే వున్నవి. భారతసేనలు శత్రువుల పురోగమనాన్ని అరికట్టివేయగలుగుతున్నవేగాని తాము పురోగమించటంలేదు. పాకిస్థాన్ సేనల ఆక్రమణక్రిందవున్న కాశ్మీర్ భూభాగం కొంతకాలానికైనా పాకిస్థాన్‌తో చేరిపోయే ప్రమాదం వున్నది కాబట్టి, కాశ్మీర్ రంగానికి ఇంకా ఎక్కువ సేనలు పంపిఅయినా, శత్రువులను పూర్తిగా తుడిచివేయవలెను. కాశ్మీర్ సమస్య పరిష్కారానికి ఇదిఒక్కటే ఆచరణయోగ్యమైన మార్గము. కాశ్మీర్ రణరంగంలో మన సేనల కృషి అసంతృప్తికరంగా లేకపోయినా హర్షదాయకంగా లేదు.

# పర్యావలోకనం

మనదేశానికి స్వాతంత్ర్యం లభించి, ప్రజాప్రభుత్వం ఏర్పడి, ఇప్పటికి ఒక సంవత్సరమైంది. గత సంవత్సరకాలంలో మన ప్రజా ప్రభుత్వం వివిధరంగాలలో సాధించిన కృషి గమనించాము. స్వాతంత్ర్యం లభించిన వెంటనే అనేక క్లిష్టరాజకీయ సమస్యలు ఉత్పన్నమై, భారత ప్రభుత్వము ముఖ్యమైన అభ్యుదయ కార్యక్రమముపై దృష్టి కేంద్రీకరించటానికి వీలులేకుండ చేశాయి. భారతదేశ అభ్యున్నతి ఇదివరకటివలె ఇప్పుడు కూడా ఒక ఆశయంగానే వున్నది; అందుకు సంబంధించిన కృషి విశేషించి జరగనేలేదు.

రాజకీయంగా దేశం 1947 అగస్టు 15 నాటికంటె ఈనాడే ఎక్కువ క్లిష్ట సమస్యలు ఎదుర్కొంటున్నది. సంస్థానాల సమస్య చాలా సంతృప్తికరంగా పరిష్కారమైనా, ఇతర అన్నిసంస్థానాల బదులు హైదరాబాద్, కాశ్మీర్‌లే క్లిష్ట సమస్యలైనవి. కాశ్మీర్‌లో పాకిస్థాన్‌తో అప్రకటిత యుద్ధం అతి తీవ్రంగా జరుగుతున్నది; అది ఇప్పట్లో అటూ యిటూ తేలేటట్లు లేదు. ఐక్యరాజ్యసమితికి ఫిర్యాదు చేసి లాభంకన్న నష్టమే ఎక్కువ పొందాము. దక్షిణాన హైదరాబాద్ కూడా కాశ్మీర్‌వలె రణరంగంగా మారేటట్లున్నది. ఐక్యరాజ్యసమితికి భారతప్రభుత్వంపై ఫిర్యాదు చేయటానికి నిజాం నిశ్చయించాడు. దీనివల్ల అతడికి ఏమీ లాభించినా, లాభించకపోయినా, మనను కొంత ఇబ్బంది పెట్టటంమాత్రం జరుగుతుంది. అగ్రరాజ్యాలు ఈ అవకాశాన్ని ఉపయోగించుకుని భారతప్రభుత్వానికి మరి కొన్ని సంకటాలు తెచ్చి పెట్టవచ్చును. మన వైదేశిక విధానానికి, మన రాయబారులకు ఇది మరొక పరీక్షారంగము కావచ్చును. హైదరాబాద్‌పై సైనిక చర్యలే అవుసరమైతే, భారత సైనికులకు కూడా ఇది పరీక్షారంగమౌతుంది; ఈ సైనిక చర్యలు ఒకవారం పదిరోజులకన్న ఎక్కువకాలం పట్టక పోవచ్చును. దేశ ఆంతరంగిక రాజకీయాలలో, కమ్యూనిస్టులు ఇప్పుడు పూర్తి దౌర్జన్యవాదులైపోయి, చికాకు కలిగిస్తున్నారు; ముస్లింలీగ్

మూర్ఖత, దానికి ప్రతిగా హిందూమహాసభ మంకుపట్టు ఏమీ తగ్గక, మతోన్మాదపరిస్థితి ఉపద్రవం ఎప్పటిలాగానే వుంది. కాంగ్రెస్‌వాదులలో నైతికపతనం హద్దుమీరిపోయి ఇతర క్లిష్ట సమస్యల పరిష్కారం కష్టతరం చేస్తున్నది. కాంగ్రెస్‌పార్టీ చివరకు చైనా క్యూమింగ్‌టాంగ్ పార్టీవలె తయారవుతుందేమోనని ఆందోళన పడవలసి వస్తోంది.

ఆర్థికంగా కూడా పరిస్థితి సంవత్సరారంభంకన్న అంతంలోనే ఎక్కువ ఆందోళన జనకంగా వుంది. విదేశాలనుండి దిగుమతులు వృద్ధిచేసి, కరువురాకుండా కాపాడుతున్నామే గాని దేశంలో అధికాహారోత్పత్తి ఏమీ జరగటం లేదు. పారిశ్రామిక అభివృద్ధి ఏమీ జరుగలేదు సరికదా, వున్నఫ్యాక్టరీలలో కూడా ఉత్పత్తి ఆందోళన జనకంగా పడిపోయింది. పెట్టుబడిదారులు వాస్తవంగా సమ్మెచేస్తున్నారు. ప్రభుత్వం ప్రతివిషయంలోను వారిని సాగదియ్యవలసి వస్తున్నది. కార్మికరంగంలో పరిస్థితికూడా ఏమీ ఉత్సాహ పూరితంగా లేదు. కంట్రోల్ తొలగిస్తే తామేదో పెద్ద సహకారం చేస్తామని చెప్పి, నమ్మించి, వర్తకులు, పెట్టుబడిదారులు, ప్రజలను, ప్రభుత్వాన్ని మోసం చేశారు. గత్యంతరంలేక ప్రభుత్వం తిరిగి కంట్రోల్సు పెట్టవలసి వస్తున్నది. ప్రతివస్తువు ధర ఈ సంవత్సరంలో రెట్టింపయ్యెను. కంట్రోల్ తొలగించటంతో బ్లాక్‌మార్కెట్‌ను వాస్తవ మార్కెట్‌గా గుర్తించి నట్లయ్యెను. జీతాలు, ఆదాయము పెరగక, జీవనవ్యయం పెరిగిపోయి, మధ్య, బీదతరగతుల జీవితం కష్టతరమైపోయి, అసంతృప్తి కలిగిస్తున్నది. ధనోల్బణ ప్రమాదము హెచ్చిపోయింది. ధరలు అరికట్టటానికి, ధనోల్బణం తగ్గించటానికి బడ్జెట్‌లో ఎట్టి ఏర్పాట్లు చేయలేదు; సరి కదా, తద్వ్యతిరేకం జరిగింది. పారిశ్రామికాభివృద్ధి, వ్యవసాయ అభ్యున్నతి తీవ్ర ఆశాభంగం కలిగించాయి.

కాందిశీకులు ఇంకా సమస్యగానే వున్నారు. పాకిస్థాన్ వైఖరి ప్రశ్నార్థకంగా వుంది. ఉద్యోగుల ప్రవర్తన, కాంగ్రెస్‌వాదుల ప్రవర్తన ఆశ్చర్యార్థకాలుగా వున్నవి. అవినీతి, లంచగొండితనము బ్రిటిష్‌పాలనలో

కన్న పెచ్చుపెరిగాయి. అధికారంలో వున్నవారు దానికి అంటిపెట్టుకుని వుండటానికి, ఇతరులు దానిని పొందటానికి తీవ్రంగా ప్రయత్నిస్తున్నారు. రాజ్యాంగపరిషత్తు ఎప్పుడు సమావేశమౌతుందో అనిశ్చితంగానే వుంది; ఇప్పుడు రచించిన రాజ్యాంగచట్టం చాలమందికి అసంతృప్తికరంగానే వుంది. ఈ క్రొత్తరాజ్యాంగచట్టంప్రకారం ఎప్పుడు ఎన్నికలు జరిగి, సామాన్య మానవుడి ప్రతినిధులు ఎప్పుడు అధికారంలోనికి వస్తారో తెలియదు. రాష్ట్రతత్వమును నిరసిస్తూ, దానివల్ల అధికంగా లాభం పొందుతున్నవారే, భాషాప్రయుక్తరాష్ట్రవిభజనను వాయిదావేస్తున్నారు. వాస్తవానికి, రాష్ట్రవిభేదాలను అంతమొందించటానికి రాష్ట్రపునర్విభజన ఒక్కటే మార్గము. ప్రతివిషయంలోను భారతప్రభుత్వచర్యలు అసమగ్రంగాను, ఆలస్యంగాను జరుగుతున్నవి.

ఇండియా-బ్రిటన్‌ల భవిష్యత్ సంబంధాల విషయమై ఇంకా ఏ నిర్ణయము జరగలేదు. భారతదేశం అధినివేశంగా బ్రిటిష్ సామ్రాజ్యకూటమిలోనే వుండిపోవటమో, సర్వస్వతంత్ర రిపబ్లిక్‌గా సామ్రాజ్యకూటమితో తెగతెంపులు చేసుకోవటమో రాజ్యాంగపరిషత్తు ఈ పర్యాయం సమావేశమైనప్పుడు నిర్ణయింపబడుతుంది. గత సంవత్సరంలో ఇండియా-బ్రిటన్‌ల సంబంధాలు ఉభయపక్షాలకు సంతృప్తికరంగానే సాగినవి. కాశ్మీర్ సమస్యపై బ్రిటన్ వైఖరి మనకు కొంచెం కష్టం కలిగించినా స్టర్లింగు ఒడంబడికలు, ఇతర అనేక ఏర్పాట్లు మనకు అనుకూలంగానే జరిగినవి. హైదరాబాద్ విషయంలో బ్రిటిష్ కార్మిక ప్రభుత్వవైఖరి చాల ప్రశంసనీయముగా నున్నది. ఐక్యరాజ్యసమితిలో హైదరాబాద్ సమస్య చర్చకు వచ్చినట్లయిన బ్రిటన్ దానిని వీటో చేయుటకుకూడ నిర్ణయించినది. 1947 ఆగస్టు 51 వ తేదీ తర్వాత దాదాపు ఒకసంవత్సరకాలము మన గవర్నర్-జనరల్‌గా వున్న మౌంట్‌బాటన్ కృషివల్లకూడా ఈ దేశములో బ్రిటన్‌పట్ల స్నేహభావము వృద్ధిపొందినది. సామ్రాజ్యకూటమినుండి విడిపోవుటవల్ల లభించగల అధిక సౌకర్యములు ఏమీ లేవు. కాబట్టి బహుశః సామ్రాజ్య

కూటమిలో వుండటానికే రాజ్యాంగపరిషత్తు నిర్ణయించును. ఒకవేళ ఇట్టి నిర్ణయము జరిగినా భవిష్యత్తులో విడిపోవుటకు ఎట్టి అభ్యంతరము వుండదు. కాబట్టి ఇది సముచితనిర్ణయమేనని చెప్పవలెను. బ్రిటన్‌లో కార్మికపక్షప్రభుత్వము అధికారములో నున్నంతకాలము సామ్రాజ్య కూటమిలో నుండవచ్చును.

నాయకులు పరిపాలనానుభవం యిప్పుడిప్పుడే పొందుతున్నారు. మంచిమాటలు చెప్పే పెట్టుబడిదారులవలనుండి వారు ఇప్పుడే బైట పడుతున్నారు. కృత్రిమ 'ఆదర్శకత' లోపాలను గ్రహించి, వాస్తవ పరిస్థితులకు అనుగుణంగా, నిబ్బరంగా, స్ఫుటంగా వ్యవహరించటం వారిప్పుడే అలవరచుకుంటున్నారు. పార్టీ రాజకీయాల ప్రయోజనాలకు దోసిలొగ్గటం, దేశఅభ్యుదయానికి ఆటంకమని వారిప్పుడిప్పుడే గ్రహిస్తున్నారు. స్వలాభాపేక్షాపరులకు లొంగిపోకుండా, ప్రజాసామ్యానికి సేవచేయవలసిన విధానాలను అస్పష్టంగానైనా వారిప్పుడు చూడగలుగుతున్నారు. రాజకీయస్వాతంత్ర్యంతోపాటు ఆర్థికస్వాతంత్ర్యము, ఆర్థికసమత్వము, సామాజికన్యాయము ప్రజాసామాన్యాని కంతటికీ లభించగల శుభదినం ఇంకా ఎంతో దూరాన వున్నది; దానికి మార్గంకూడా ఏమాత్రం సుగమంగా లేదు. నవభారతచరిత్రలో, దీర్ఘకాలపుదృక్పథంతో పరిశీలిస్తే, ఈ తొలిసంవత్సరకృషి కేవలం చంటిపిల్లడి తొలి తప్పటడుగులాంటిది మాత్రమే అయినా భవిష్యత్తులో శీఘ్రపురోగమనానికి అది చక్కటినాంది అని జ్ఞాపకంవుంచుకుంటే, అసంతృప్తి జెందనవసరం లేదు.

—ooಜ್ಞoo—

